# రేపటి ప్రపంచం

(కథలు)



## మధురాంతకం రాజారాం



ప్రచురణ :

చిత్తూరు జిల్లా రచయితల సహకార ప్రచురణల

సంఘం

చిత్తూరు

ప్రథమ ముద్రణ : జూలై 1975



ముఖచిత్రం

బాపు

ము ద్ర ణ :

క్రాంతి ప్రెస్,

12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్,

మద్రాసు_1

వెల :

మేలుప్రతి : రూ. 10-00

సాదాప్రతి : రూ. 8-00

# ఒక మాట

ఆంధ్రదేశంలో పుస్తక ప్రచురణ, వాని విక్రయము ఎంత కష్టతరమైన విషయమో అందరికీ తెలిసిందే. కాని లక్ష్యసాధన కోసం ఎదురు దెబ్బలను లెక్కచెయ్యకుండా మేము గావిస్తున్న ప్రచురణలలో యిది ఆరవది.

శ్రీ మధురాంతకం రాజారాంగారి వందల కొలది కథల్లో ఆణి ముత్యాల్లాంటివానిని ఏర్చి కూర్చి ఈ సంపుటిని పాఠక లోకానికి అందిస్తున్నాము. వైవిధ్యంతో కూడుకొన్న ఈ కథలన్నీ సమకాలీన సమాజానికి ప్రతిబింబాలు. సహజంగా, సుందరంగా వుంటూ జీవితాలలోని లోతు పాతులను ఆకళింపుకు తెస్తాయివి.

సహకార సంఘాలు ప్రచురించిన పుస్తకాలను పాఠకులతోపాటు, గ్రంథాలయాలు, ప్రభుత్వము కొని మా ఉద్యమానికి చేయూత నివ్వాలని కోరుతున్నాము.

కె. రామకృష్ణ<br>
డైరెక్టరు<br>
చిత్తూరు జిల్లా రచయితల సహకార ప్రచురణ సంఘం.

చిత్తూరు<br>
23-5-75

# మాటలు నేర్చిన మధ్యతరగతి

ఏ సమాజంలోనైనా సగటు అక్షరాస్యత పెంచేదీ, సగటు ఆదాయం దారుణంగా దించేదీ, మధ్య తరగతి.

సమాజం పక్షాన కష్ట సుఖాలు వ్యక్తీకరించేదీ, విప్లవ సిద్ధాంతాలకు ఆలంబనం, బలం చేకూర్చేదీ, ఆ విప్లవానికి బలియైపోయేదీ గూడా మధ్య తరగతే.

విప్లవ సాహిత్యాన్ని సృష్టించే కవి, విప్లవ భావాలను ప్రచారంచేసే వక్త, కూలీల శ్రామికుల దైన్యాన్ని తలుచుకుని కంట తడిపెట్టే సంఘజీవి, ప్రాచీన సాహిత్యాన్నీ సాంప్రదాయాన్నీ విలబెట్టే పండితుడు—అందరూ సామాన్యంగా ఈ మధ్య తరగతివారే. కాని తమ జీవితాన్ని సమీక్షించుకుని తమ ఆర్థిక దారిద్ర్యాన్ని తలచుకుని బాధపడి, దాన్ని వ్యక్తీకరించాలన్న తపన ఈ మధ్య తరగతి ప్రజకు లేదు. తాము మాత్రం పరిస్థితులతో రాజీపడిపోయి, గుమాస్తాలుగా, బడిపంతుళ్లుగా, జీవితాలు ఈడ్చుకుంటూ, అందులో కవులైనవారు కథలు చెప్పగలవారు 'పేద ప్రజల' ప్రతినిధులై ఆవేగపూరితమైన రచనలు సాగిస్తారు. తమ సొంత స్థితిని వర్ణించడానికి మాత్రం వారికి మాటలు రావు. కారణం ఒకటే. మానసికంగా తాము పైవర్గానికి చెందినవారమనుకుంటారు. ఆర్థికంగా క్రింది వర్గాలకన్నా వారి పరిస్థితి మెరుగు గాదు.

ఇన్నాళ్ళకు, కేవలం మధ్య తరగతి జీవనాన్ని బహుముఖాలుగా కథలలో రూపొందించగల ప్రతిభావంతుడు తెనుగునాట అవతరించాడు. ఎప్పుడో అవతరించాడు. అయితే ఇన్నాళ్ళకు తన ప్రతిభా ముద్ర తెలుగు కథా సాహిత్యం మీద వేయడానికి దార్ఢ్యం సంపాదించాడు. ఆయన పేరే రాజారాం-మాటలు నేర్చిన మధ్య తరగతికి ప్రతినిధి.

మధ్య తరగతి ప్రజలలో సహజంగా వుండే లోభాలు, వెకిలి ఆశలు, పిచ్చి ఊహలు, బాధలు, ఆప్యాయతలు, అన్నీ ఏవగింపుతోగాక, మెల్లని

మందహాసంతో తమ కథలలో చిత్రించారు రాజారాంగారు. ఈ కథలు చదువుతుంటే "ఎంత వెర్రివాళ్లు ఆ ప్రజః" అనిపించదు. "ఎంత వెర్రి వాళ్ళం మనం!" అనిపిస్తుంది. ఈ కథలలో తరుచు 'నేను' ఒక పాత్రగా వస్తుంది. ఆ 'నేను'యే కథకుడు. అతడు పరిపూర్ణంగా మధ్యతరగతిలో ఒక భాగమై పోయి వుంటూనే, కాస్తా తటస్థునివలె తొలగి నిలిచి, సామాన్య సంఘటనలలోవి నాటకీయతను, పై చిత్రిని ఎత్తి చూపుతాడు.

రేపటి ప్రపంచానికి ప్రతినిధి ఒక కుర్రవాడు. తండ్రితో అతని జీవితం అతనికి పెద్ద చెరలాగ అగుపిస్తుంది. పోలీసు 'లాకప్'లోనే తనకు స్వేచ్ఛ వుందని అనుకుంటాడు. బయట వున్నదంతా తండ్రుల ప్రపంచకం. అందులో అతనికి స్వేచ్ఛ లేదు. అంతేగాదు. పోలీసు కానిస్టేబుల్ కి ఉద్యోగమే ఒక చెర. డ్యూటీ ఒక సంకెల. దాని పరిధినుంచి బయట పడాలన్న తపన అజ్ఞాతంగా అతనిలో వుంటుంది. కానీ బయటపడలేడు.

"స్వస్థానం" అన్న కథలో—ఒక చిన్న వుద్యోగికి కొత్తగా ఒక ఊరు బదిలీ అయింది. అద్దెకు రెండు యిళ్ళు చూశాడు. ఒకటి కూలిపేట మధ్య వుంది. రెండవది ఒక అందమైన బంగళా ఆవరణలో వున్న అవుట్ హవుస్. భార్య కూలిపేట యిల్లే ఎన్నుకుంది. కారణం ఏమీ లేదు. ఆమె మెడలో 'సాటివారు' మెచ్చుకోదగ్గ ఆభరణాలేవీ లేవు. కూలీల మధ్య వుంటే ఆమె 'అహం' కాస్తా తృప్తిపడుతుంది. అయితే భర్త ఆదాయంలో కొంత పొదుపు చేసి ఆమె ఒక నెక్లెస్ చేయించుకుంది. ఇప్పుడు భర్త మెడలు వంచి బంగాళా వెనుక వున్న ఇంట్లోకి కాపరం మార్పించింది. తన నెక్లెస్‌కి ఒక విలువ వస్తుందని. కాని ప్రక్క ఇంటిపిల్ల 'ఇది గిల్టా' అని అడగడం తోటే ఆమె అహం పూర్తిగా దెబ్బతింది. ఏడ్చి, పేచీ పెట్టి తిరిగి కూలిపేట ఇంటికి మకాం మార్పించింది. అసలు 'నకిలీ' ఆమె మనసులో వుంది. పిల్ల అడిగిన అమాయక ప్రశ్నలో లేదు. పాపం ఇది భర్తకి అర్థమైనా, మన ముందు అర్థంగానట్టు నటిస్తాడు.

'వెలుగు సముద్రంలో చీకటి దీవి' చాలా మంచి కథ. ఎన్నడూ వెలుగు చొరరాని, చొరడానికి వీల్లేని ప్రదేశం అది. ఆ చీకటి లోకంలో చిన్ని దీపం కునుకుతోంది. అది ఆ ఇంటి కోడలు. బడిపంతులుగా ఆ

వూరు వచ్చిన వ్యక్తి ఆమెకు అప్పు ఇవ్వడం, అది తీర్చడానికి ఆమె తండ్రి వద్దనుంచి తెప్పించిన డబ్బు భర్త వాడెయ్యడం, అతడు శతవిధాల ప్రయత్నించి ఆ ఊరునుంచి బదిలీ అయి వెళ్ళిపోతున్నప్పుడు ఆమె బాకీ తీర్చలేకపోవడం, అతన్ని అడ్రసు ఇమ్మనడం అతి పేలవమైన సామాన్య సంఘటనలవలె కనిపిస్తాయి. కాని రాజారాంగారు ఆ సంఘటనలలో ఎన్ని లోతుపాతు లున్నాయో, ఎంత నాటకీయత వుందో చెప్పకుండా చెప్పారు. ఆ కోడలు కునుకుతున్న దీప కళిక. కొడిగట్టి ఆరిపోవడంకన్నా దానికి భవిష్యత్తు లేదు. అది ప్రజ్వలించి ఆ చీకటి దీవిని వెలుగులో ఓంపడంకల్ల. కానీ ఆ చీకటి దీవిలో ఆ బడిపంతులుకి రవంత ఆశ్వాసం కలిగించిన ఆ వెలుగు రేకను అతడు జీవితాంతం మరచిపోలేడు.

మధ్య తరగతి ప్రజ సామాన్యంగా సోమరులు. నిన్న చేసిన పనే ఈవేళ చేస్తారు. నిన్న నడిచినదారినే ఈవేళ నడుస్తారు. ఇది మానసికమైన సోమరితనం. "ప్రొద్దు చాలని మనిషి" మాత్రం చేసిన పని చెయ్యడు. నిర్దిష్టమైన దారంటూ అతనికి లేదు. అయితే విశాలమైన ఆర్థిక, పారిశ్రామిక రంగాన్ని జయించి, అందులో తన స్థానం సుస్థిరం చేసుకోవాలన్న ఆకాంక్ష అతనికి లేదు. ఇరవై నాలుగు గంటలూ అతని కార్యకలాపాలకు చాలవు. ఆ పనులేవీ అతని స్థితిని మెరుగు పరిచేవిగావు, కాని వాటిలోనే పరిపూర్ణమైన తృప్తినీ, ఆనందాన్నీ అతను పొందుతున్నాడు. సంఘమంతా మధ్యతరగతి కాగలిగితే అతడు దానికి లక్ష్యప్రాయుడు.

"ఒకే కాడ రెండు పువ్వులు"లో ఒక తాశీలారుగారికి ఇద్దరు కొడుకులు. పెద్దకొడుకు ఆ తాశీల్దారుగారు గుమాస్తాగా వుండగా పుటాడు. అంచేత అతనిలో అణకువ, సౌజన్యం, పాటివారిని సమానులుగా చూసే స్వభావం వున్నాయి. రెండవ కొడుకు ఆయన హోదా పెరిగిన తరువాత పుట్టాడు. అతనికి తాశీల్దారుగారిని చూడానికి వచ్చిన వాళ్ళంతా తక్కువ రకం మనుష్యులు. తాశీల్దారుగారి చిన్ననాటి సహాధ్యాయి పని మీద ఆయన వద్దకు వచ్చినప్పుడు వీరి యిద్దరి స్వభావాలూ వ్యక్తమౌతాయి. అయితే వచ్చిన పెద్దమనిషికీ, ఆ తా ారుకీ కూడా ఈ సామ్యం వర్తిస్తుంది. వచ్చిన పెద్దమనిషి చిన్నప్పుడు తాశీలారుగారిని 'ఒరే' అని పిల్చేవాడు. కాని ఇప్పు

డతనికి ఆఫీసర్లంటే అమిత భయం. అంచేత హోదాలో వున్న బాల్య స్నేహితుణ్ణి 'ఏరా' అనలేకపోయాడు. ఒకే ఆర్థిక పరిస్థితిలోంచే వచ్చా రిద్దరూ. ఒకే బడిలో చదువుకున్నారు. అయితే వేరు వేరు రంగుల పూలుగా రూపొందారు.

ఈ సంపుటిలోనివన్నీ మంచి కథలు. కొన్ని చాలా మంచి కథలు. ఏ కథ చెప్పినా ఒక విశిష్టమైన పద్ధతిలో చెప్పగలరు రాజారాంగారు. ఆయన కథన శిల్పం గొప్పది.

ఈ కథలు చదువుతుంటే మనలను మనం బాగా అర్థం చేసుకో గలుగుతాం. మనలో వున్న పిచ్చి ప్రవృత్తులను చూసి నవ్వుకోగలుగుతాం. మన అవివేకాన్ని చూసుకుని జాలి పడగలుగుతాం. ఇంతకన్నా గొప్ప ప్రయోజనం కథా రచనకు మరొకటి లేదనుకుంటాను.

పాలగుమ్మి పద్మరాజు.

# అంకితం



మాన్య మిత్రుడు
మధుర హృదయుడు

శ్రీ నూతలపాటి గంగాధరం దివ్యస్మృతికి

మంచి గంధమువంటి మనసు కలిగినవాడు
అమృత కలశమువంటి హృదయమ్ము గలవాడు
ఎదురైన ప్రతివాని ఎదకు మోదము గూర్చి
చెలిమితో చలువపందిరులు వేసినవాడు

ఎక్కడమ్మా అరుణనాదు చెలికాడు?
ఒక్కడంటే ఒకడు కడు మంచివాడు.

ప్రాచీన కవులపై భక్తి గలిగినవాడు
సమకాలికులనెల్ల గౌరవించెడివాడు
కవితములో నవతపై మొగ్గుజూపెడివాడు
మానవత్వముకన్న మతము లేదనువాడు

ఎక్కడమ్మా అరుణనాదు చెలికాడు?
ఒక్కడంటే ఒకడు కడు మంచివాడు.

నీవు పారే నేలపైన పుట్టినవాడు;
నీలోన గ్రుంకులిడి ఆట లాడినవాడు
నీపైన కావ్యమ్ము వ్రాయగా వలెనున్న
మధురోహలెన్నెన్నొ నాకు దెల్పినవాడు

ఎక్కడమ్మా అరుణనాదు చెలికాడు?
ఒక్కడంటే ఒకడు కడు మంచివాడు.

అడ్డుగోడలు కూల్చి, ముళ్ళ కంచెలు కాల్చి
మానవాభ్యున్నతికి స్వాగతమ్మిడువాడు
ప్రేమించి ప్రేమలను కొల్లగొట్టినవాడు
రామగిరికే గొప్ప రాణదెచ్చినవాడు

ఎక్కడమ్మా అరుణనాదు చెలికాడు?
ఒక్కడంటే ఒకడు కడు మంచివాడు.

కవిత కొరకైపుట్టి, కవిగానే జీవించి
సుకవితా రాజ్యాల నేలుపాళేగాడు

ఎక్కడమ్మా అరుణనాదు చెలికాడు?
ఒక్కడంటే ఒకడు కడు మంచివాడు.

(అరుణా నదీతీరంలో వున్న చిన్న గ్రామం రామగిరి. అదే
నూతలపాటి గంగాధరం స్వగ్రామం)

# కథానుక్రమణిక

# రేపటి ప్రపంచం

ఉగాది సందర్భంలో లలిత కళా పరిషత్తువాళ్ళు ఆంధ్ర వారోత్సవాలు ఏర్పాటుచేసి ఎక్కడో పల్లెలోవున్న నాకు కూడా ఆహ్వానం అందజే శారు. భోజన సదుపాయాలు చూచేవరకే తమ వంతనీ వసతి సౌకర్యాలు ఎవరికి వారే చూచుకోవాలనీ హెచ్చరిక చేశారు. నాలోని కళాప్రియత్వానికి నిదర్శనంగా కళాపరిషత్తులో చాలాకాలంనుంచీ, నాకొక సభ్యత్వం వుంది. కానీ ఈ దఫా నేను సభలకు వెళ్ళాలనుకోడం నా సభ్యత్వపు రుసుము సద్వినియోగం కావాలనిమాత్రమే గాదు. కరపత్రం ద్వారా ఈసారి సభలకు పరాంకుశంగారు రాబోతున్నారన్న వర్తమానం తెలియగానే నాకు కోనరి కోనలో వాన కురిసినంత సంబరం కలిగింది.

పాతికేళ్ళనుంచీ నేను పరాంకుశంగారిని గురించి వింటున్నాను. ఆయన పెద్ద మేధావి. అయిదారు భాషలు ఆయనకు కొట్టిన పిండి. కవనం చెప్పడమేమో ఆయనకు కూసు విద్య. రచన చెయ్యడం ఆదొక హేలా విశేషం. పోగా ఉపన్యాసాలకు టికెట్లుపెట్టే సాంప్రదాయాన్ని ఆయన దగ్గ ర్నుంచీ మొదలుపెట్టవచ్చు. ఇష్టాగోష్టిగా మాట్లాడ్డానికి కూచున్నాసరే, నిమిష నిమిషానికి ఒక ఛలోక్తి ఊడిపడవలసిందే. ఆయన విదేశాలు తిరిగి వచ్చిన మనిషి. ఆ పర్యటనానుభవాలు చెబుతుంటే శ్రోతలకు స్వయంగా తామే ఆయా దేశాలకు వెళ్ళివచ్చినట్టుంటుంది. ఇదంతా ఆయన్ని గురించి నేను ఇతరులద్వారా తెలుసుకున్నది. పత్రికలో చదివి తెలుసుకున్నది. పరాంకుశం గారిని గురించి వింటున్నకొద్దీ, తెలుసుకుంటున్నకొద్దీ ఆయన్ని చూడాలన్న కోరిక నాలో బలపడుతూ వచ్చింది.

పరాంకుశంగారిపైన నాకు అభిమానం వుండవచ్చు. ఆ అభిమానం ఆరాధనగా కూడా పరిణమించి వుండవచ్చు. కానీ అందువల్ల ఆయన వ్యక్తి త్వంలోవున్న లోపాన్ని నేను కప్పిపుచ్చవలసిన అవసరమేమీ లేదు. మరేం లేదు. ఆయన త్రాగుతాడు. ఆయన త్రాగుతాడన్న విషయం తెలియని వాళ్ల

లేరు. మరొకటీ మరొకటీగాదు. ఆయన అన్నీ హైక్లాస్ పాలసీయాలే పుచ్చుకుంటాడు.

అయ్యా! పరాంకుశంగారు త్రాగుతారు నిజమే. నేను మిమ్మల్ని నిల దీసి ఒక మాట అడుగుతాను. ఆయన తాగితే మీదేం పోయింది. మీరేమైనా మీ డబ్బు పెట్టి ఆయనకు కొనిస్తున్నారా? లేదే! ఆయన తన డబ్బు తాను ఖర్చుపెట్టి, తన పొట్టలో తాను పోసుకుని, తన ఆత్మానందానికి తానే దారి వెతుక్కోవడంగూడా ఒక నేరమేనా? అయ్యలారా! ఆయన త్రాగి వచ్చింది విస్కీయా, బ్రాందీయా అన్న జిజ్ఞాస మీకెందుకూ? మీ పాటుకు మీరు ఆయన రచనా పటిమ చవి చూడండి! మరీ దగ్గరగా వెళ్తే దుర్గంధం భరించడం కష్టమే ననుకోండి, కానీ దూరంగా కూర్చుని ఉపన్యాసం వినొచ్చుగా! ఛత్. ఏం చాదస్తపు మనుషులండీ లోకులు?

ఆయన త్రాగుడుతో నాకు పని లేదు. ఆయనతోనే నాకు ప్రసక్తి. చేస్తున్న ఉద్యోగానికి నాలుగు రోజులు సెలవు పెట్టి హుటాహుటిగా పట్ట ణానికి బయల్దేరాను.

మార్గమధ్యంలో బస్సు చెడిపోయింది. రిపేరు కావడానికి రెండు గంటలు పట్టింది. ఫలితం ఆలస్యంగా వెళ్లడం. తీరా గమ్యస్థానం చేరుకొనే సరికి ప్రారంభోత్సవం జరుగుతోంది.

సభాభవనం ఇంకొక వందగజాల దూరంలో వున్నదనగా నా ఆత్రం కొద్దీ నేను అక్కడున్న వాళ్ళనెవరినో అడిగాను—"ఏమండీ! పరాంకుశం గారు వచ్చారా?" అని. "వచ్చేశారే! మాట్లాడుతున్నారు" అంటూ జవాబు వినవచ్చింది.

పరుగో పరుగు! మరు నిమిషంలో నేను హాల్లో వున్నాను.

దండిగా ఛాయాచిత్రాలు చూచి వున్నానేమో, పరాంకుశంగారు నాకొక అపరిచిత వ్యక్తిలా కనుపించలేదు. అనుదినం నాకళ్ల ఎదుట తిరుగాడు తున్న వ్యక్తిలాగే కనిపిస్తున్నారు.

నేను హాల్లోకి వెళ్ళి నిలుచుకునే టప్పటికి పరాంకుశంగారు మొహెంజొదారో శిధిలావశేషాలను బట్టి ఆనాటి మానవుడి చిత్తవృత్తిని, నాగరికతను మతింపు వేస్తున్నారు. అప్పటి సామాజిక స్థితిగతులను కళ్ళకు కట్టినట్లుగా వర్ణిస్తున్నారు. నాగరికత అన్నది ఒక కాలానికి పరిమితం కాదని ఆయన వివరిస్తున్నట్లుగా తరువాత నాకు తెలిసింది. సుఖశాంతులకోసం సాగించిన అన్వేషణలో మానవుడికి సంచార జీవనంకన్నా స్థిరజీవనమే శుభప్రదంగా తోచింది. ఆ విధంగా ఏర్పడినవే జనపదాలు. కాలక్రమాన ఈజిప్టులో పిరమిడ్లు లేచాయి. చైనీయులు మహాకుడ్యం నిర్మించారు. నాగరికతా ప్రస్థానంలో భవనాల నిర్మాణం ఒక మజిలీ. అలాగే సముద్రయానం ఇంకొక మజిలీ. మార్కోపోలో, కొలంబస్ వాస్కో-డిగామాలాంటి వాళ్ళు జాతులకు మధ్య సేతువులు వేశారు. కానీ మానవులందరూ ఒకచే నసుకోటానికి వీల్లేకుండా అంతకు మునుపే మతాలు పుట్టుకొచ్చాయి. ఆదిలో జీవితాలను ఒక సక్రమ పద్ధతి క్రిందికి తీసురావడానికి తోడ్పడినవే మతాలు. కానీ మత దురహంకారంవల్ల ఎన్నెన్నో ఉపద్రవాలు పొడసూపాయి. సమాజాన్ని పరోక్షంగా మత గురువులున్నూ, ప్రత్యక్షంగా రాజులున్నూ పరిపాలింప సాగారు. దండయాత్రలు, యుద్ధాలు, అంతః కల్లోలాలు ప్రజ్వలించాయి. జాతి జీవనంలో ఎంతగా భద్రత లేకపోయినా, ఒకవైపున శాంతికాముకుడైన మానవుడు విజ్ఞానాన్ని సముపార్జించుకోడానికి, వినోదాన్ని సంతరించుకోడానికి ప్రయత్నిస్తూ వచ్చాడు. భాషలు, కళలు, శాస్త్రాలు మొదలైనవన్నీ ఆ ప్రయత్నంలోనుంచే పుట్టుకొచ్చినవి!

ఇలా మాట్లాడుతూ వచ్చి పరాంకుశంగారు పదివేల యేండ్ల వయసు కలిగిన నాగరిక మానవుడు ఈనాడు విశ్వరూపాన్ని ధరించి చంద్రమండలాన్ని అంది పుచ్చుకున్నాడని చెప్పగానే సభ కరతాళ ధ్వనులతో మారుమ్రోగిపోయింది. ఉపన్యాసం వింటున్న తన్మయత్వంలో ఒకరి వీపు ఇంకొారు బాదేయడం గూడా నేను గమనించాను.

నిజం చెప్పొద్దూ! రసభంగం కలిగించే వాళ్ళంటే నాకు చాలా అయిష్టం. వెండి తెరపై సినిమా చూస్తుండగా నటీనటుల వ్యక్తిగత జీవితాలను గురించి అవాకులు, చవాకులు చెప్పుకునే వాళ్ళను చూస్తే నాకు

మందుకొస్తుంది. నా గ్రహచారం కొద్దీ ఈ సభలోకూడా అలాంటి ప్రబుద్ధుడొకడు అఘోరించాడు. ఏదో పెద్ద రహస్యం చెప్పదలచుకున్నట్టు అతడు దగ్గరగా వచ్చి "డోసు ఎక్కువగానీ, తక్కువగానీ అయినట్టు లేదు. పరాంకుశంగారు ఎంత బ్యాలన్స్‌డ్‌గా మాట్లాడారో చూశారా?" అన్నాడు.

ముఖాన చింతనీళ్ళు చల్లినట్లయింది నాకు. మౌనంగా అతడివేపు కొరకొరచూచి, నా పాటుకు నేను దూరంగా వెళ్ళిపోయాను.

పరాంకుశంగారి ప్రారంభోపన్యాసం తరువాత గూడా అయిదారుగురి ఉపన్యాసాలున్నాయట! కానీ సభాసదుల్లో ఆ ఉపన్యాసాలు వినాలన్న పట్టింపు కనిపించలేదు. సగానికి సగం మంది వెళ్ళిపోవడంతో సభాస్థలి బాగా పలచబడిపోయింది. వేదికకు దగ్గరగా వెళ్ళి నేనొక ఖాళీ కుర్చీ పట్టుకోగలిగాను. కానీ అక్కడైనా నేను సావధానంగా ఉపన్యాసాలు వినే వెసులుబాటు లేకపోయింది. బొట్టూ, కాటుకా పెట్టి పిలిచినట్లుగా ఎవడో ఒక అయిదేళ్ళ కుర్రాడు లోపలికి వచ్చి నా ముందరున్న కుర్చీలో ఆసీనుడై వున్నాడు. వాడి ధ్యాస ఉపన్యాసాలపైన ఉండాలనుకోడంలో న్యాయం లేదు సరే! కానీ బొమ్మలా కదలకుండా కూచో వచ్చుగదా! కూచోడే! వాడికి ముందరున్న కుర్చీలో చిన్న గోష్పాదమంత పిలకజుత్తున్న ముసలాయన కూర్చుని వున్నాడు. ఈ కుర్రకుంకకు సభా భవనంకన్నా, గోడల పైన వ్రేలాడుతున్న చిత్రపటాలకన్నా, వేదికపైన వెలసివున్న లక్ష్మీసరస్వతుల విగ్రహాలకన్నా ఈ చిన్న పిలకజుత్తే అత్యద్భుతమైన వస్తువులా కనిపించినట్టుంది. వాడు ముంగాళ్ళతో పైకి లేచి పిలకజుత్తును చాలా దగ్గరనుంచి పరిశీలించడానికి కుతూహల పడుతున్నాడు. ఇతరుల సొత్తు గనుక దాన్ని తాను తాకడానికి వీల్లేదన్న పరిజ్ఞానం వాడికి లేకపోలేదు. అందుకనే అరిచేతిని వీలైనంత దగ్గరకు తీసుకెళ్ళి పిలకజుత్తు ముద్దుముచ్చటలను కొలుస్తున్నట్టుగా అభినయిస్తున్నాడు. కాసేపు దాని సొంకమూ, బింకమూ గమనించిన తర్వాత 'ఉండు. ఇక్కడే వుండు' అని దీవిస్తున్నట్టుగా చేతి నాడించి చివరకు అభయహస్తం పడుతున్నాడు. పక్కన నవ్వడం సభామర్యాదకు విరుద్ధం గదా! చుట్టుపట్ల ముసిముసి నవ్వులు ముసురు కుంటున్నాయి. అంద

రిలా చూస్తూ ఊరుకోడానికి మనస్కరించక 'అబ్బాయ్! తప్పుగదరా! ఊరుకో బాబూ!' అంటూ మందలించి భుజంపైన చేయివేసి కుర్చీలో అదిమిపెట్టాను. ఇందుకు సంతోషించవలసిందిపోయి ప్రక్క కుర్చీలో వున్న ఆసామీ నన్ను వారించాడు. 'పోనీలెండి కుర్రవాడు గదా! ఎవరను కున్నారు? పరాంకుశంగారి అబ్బాయి' అన్నాడు.

నేను తెల్లబోయాను. ఈ కుర్రవాడు పరాంకుశంగారి అబ్బాయా? కావచ్చు వంగి అతడి ముఖంలోకి చూచాను. పాలుగారే చెక్కిళ్ళు. మెరిసే కళ్ళు. పగడాల్లావున్న బుల్లి పెదవులు. అమాయకత్వం ఉట్టిపడే ముఖం. మునిమాపువేళ ఇంటి ఇల్లాలు నట్టింట వెలిగించిన దీపకళికలా వున్నాడు. తల పైకెత్తి పరాంకుశంగారి వైపు చూశాను. పోతపోసిన కాంస్య విగ్రహం అలా వుంటుందేమో! నెరసీ నెరయని క్రాపింగు. జపాపుష్పాల్లాంటి కళ్ళు. సిగరెట్టు సాహచర్యం చేత నలుపురంగు తిరిగిన పెదవులు. ఆయన వెల్తురుకన్నా పొగరెక్కువగా వెళ్ళగక్కుతున్న నూనె దివిటీలా ఉన్నాడు. ఆ తండ్రి పోలికలు ఈ కొడుకులో కానరావడం నేను గుర్తించాను. కానీ ఆ యిద్దరి మధ్యా ఎంతో దూరం వున్నట్టు ఎందుకో ఓ చిత్రమైన ఊహ నా బుర్రలో పారాడింది. తండ్రికొడుకు లిద్దరూ చెరొకవైపు విలోచగా పదివేల యేండ్ల నాగరికత ఆ యిద్దరికి మధ్య విస్తరించి వున్నట్టు నా కనిపించింది.

పది నిమిషాలవరకూ ఆ కుర్రవాడు బుద్ధిగా నేనెలా కూర్చోబెట్టానో అలాగే కూర్చున్నాడు. అంతకుమించి పిలకజుత్తు వైభవాన్ని పరిశీలించకుండా వుండడం వాడికి సాధ్యంగాకపోయింది. మళ్ళీ ముంగాళ్ళమీద పైకిలేవడం. లేచి లేచి పిలకలోకి చూడటం. గోలీకాయంత పిలకముడి చుట్టూ తనచేతి వేళ్ళతో ప్రాకారం అభయ హస్తం! మళ్ళీ ముసి ముసి నవ్వుల కెరటాలు....

నాకింక అక్కడ కూర్చోడానికి మనస్కరించింది కాదు. దగ్గర్లో వున్న సినిమా థియేటరులో కొత్త చిత్రం ఒకటి ప్రదర్శింపబడుతోంది. సినిమా చూచి బయటకు వచ్చేసరికి ఎక్కడ బస చేయాలన్న సమస్య ఎదురయ్యింది. మారుమూల పేటలోవున్న ఒక దూరపు బంధువుకోసం బయల్దేరాను. రెండు గదుల పోర్షనులో అతడి కాపురం. స్టోరు రూములాంటి

గదిలో అతడు నన్ను పడుకోబెట్టాడు. రాత్రంతా ఆ గదిలో నల్లులతో సహజీవనం నెరపేసరికి నేను కర్కోటకుడి కాటువల్ల నలుడెలా వికృత రూపుడై పోయాడో గ్రహించగలిగాను. బాబ్బాబూ! ఇదేం లాభంలేదు. పల్లెల్లో నివసించి కొన్ని నెలల వ్యవధిలో సంతరించుకున్న ఆరోగ్యం ఒకటి రెండు రోజుల నగరవాసంతో దివాలా అయిపోతుంది. వీలయినంత తొందరగా ఇక్కడనుంచి వెళ్ళిపోవాలి.

కానీ ఆ లోగా ఈ యాత్రకంతా పరమార్థమైన ప్రయోజనం నెరవేర్చుకోకపోతే ఎలాగు? జన్మకల్లా శివరాత్రిలా పరాంకుశంగారితో ఓ గంటసేపు కాలక్షేపం అందుకిదే మంచి సమయం. సాయంకాలమైతే మళ్ళీ ఆయన కేదైనా కార్యక్రమాలు వుండవచ్చు.

స్నానపానాలు ముగించి, దుస్తులు మార్చుకొని మిడిమిడి ఎండలో రెండుమైళ్ళ దూరం నడిచి మునిసిపాలిటీవారి గెస్టుహవుస్ చేరుకున్నాను. శాఖోపశాఖలుగా అలముకున్న పెద్ద పెద్ద చెట్లనీడలో నిమ్మకు నీరెత్తినట్లుగా వున్న ఆ అతిథి గృహం ఎండలో నడిచివచ్చిన ప్రాణాలకు హాయిని చేకూర్చింది. భవనంచుట్టూ గుబురుగావున్న క్రోటన్ మొక్కలగుండావెళ్ళి మెట్లెక్కి వరండాలో కాలుమోపాను. చీమ చిటుక్కుమన్నా వినిపించేటంత నిశ్శబ్దం. తలుపువాకిలి ఓరగా వేసి ఉంది. గుమ్మానికీవల ఓ వాలుకుర్చీలో పడుకుని పరాంకుశంగారి అబ్బాయి వసారా చూరుకు వ్రేలాడుతున్న పట్టి వేళ్ళ చాపవైపు చూస్తున్నాడు.

"బాబూ! నాన్నగారున్నారామ్మా?" అంటూ పలకరించాను.

ఏదో చెప్పదలచుకున్నట్టుగా కుర్రవాడి పెదవులు కంపించాయి. అంతలో వ్యర్థ సంభాషణ ఎందుకు లెమ్మనుకున్నట్టు అవి బిగుసుకుపోయాయి. అతడి చూపులు మళ్ళీ వట్టివేళ్ల చాపమీదికే ప్రసరించసాగాయి.

చేసేదిలేక గుమ్మందాకా వెళ్లి లోపలికి తొంగి చూశాను.

పరాంకుశంగారి అబ్బాయి నా ప్రశ్నకు సమాధానం చెప్పలేక పోవటానికి కారణమేమిటో ఆ క్షణాన నాకు స్ఫురించింది. ఉంచే ఉన్నారన

వచ్చు, లేకపోతే లేరనీ అనవచ్చు. కానీ ఈ రెంటికీ అతీతమైన స్థితిని ఏమనాలి? లంగోటా మినహా మరొక ఆచ్ఛాదనం లేకుండా పరాంకుశంగారు మంచంపై బోర్లగిల పడివున్నారు. మంచాన్ని కావిలించి పట్టుకున్నట్టుగా ఆయన చేతులు అటూ ఇటూ వ్రేళ్లాడుతున్నాయి. కాళ్ళలో ఒకటి ఈ మంచం కోడుకు, యింకొకటి ఆ మంచం కోడుకు అభిముఖంగా త్రిప్పి పెట్టిన 'వి' ఆకారంలో బొండ మ్రానులా పడివున్నాయి. భౌతిక శరీరం ఇంత నిస్పష్టంగా కనిపిస్తుండగా "లేరని" చెప్పడం పొసగదు. ఉన్నారని అనడానికి గుర్తు చైతన్యం. జీవచైతన్యం ప్రాణులకు సహజ ధర్మం. చైతన్య విరహితమైన స్థితిలో "శరీరం అక్కడ పడివుంది" అనవచ్చు నేమోగానీ ఆయనక్కడ వున్నారని చెప్పడం కుదరదు. భావాభావాల మధ్య నున్న స్థితిని ఏమని పేర్కొనాలో అయిదేళ్ల పసివాడికేం తెలుస్తుంది?

ఏమైనా అంతటి చల్లటి ఆశ్రయాన్ని వదలిపెట్టి మళ్లీ పట్టణంలోకి వెళ్లడానికి నాకు మనస్కరించలేదు. చేతిలో వున్న పత్రికను చూసుకుంటూ ఓ మూలగా ఆ వరండాలోనే కూర్చుండిపోయాను.

అరగంట సేపలా గడిచింది. పరాంకుశంగారి అబ్బాయి బంతిలా గుడు గుడుమంటూ పరుగెత్తు కొచ్చాడు.

"మేస్తారూ! ఓ చిత్తెలుక యిలా పరుగెత్తు కొచ్చింది, చూశారా?" అన్నాడు.

చూడ లేదంటే వెళ్లిపోతాదేమో! ఎలాగూ పరాంకుశంగారితో మాట్లాడే అవకాశం కుదరలేదు. కనీసం వాళ్లబ్బాయితోనైనా కొంతసేపు మాట్లాడ గలిగితే బాగుండుననిపించింది.

"చిత్తెలుకా అబ్బాయ్! చూచానే? ఇటువైపే వచ్చింది. ఆ క్రోటన్ మొక్కల్లోకి వెళ్లిందేమో: మళ్లీ వస్తుందిలే. ఇక్కడే వుండు. చిలుటు కంటే నీకు యిష్టమా బాబూ?"

"భలే యిత్తం. పత్తుకుని గాజు పెత్తెలో పెత్తేయాలి. ఏంచక్కా తిరుగుతూంటుంది గదండీ!"

"వద్దమ్మా! నిజం ఎలుకలు పట్టుకుంటే కొరికిపెడతాయి. నీకంతగా ఇష్టమైతే ప్లాస్టిక్కు ఎలుకలు కొనుక్కోవచ్చు. మర నొక్కితే చాలు అవి బారెడు దూరం పరుగెడుతాయి...."

"మీ బజార్లో ప్లాస్టిక్కు ఎలుకలున్నాయా?"

"ఉండొచ్చు. ఎందుకుండవు?"

"మరయితే బజారుకెళ్ళి కొనుక్కొద్దామా మేస్త్రాలూ? మీరెత్తుకో వద్దు, నేనే నడిచొస్తాను."

తనతో ఆడుకునేవాళ్ళకోసం ఆ కుర్రాడు మొహం వాచిపోయినట్టున్నాడు. పెద్దలకు సాయం చేయడంకన్నా పసి పిల్లలకు ప్రమోదం కలగజేయడంలో ఎంతో ఆనందముంది. కానీ భగభగలాడుతున్న ఎండవైపు చూచి కాస్త తటపటాయించాను.

"భోజనంచేసి వెళ్దాంలే అబ్బాయి! నాన్నగారితో చెప్పే వెళదాం."

"నాన్నారు నిద్దల లేవరు. సాలాసేపు నిద్దల పోతారు" చాలా చాలా దీర్ఘమే తీశాడు కుర్రాడు.

"సాయంకాలం నేను కొనిపెడతానుగా! తప్పకుండా కొనిపెడతాను. నీ పేరేమిటి బాబూ?"

"అమ్మ చిత్తిబాబు అంటుంది."

"నువ్వమ్మతోబాటు యింటి దగ్గరే వుండిపోవచ్చుగదా! ఎందుకొచ్చావమ్మా ఈ ఊరికి?"

"అమ్మ యింట్లో లేదుగా! పాపాయి నెత్తుకుని అమ్మమ్మగారింటికెల్లిపోయింది" కొద్ది క్షణాలపాటు పరధ్యానంగా వుండిపోయి మళ్ళీ అందుకొన్నాడు చిట్టిబాబు. "ఎప్పుడొత్తుందో! ఒత్తే నేను మాటాడనే మాటాడను."

పరాంకుశంగారి సాంసారిక విషయాలు ఆరాతీసి తెలుసుకోవాలన్న కుతూహలం నాకు లేదు. చిట్టిబాబును చూస్తే నాకు జాలిగా ఉండొచ్చు. అందు కని నేను చేయగలిగిందల్లా ఒక ప్లాస్టిక్కు ఎలుకను కొనిపెట్టడమే!

గంట పన్నెండు కొట్టిన తర్వాత ఓ మనిషి కారియర్‌లో అన్నం తీసుకొచ్చాడు. తనకెంతగా ఆకలి లేదని చెప్పినా అతను బలవంతంచేసి చిట్టి బాబును లోపలికి తీసుకువెళ్లాడు. నేనప్పుడు గమనించాను. లోపలికెళ్ళడం కన్నా, బయట వుండడమే చిట్టిబాబు అభిమతంలా కన్పిస్తోంది.

ప్రొద్దు పడమటికి వ్రాలేసరికి నా కడుపులో సైతం ఆత్మారాముడు గోలపెట్టసాగాడు. మంచి హోటళ్ళ సంగతేమిటోగానీ, పట్టణంలో హోట ళ్ళుగా పేర్కొనదగినవి దండిగానే వున్నాయి. రుచీ శుచీ దేవుడెరుగు. వాటి కన్నా ప్రాణికి తిండి ముఖ్యం. కాళ్ళీడ్చుకుంటూ బయల్దేరాను. నాలుగు వీధులూ తిరిగి బస్‌స్టాండ్ దగ్గరికి వొచ్చేసరికి చిన్ననాటి స్నేహితుడొకడు ఎదురయ్యాడు. హైద్రాబాద్‌లో ఉద్యోగం చేస్తున్నాడట! ఇక్కడేదో ఆఫీసు ఇన్‌స్పెక్షన్ కోసం వచ్చాడట. పనై పోయిందనీ, రాత్రి రైలుకు వెళ్ళిపో తున్నాననీ అన్నాడు.

బాల్యస్మృతులు నెమరువేసుకోవడంతో కాలం గడిచిపోవడమే తెలి సిందిగాదు. తొమ్మిదిగంటల రైలుకు వాడిని రవాణా చేసి పరిషత్తు భవనాల దగ్గరికి వచ్చాను. అప్పటి కార్యక్రమం కవిసమ్మేళనం. పరాంకుశంగారు కార్య క్రమానికి హాజరై మధ్యలోనే వెళ్ళిపోయినట్టు తెలిసింది.

కవులు నింపాదిగా రాత్రి ఒంటిగంటదాకా కవితాపఠనం కొనసాగిం చారు.

ఆనాటి ఉదయం మునిసిపల్ గెస్టుహవుసులో కొద్ది గంటలపేపు గడి పిన అనుభవంవల్ల ఇంకొకచోట ఆ రాత్రిని వేగించడానికి మనసొప్పలేదు. కళాపరిషత్తువాళ్లు ఏకంగా నాలుగు రోజులకు అద్దె చెల్లించి వుంటారు. ఏ వరండాలో పడుకున్నా అడిగేవాళ్ళుండరు.

తీరా వెళ్ల దలచుకున్నచోటికి వెళ్ళేసరికి నా అంచనా తారుమారై పోయి

వుండడం గమనించాను. అతిథి గృహం ఉదయం ఉన్నంత ప్రశాంతతగా లేదు. హాల్లో దీపాలు వెలుగుతున్నాయి. ద్వారబంధంగుండా, కిటికీ మువ్వల గుండా వెలుతురు వెల్లువలా వెలుపలికి గూడా ప్రవహిస్తోంది. నవ్వులతో, కేరింతలతో, సంభాషణలతో, ఆసనాల కదలికతో హాల్లోపలి వాతావరణం వానా గందరగోళంగా వుంది.

పక్కోడావికి ముందుగా ఒకసారి హాల్లోపలికి తొంగి చూశాను జరుగు తున్న గలాభానుబట్టి అక్కడ నలుగురైదుగురు వ్యక్తులుండవచ్చుననుకున్నాను: నా ఊహ పొరబాటు. అక్కడున్న వ్యక్తులిద్దరే: అడ్డపంచ కట్టుకొని, అరచొక్కా వేసుకుని పరాంకుశంగారొక కుర్చీలో కూచున్నారు. బల్లకింకొక పైపున కూర్చున్న వ్యక్తి నా కపరిచితుడు. మనిషి బక్కపలచని వాడు. కోల మొగంతో, పొడుగాటి ముక్కుతో, తెల్లటి లాల్చీలో అతడు చెకుముకి రాయిలా ఉన్నాడు. శారీరక శక్తికి మించిన ఆవేశంతో అతడు తుపానులో కొబ్బరిచెట్టులా వూగిసలాడిపోతున్నాడు.

బల్లక్రింద, పైన సిగిరెట్ టిన్నులు, అగ్గిపెట్టెలు, తాంబూల సామగ్రి, సోడాబుడ్డీలు, బ్రాందీ సీసాలు, స్టీలుగిన్నెల్లో అనుపాన వస్తువులు. బిస్కట్ పొట్లాలు మొదలైనవన్నీ వాళ్ళ కందుబాటులోనే వున్నాయి.

బహుశా ఆ హాల్లోనే ఒక మూలగా పడుకుని నిద్రపోతున్నాడేమో చిట్టిబాబు పొలకువ మాత్రం నాకు కనిపించలేదు.

నే నక్కడకు వెళ్ళింది పడుకుని హాయిగా నిద్రపోవాలన్న సదుద్దేశంతోనే: కానీ అక్కడ నిద్ర పడుతుందనుకోవడం వట్టి అడియాసేనని కొద్ది సేపట్లోనే తేలిపోయింది. పాత నాటకాల్లో త్రాగే సీను వచ్చేసరికి ప్రేక్షకుల్లో నిద్రపోతున్న వాళ్ళుకూడా లేచి కూర్చునేవాళ్లు. ఇక్కడ త్రాగే సీను దృశ్య నాటికగా కాకపోయినా, శ్రవ్య నాటికలా నన్ను అలరిస్తోంది.

పోలికలు తగినట్టుగా వుండి, చెకుముకి రాయి ఏ పాటో, పద్యమో లంకించుకుంటాడు. అందులో ఏదో గొప్ప స్వారస్యమున్నట్టుగా పరాంకుశం గారు బిగ్గరగా నవ్వేస్తున్నారు. మధ్య మధ్యలో సంభాషణలు, వాక్యానికీ, వాక్యానికీ మధ్య అన్వయమెప్పుడో తెగిపోయింది. మాటపైన మాట స్వారీ

చేస్తోంది. ఈ హంగామాకు పతాక స్థాయిగా అప్పుడప్పుడూ వాగ్వాదాలు సైతం సాగుతున్నాయి. బాబూ! ఇప్పుడిక్కడ ఏ క్షణాన ఏం జరిగినా జరగ వచ్చు. ఎరుగకపోయి ఇక్కడికి రావడమే బుద్ధిమాలిన పనై పోయింది.

క్రమక్రమంగా ఈ గలాటాకు నేను అలవాటు పడిపోయానేమో! ఏ సందునుంచో కమ్మని కునుకొకటి వచ్చి నన్నావహించింది. ఆ కునుకులోంచి హటాత్తుగా మేలుకున్నాను. ఎవరో బిగ్గరగా ఓ గావుకేక పెట్టినట్లు తోచింది. గబగబా హాలు దగ్గిరికి పరుగు తీశాను. గావుకేకపెట్టినవాడు చెకుముకిరాయే అయివుండాలి. విసురుగ పోయి గోడను ఢీ కొన్నాడేమో. అతడు వింటి దబ్బలా వంగిపోయి తూలిపోతూ ఈవలికొస్తున్నాడు. "నన్నే చేయి చేసుకో బోతావట్రా మాదర్చేద్" అంటూ పరాంకుశంగారు బల్లనతడి వైపుకు తోశారు. ఖాళీ సీసా క్రిందపడి ముక్కలై పోయింది. చెకుముకిరాయి కీచు గొంతుకతో ఒక వికృతారావం చేసి, చేతికి దొరికిన ఒక సోడా బుడ్డీ అందు కున్నాడు. "కాచుకోవోయ్ పరాంకుశం! నీ బుర్ర బద్దలే! ముక్కు చట్నీ! ఈ ప్రొద్దుటితో నువ్వు మర్గయా!" అంటూ సోడా బుడ్డీని ఒక్క విసురుతో పైకెత్తాడు. మరు క్షణంలో అంతపని జరిగేదే! పరాంకుశంగారు తటాలున అవతలికి తప్పుకుని ఒక్క వుదుటున చెకుముకిరాయి గొంతుకను అంది పుచ్చుకున్నారు. రెండు చేతులతోనూ పీక నొక్కేస్తున్నారు.

సరిగ్గా ఆ క్షణంలో రివటగాలిలా ఓ రబ్బరు బొమ్మ గాల్లోనుంచి బయ టికి పారిపోతున్నట్టు తోచింది. తిరిగి చూసేసరికి ఆ ఆకారం గేటు దగ్గర కనిపించింది. పోల్చుకున్నాను. ఒక్కపెట్టున 'చిట్టిబాబూ!' అని పిలిచాను. చిట్టిబాబు వినిపించుకోడంలేదు. ప్రవాహంలో కర్రముక్కలా అతడు కొట్టుకు పోతున్నాడు. పిలుస్తూ రోడ్డుపైకి పరుగెత్తాను. అటూ ఇటూ కలయజూచాను. సందుగొందులన్నీ తిరిగాను. చిట్టిబాబు అయిపులేడు!

మరునాటి ఉదయం ఎనిమిది కంటలప్పుడు కళాపరిషత్తు కార్యదర్శి ఉమాపతి పోలీస్టేషనుకు వెళ్తూ నాకు నాలుగు రోడ్ల కూడలిలో ఎదు రయ్యారు.

"ఏం జరిగింది బాబూ?" అంటూ కంగారుగా ప్రశ్నించాను.

"ఏం చెప్పమన్నారు శేఖరంగారూ! ఈ బాధ పగవాడికైనా వద్దు. గెస్టు హావుసును మన అతిధులు రణరంగంగా వాడుకున్నారు. వాళ్ళ చేతికి దొరికిన ప్రతి వస్తువూ ఆయుధంగా చెల్లిపోయింది. ప్రాణహాని లేకపోవ డమే మన అదృష్టం. తెల్లవారేసరికి పరాంకుశంగారు మంచాని కడ్డంగా పడి వున్నారు. ఇంకో మనిషి ఒంటిపైన బట్టనేమూట లేకుండా మంచంకోళ్ళ రెండింటికి మధ్య నేల కంటుకుపోయి వున్నాడు. ముఖంపైన చన్నీళ్ళు చల్లి అయ్యగారిని ఈ లోకంలోకి తెచ్చేసరికి కుంభకర్ణుణి నిద్ర లేపినంతపనయింది. ఆయనిప్పుడు విశేషంగా లేచి కూర్చుని "మా అబ్బాయి ఎక్కడో వుండాలి చూడండి. అర్జంటుగా బయలుదేరాలి" అంటున్నారు. ఏదీ? ఎక్కడున్నాడు వాళ్ళబ్బాయి! భళ్ళున తెల్లవారినప్పటినుంచీ కార్యకర్తలందరికీ ఇదే పని. చిట్టిబాబును వెదకడం! పోలీసు స్టేషనుకు వెళ్ళి రిపోర్టు ఇచ్చివద్దామని నేనిలా వెళ్తున్నాను.

చిట్టిబాబుకోసం నేను తెల్లవారుజాము నాలుగ్గంటలనుంచీ వెదుకు తున్నానని ఉమాపతికి తెలియదు. నేనైనా అప్పుడా వివరాలేవీ ఏకరువు పెట్ట కుండా మౌనంగానే ఉమాపతిని వెంబడించాను.

చింతాకంత ముఖాలతో మేము లోపలికి వెళ్ళగానే డ్యూటీలోవున్న పోలీసు "ఏమండీ! తప్పిపోయిన కుర్రాడికోసం వచ్చారా?" అన్నాడు.

"రక్షించావు బాబూ! నీ బిడ్డ పాపలు చల్లగా ఉండాలి. ఏదీ? మీకు దొరికిన కుర్రాడెక్కడున్నాడు?" అన్నాడు ఉమాపతి.

"ఆ మాటెందుకులెండి. మిల్క్‌డిపో వెంకయ్య లేడూ! అతడు సైకిల్లో వెళ్తుండగా ఈ కుర్రాడెదురుగా పరుగెత్తుకు వస్తున్నాడట. జానెడంతా లేని కుర్రాడు ఈ వేళప్పుడు ఎక్కడికి వెళుతున్నట్టని విస్తుపోయి వెంకయ్యా వాడినిపట్టి తీసుకొచ్చి నా కప్పగించి పోయాడు. అదేం కర్మోగానీ వాడు తండ్రిపేరు చెప్పడే! 'మీ ఇల్లెక్కడో చెప్పరా నాన్నా! వెళుదువుగానీ' అంటే 'ఇల్లొద్దు. ఇక్కడే వుంటా' నంటాడు. ఇదేమిటో చాలా విడ్డూరమైన కేసే! వెళ్ళి చూడండి. ఎంత నిశ్చింతంగా నిద్రపోతున్నాడో!"

నిజమే!

స్టేషన్‌లో నేరస్తులను తాత్కాలికంగా నిర్బంధంలో పెట్టడంకోసం రెండుసెల్స్ వున్నాయి. అందులో ఒకదానిలోకి దూరి కటకటాల వెనుక కటిక నేలపైన పడుకుని గాఢ నిద్రా పరవశుడై వున్నాడు చిట్టిబాబు.

నా కళ్ళల్లో గిర్రున నీళ్లు తిరిగాయి. ఉమాపతికి కనిపించకుండా ముఖం అవతలికి తిప్పుకున్నాను.

పిడుగుపాటులా ఓ భయంకరమైన ఊహ నన్ను నిలువునా తొలిచేసింది.

మీసాలూ, గడ్డాలూ వచ్చి, తలగూడా పండి వయసులోనూ, విజ్ఞతలోనూ పెద్దలైనవాళ్లు యిప్పటికన్నా సవ్యంగా గనుక వ్యవహరించకపోతే భావితరాల పౌరులకందరికీ ఈ ప్రపంచంకన్నా చెరసాలే నయమనిపించవచ్చు. పదివేల యేండ్ల మానవ నాగరికత అప్పుడి మానవుడి పాలిటి వరం గాకుండా శాపంగా మాత్రమే నిరూపణ అవుతుంది. 

# పొద్దు చాలని మనిషి

ఆ రోజు సాయంకాలం షికారుకు వెళ్ళి తిరిగొచ్చేసరికి రేడియోలో పాట వినిపిస్తోంది. దారబోయిన అమూల్యవస్తువేదో దొరికినట్టయింది. నా చెవులే నన్ను మోసగించకపోతే ఆ గొంతుక మా విశ్వపతిది. విశ్వపతి పాట ఆకాశవాణిదాకా వెళ్ళిందా? నాకు తెలియదు. హైస్కూల్లో ఏ నాటకం జరిగినా అందులో విశ్వపతికొక పాత్ర వుండేది. ఆ పాత్రకు సంభాషణకన్నా ఎక్కువగా పాటలూ, పద్యాలూ వుండేవి. ఆ పాటలు, పద్యాలు వినడం కోసం నాటకానికి మాత్రమేగాదు, రిహార్సల్సుకు కూడా చాలా మంది వస్తుండేవాళ్ళు. హైస్కూల్లో చదువుకున్న ఆరేళ్ళలోనూ మా యిద్దరిదీ ఒకటే డెస్కు. గంట కొట్టగానే అతని దారి అతడిది, నా దారి నాది. పెద్దగా స్నేహం మట్టుకు ఏర్పడలేదు. అతడి వ్యాపకాలు వేరు, నా అభిరుచులు వేరు, అదొక కారణం.

విశ్వపతి యిప్పుడెక్కడున్నట్టు? ఏం చేస్తున్నట్టు?

పాటల ప్రోగ్రాం పూర్తయింది. ప్రకటనద్వారా గాయకుడు విశ్వపతేనని రూఢి అయింది.

... వీలైతే విశ్వపతిని కలుసుకోవాలి. అతడు పాడితే వినాలి. బాల్య స్మృతుల్ని నెమరు వేసుకోవాలి. అనుకున్నాను.

అది వట్టి సంకల్పమే. పుట్టినప్పుడు అవి నెరవేరుతుందన్న గ్యారంటీ ఏమీ లేదు. కానీ ఆడబోతేనే గదా తీర్థాలెదురయ్యేది? స్నానమాడా లనుకుని బయలుదేరడం సంకల్పం. ఆ తీర్థమే ఎదురై రావడం దైవ యత్నం. చెప్పొచ్చిందేమంటే, ఆ సంకల్పం కలిగిన కొద్ది మాసాలకే నాకు విశ్వపతి కనిపించాడు.

మా వూరి హైస్కూల్లో వార్షికోత్సవాలు జరుగుతున్నాయి. నాటకాలు లేని వార్షికోత్సవాలా! నేను మాత్రం నాటకం కోసమే వెళ్ళాను. వెళ్ళేసరి

కింకా వుపన్యాసాలే జరుగుతున్నాయి. కాలం గడవడం కోసమని తోటలో పచార్లు చేస్తూ వుండి, ఉన్నట్టుండి గ్రీన్ రూం లోనికి తొంగిచూచాను. ఆ చూచిన క్షణంలోనే విశ్వపతి కనిపించాడు. అప్పుడతడు ఏం చేస్తు న్నాడు? రంగు పూసుకుని అరచేతులతో బాలకృష్ణుని లేత బుగ్గల్ని మెల్లగా మర్దించి పారేస్తున్నాడు.

సంతోషం పట్టలేక "హలో విశ్వపతీ! ఎక్కడో మునిగి ఇక్కడ తేలావాబాబూ?" అన్నాను.

"నువ్వటోయి రాజశేఖరం! నువ్విక్కడున్నావా? ఏవో వెర్రి మొర్రి రాతలు రాస్తుండేవాడివి. ఇప్పుడు పక్కా కథలు గూడా రాస్తున్నావే? నేనూ ఒకటి రెండు చదివాన్లే! ఇలా లోపలికొచ్చెయ్ మరి!"

లోపలికి వెళ్ళాను. కుర్చీలో కూర్చుంటూ "రంగులు పూయించుకునే వాడివి, నువ్వే యితరుల ముఖాలకు రంగులు పూసేస్తుండగా, నేను కథలు వ్రాయడం అబ్బురమా?" అన్నాను.

"నిజం నిజం! పాత రోగులేకదా డాక్టర్లయ్యేది? ఉండుండు. నీతో చాలా విషయాలు మాట్లాడాలి...."

కాని విశ్వపతి కిప్పుడప్పుడే తీరిక చిక్కేట్లు లేదు. అసలే పౌరాణిక నాటకం! అందులో ఒక బాలకృష్ణుడేనా వున్నది? దేవకీ వసుదేవు లున్నారు, యశోదా నందులున్నారు, మధురలో కంసా క్రూర చాణూర ముష్టికాదులను, గోకులంలో గోపికలు, గోపబాలురను కూడా కలుపుకుంటే సృష్టికర్త బుర్రలో ఊహలా, ఆ నాటకంలో పాత్రలు కూడా దండిగానే వున్నాయి. మేకప్ పూర్తికాక మునుపే ప్రదర్శనం ప్రారంభమైంది. నేను వెళ్లేసరికి కుర్చీలలోనూ, బెంచీలలోనూ ఖాళీ లేదు. ఎక్కడో వెనుక వైపున నిల్చో వలసి వచ్చింది. జగత్సంసారాన్ని విలోకించడం కోసం అప్పుడప్పుడు పరమేశ్వరుడే పర్యటనం చేస్తుంటాడుగదా! మేకప్ పూర్తి కాగానే రంగం పైన తన పాత్ర లెలా జీవిస్తున్నదీ తెలుసుకోవడం కోసం వెలుపలికి వచ్చాడు విశ్వపతి. ఎక్కడో తచ్చాడుతూ వున్న, అంతజనంలోనూ నను ౨

కవిపెట్టేశాడు. "ఇక్కడే వుంటావా రాజశేఖరం? పది నిమిషాల్లో భోజనం చేసి వచ్చేస్తాము" అన్నాడు.

అలాగే వన్నాను.

పదిహేను నిమిషాల్లో విశ్వపతి తిరిగి వచ్చేశాడు. చేతిలో తాంబూలం భుజాని కొక సంచి, తలకో మఫ్లరు, ప్రయాణానికి సిద్ధంగా వున్నాడు ఆ వేళప్పుడు రోడ్డుపైన బస్సులుండవని విశ్వపతికి తెలియదా? తెలుసు. కానీ ప్రయాణం చేయడానికి బస్సులే వుండితీరాలన్న పట్టింపు విశ్వపతికి లేదు. లారీలు దొరికినాసరే, వెళ్ళిపోగలనంటాడు.

"రాత్రికుండి ఉదయం వెళ్ళకూడదా విశ్వపతీ?" అన్నాను.

"అబ్బే, వెళ్లాలి రాజశేఖరం! పమంది. మళ్ళీ ఎప్పుడైనా వస్తాన్లే! లేకుంటే నువ్వే రాకూడదూ, హైస్కూలు చదువు పూర్తి కాగానే నువ్వు మీ వూరొచ్చేశావు. మా వూరదే! నేనెక్కడికి వెళ్తాను, లేదంటే యిల్లు మారిందనుకో, రంగనాథస్వామి గుడి దగ్గర. ఎవర్నడిగినా చెబుతారు...."

"నువ్వు నాతో మాట్లాడదలచుకున్న చాలా విషయాలన్నీ యింతేనా విశ్వపతీ!" నిష్ఠూరంగానే అడిగాను.

విశ్వపతి నవ్వాడు. "మాట్లాడుకోవలసిందే! కానీ మాటలు చేతల కడ్డు తగలకూడ దనుకుంటాను నేను! అన్నట్టు నాకొక నాటకం కావాలి, కథ నేనే చెబుతాను. ఇంచుమించుగా జరిగిన కథ, పాత్రల సంఖ్య కాస్త ఎక్కువే! ఐనా ఫరవాలేదు. తెర పైకిలేస్తే యిక నాటకం ఆఖరయ్యేదాకా కథ పరుగెడుతూనే వుండాలి. మధ్యలో తెరపడినా, వెంటనే పైకి లేవాలి. స్టేజి ముందు భాగంలో నాటకం జరుగుతోందనుకో! రాబోతున్న సీనును వెనుక వైపున ఏర్పాటు చేసుకోడానికి వీలుండాలి. అర్థమైందా రాజశేఖరం?"

"అర్థమై ఏం లాభం! నువ్వు ఉపోద్ఘాతం ముగించి కథలో కొచ్చే వరికి శివుడి పూజలో ఎలుగుబంటి చొరబడినట్టుగా ఆ లారీ కాస్తా వచ్చి పడుతుందేమోనని నా కాదుర్దాగా వుంది" అన్నాను.

"వస్తే రావివ్వు! లారీ వచ్చిందని కథ ఆగిపోతుందా? అప్పుడు నాతో బాటుగా నువ్వూ లారీ ఎక్కేస్తావు. సరేనా రాజశేఖరం? పోనీలే, చెబుతా విను...."

విశ్వపతి కథ ప్రారంభించాడు. అది కథ కాదు. బ్లూ మౌంటెన్ ఎక్స్‌ప్రెస్. ఐనా ఎత్తుకోగానే అంతటి స్పీడు దానికి! స్థలాలు, సందర్భాలు, సన్నివేశాలు సినిమా ప్రొజెక్టరులో బొమ్మల్లా మారిపోతున్నాయి. సగటు లెక్కన నాలుగు వాక్యాల కొక కొత్తపాత్ర రంగంపై కొస్తోంది. కలిమి లేములు, సుఖదుఃఖాలు, రాగద్వేషాలు, వెలుగు నీడల్లా వచ్చిపోతున్నాయి. కథలో మలుపులు, పాత్రల స్వభావంలో విరుపులు, అడపాదడపా హాస్యపు చమక్కులు, అదొక కథలా లేదు. చిన్న ప్రపంచంలా ఉంది.

కానీ దీన్ని నాటకంగా వ్రాయడం కుదరదేమో! ఈ కథ కొద్ది రంగాలలోకి ఒదిగేది కాదు. యాభై, అరవై సీనులుపెట్టి నేనొక నాటకం వ్రాస్తే దాన్ని చివరకు విశ్వపతైనా ఆడలేకపోవచ్చు. వ్రాయటమంటూ జరిగితే దీన్ని నవలగానే వ్రాయాలి. ఆ మాటే విశ్వపతితో అన్నాను.

"నవలగానే వ్రాయి! నవలను నాటకంగా మార్చుకోకూడదని ఎక్కడుంది?" అన్నాడు విశ్వపతి. అంటూనే రోడ్డుపైకి లంఘించాడు. తన పాటుకది వెళ్ళిపోదలచినా, విశ్వపతి ఆ లారీని వెళ్ళనిచ్చేట్టు లేదు.

అపాయానికి భయపడి లారీ ఆగింది. డ్రయివరు లోపలివైపున సీటు ఖాళీ లేదన్నాడు. ఆ మాత్రానికే విశ్వతార్థాన్ని వదులుకుంటాడా విశ్వపతి? కమ్మీ చేతబట్టుకుని, దానికి కట్టిన త్రాటిని అందిపుచ్చుకుని గబగబా లారీలో వేసి వున్న మూటలపై కెగబ్రాకిపోయాడు.

"వెళ్ళొస్తాను రాజశేఖరం! ఈసారి టౌనుకు వచ్చినప్పుడు మా యింటికి రావడం మరిచిపోవద్దు...." అది పరుగెడుతున్న లారీ నుంచి వినవచ్చిన మాట.

విశ్వపతి నాకు యిచ్చిపోయిన రెడీమేడ్ కథపైన నేను విందుగా నాలుగు మాసాల కాలం శ్రమించాను. నిద్రాహారాలు మానేసినట్టు చెప్పలేను

కాని నవల ధ్యాసలో పడిపోయి కొన్ని పూటలు ఆలస్యంగా భోజనం చేశాను. నిద్రలో కల వచ్చినప్పటికీ, ఆ కలలో కూడా నవలలోని పాత్రలే చూశాను. ప్లాను విశ్వపతిది. కట్టడం నాది. నా దృష్టిలో రచన బ్రహ్మాండంగా వుంది. కాని ఆ మాట విశ్వపతి నోటిగుండా వస్తేనే నాకి పరమానందం.

ఒకనాటి ఉదయం బస్సెక్కి టౌనులో దిగేశాను.

విశ్వపతి యిల్లు నేసరికి రిక్షావాలా "ఆ నాటకాలాడే ఆయన యిల్లేనాండీ" అన్నాడు. విశ్వపతి నాటకాలకు పట్టణంలో వున్న ప్రసిద్ధిని గురించి కాదు నేను చెప్పడం! కాని అతడు నాటకాలాడే విషయం రిక్షావాలాలకు కూడా తెలిసివుండడంతో నాబోటి వాళ్ళ కొక సౌలభ్యం వుంది. ఇంటికోసం వాకబు చేయవలసిన అవసరం వుండదు.

రిక్షా వీధిలో ఆగింది. గుమ్మంలో నిల్చుని లోపలికి చూచాను చూచిన క్షణంలో కళ్ళు జిగేలుమన్నాయి.

రవ్వలు రత్నాలు, కెంపులూ పగడాలు కావుగానీ, అంతకంటె అందమైనవి, మీదు మిక్కిలి మృదువైనవి, మనిషి కళ్ళు మూసుకున్నా తమ పొలకువ వతడికి తెలుసుకోగల దివ్యశక్తిని వరంగా అడిగి తెచ్చుకున్నవి. పువ్వులండీ పువ్వులు! సన్నజాజులు కనకాంబరాలు. కాగడాలు. కదిరి మల్లె పువ్వులు, గులాబీలు, దిశాంబరాలు. నడవలో పోసివున్నరాశి చిన్నది. హాల్లో వున్నరాశి అంతకు రెండింతలుంటుంది. నడవలో పూలు కడుతున్న ముసలావిడను నేను పోల్చుకున్నాను. ఆవిడ విశ్వపతి తల్లి. నా పేరు చెప్పకోగానే ఒకసారి పరకాయించి చూచి ఆవిడ నన్ను గుర్తుపట్టింది. "నాయనా? ఇంతకాలాని కొచ్చావా! ఎప్పుడో చిన్నప్పుడు చూచింది నన్ను! బాగున్నావా? పెళ్ళి చేసుకున్నావా? ఎందరు బిడ్డలు?" అంటూ ఉపక్రమించింది.

నడవలోనేకాదు హాల్లోకూడా మాలా రచన చక చకా సాగిపోతోంది. బహుశా ఈమె విశ్వపతి భార్య అయివుండాలి. పెద్ద పూలరాశి దగ్గర కూర్చుని ఈమె ఆ అత్తకు తాను తగిన కోడలేనని నిరూపించుకుంటోంది. షైప్

రైటింగు మిషనులో అక్షరాలెగిరివచ్చి బంతిలో కుదిరిపోయినట్లుగా ఈమె చేతిలో పూబంతులు యిట్టే నూలుదారాల కతుక్కుపోతున్నాయి.

విశ్వపతి తల్లి చెప్పుకుపోతోంది. విశ్వపతికి ముగ్గురు బిడ్డలట. ముగ్గురూ కొడుకులే. అందరూ పిపింద్రీలే. వాళ్ళ పేర్లు. స్వభావాలు, చదువుల్లో వాళ్ళు కనబరిచే తెలివితేటలు, ఆట చూడకుండా రేడియోలో క్రికెట్ వ్యాఖ్యానం విన్నట్టేవుంది.

ఓపికగా వింటూ కూర్చున్నాను.

గంట పదికొట్టిన తర్వాత విశ్వపతి హఠాత్తుగా వూడిపడ్డాడు. అతడు వూడిపడింది రిక్షాలోనుంచి. ఆ రిక్షాలోనుంచి అతడు రెండు రీముల తెల్ల కాగితాలు దించి లోపలికి తీసుకొచ్చాడు. ఆ కాగితాలను వెన్నంటి చుట్టగా చుట్టిన కాలికో గుడ్డ ఒక అట్టలకట్ట. దారపుబంతి, ఇంకా ఒకటి రెండు పొట్లాలు, యివన్నీ లోపలికి రాసాగాయి.

ఆలోగా విశ్వపతి నన్ను చూడడమూ జరిగింది, పరామర్శించడమూ ప్రారంభమైంది.

"ఎప్పుడొచ్చావు రాజశేఖరం? ఉదయం బస్సులోనా రావడం? వానలు పడ్డాయా మీ వూళ్లో? ఇక్కడ ఒకటే ఎండలు బాబూ! భరించలేకుండా వున్నాము. బంగాళా ఖాతంలో ఎక్కడో వాయుగుండం బయల్దేరిందట, రేపటి సాయంకాలంలోగా వానజల్లులు పడవచ్చు నంటున్నారు. అన్నట్టు నీకు మా వాళ్ళు కాఫీ అయినా యిచ్చారా లేదా? ...ఇదిగో శకుంతలా! ఈయన నా బాల్యస్నేహితుడు. ఇక్కడొక రోజున్నా, రెండు రోజులున్నా మన ఇంట్లోనే వుంటాడు. ఉండడమంటే పూట పూటకూ హోటలుకు వెళ్ళి భోజనం చేసివస్తాడని కాదు. మన యింట్లోనే భోజనం చేస్తాడు. మళ్ళీ చెప్పలేదనేవు ఎందుకు చెబుతున్నానంటే రాజశేఖరం, మా ఇంట్లో ఒక వ్యక్తికి ఆతిథ్యం దొరకాలంటే అందుకు రెండే పద్ధతులున్నాయి. నేనైనా అతడికి భోజనం పెట్టమని చెప్పాలి. లేదా అతడైనా చొరవగా వంటింట్లోకి వెళ్ళి తనంతటతానే విస్తరి వేసుకుని 'సిద్ధంగా వున్నానమ్మా' అని మనవి చేసుకోవాలి...."

విశ్వపతి మాట్లాడుతున్నాడు. మాట్లాడుతున్నాడనగా అతడిచేతులు వూరుకున్నాయని అర్థంకాదు. అవి వాటిపాటుకు తమపనేదో తాము చేసుక పోతున్నాయి. కాగితాల పొత్తరను విప్పాడు. విప్పుకున్న కాగితాలను మడిచాడు. కట్టి ముగించిన పూలదండలను బుట్టలో పేర్చిపెట్టి అంతలో విశ్వపతి తల్లికూడా మడిచిపెట్టిన కాగితాలను కత్తిరించడానికి కత్తెర పుచ్చుకుని తయారైంది. పొయ్యమీద ఎసరు పెట్టివచ్చిన అర్థాంగి కాలికో గుడ్డను పేలికలుగా కత్తిరించడం మొదలెట్టింది. కిరోసిన్‌పోసి ముట్టించిన స్టౌమీద మైదాపిండి ఉడకటంకూడా ప్రారంభమైనట్లే! ఇంతలో ఎలిమెంటరీ స్కూలు బలగం విచ్చేసింది. పితామహి వాళ్ళనుగురించి చెప్పింది కూడా కరెక్టే! ఒకడు సూది తీసుకుని బెజ్జాలు వేయసాగాడు. ఇంకొకడు బెజ్జాలగుండా నూలు దారాలెక్కించి ముళ్ళు బిగిస్తున్నాడు. మూడోవాడు కాలికో పీలికలకు వుడికిన మైదాపిండి పూయసాగాడు. విశ్వపతి చేతుల మీదుగా నోట్ పుస్తకాలు తమ ఆఖరురూపాన్ని స్థిరపరచుకుంటున్నాయి. పనిలోవున్న ఆ చిన్న బైండింగు ఖార్ఖానా ఎదుట నేను అప్రతిభుడనై కూర్చుని వున్నాను!

పై పేరాకు వెనుకనున్న ప్రసంగానికి తరువాయిగా విశ్వపతి యిప్పుడు తాను జరపదలచుకున్న నాటకాల పోటీ స్వరూప స్వభావాలను గురించి వివరిస్తున్నాడు.

విశ్వపతి ప్రసంగం. బైండింగు పనులు. వంటగదిలో పాక కారలీ కలాపాలు ఒకదానితో ఒకటి పోటీ వేసుకున్నట్టుగా జరిగిపోతున్నాయి.

పన్నెండున్నరకల్లా భోజనాలకు రమ్మని పిలుపు వచ్చింది.

"నువ్వు వెళ్ళు రాజశేఖరం! రెండు గంటలలోగా ఈ పని పూర్తిగాదు. మూడింటికల్లా ఈ పుస్తకాలను తీసుకెళ్ళి స్కూల్లో అప్పజెప్పాలి. నేను తరువాత భోజనం చేస్తానులే! అందాకా నువ్వు నాకోసం కాచుకుని కూర్చోవడ మెందుకు? వెళ్ళు వెళ్ళు. ఒరేయ్ పిల్లలూ, మీరు కూడా వెళ్ళండ్రా! మామయ్య కొక్కడికే భోజనం పెట్టడం బాగుండదు. మీరు సహపంక్తిలో కూచోండి...."

భోజనం కాగానే కాసేపు పడుకుని లేవకపోతే నాకు మతిపోయి నట్టుంటుంది. నిద్రలేచి చూచుకునేసరికి చిన్నముల్లు మూడు దాటింది. పుక్కిటికథలో పేదరాపి పెద్దమ్మ గుడిసె మాయమైనట్టుగా యిప్పుడు హాల్లో బైండింగు ఖార్ఖానా కనిపించడంలేదు. బుట్టలో పూలదండలులేవు. కుర్ర వాళ్లకూడా స్కూలుకు వెళ్ళిపోయినట్టున్నారు. ఇల్లంతటా నిశ్శబ్దం. ఆట విడుపునాటి బడిలావుంది.

టౌన్‌హాల్లో ఏదో మీటింగుందట. అంతవరకూ తానెక్కడెక్కడ తిరిగినా అయిదు గంటలకల్లా విశ్వపతి అక్కడికి చేరుకుంటాడట. "మరేం పనిలేకపోతే నన్నుకూడా రమ్మన్నాడు బాబూ" అంది విశ్వపతి తల్లి.

టౌన్‌హాల్లో యిసుకవేసినా క్రిందరాలనంతటి జనం. వచ్చినవారు మంత్రిగారు. అవశ్యంగా లోపలికెళ్లి విల్చొవచ్చు ననుకోడానికి వీల్లేదు. ద్వార బంధాలుదాటి, వరండాల్లో క్రిక్కిరిసి, సోపాన పంక్తులపైన నిండి పోయి, అలా అలా రోడ్డుదాకా వ్యాపించిన జనసమూహానికి చివర నేనొక చింతచెట్టుక్రింద నిల్చున్నాను.

మైకు ముఖంద్వారా టెస్టింగ్ చిటికెలు బహిర్గత మౌతున్నాయి. ఆహ్వాన సంఘాధ్యక్షుడు కాబోలు. ప్రారంభించాడు. "మహాశయులారా! ఈ రోజు సుదినం. మంత్రిగారు విచ్చేశారు. మీరు వారి మాటలు వినాలని ఎంతో కుతూహలంతో వున్నారు. నాకు తెలుసు. ఇప్పటికే చాలా ఆలస్య మైంది. కానీ నే విప్పుడు మాట్లాడు తుండడంకూడా కార్యక్రమంలో ఒక అంశమే! స్వాగతం సమర్పించడమన్నమాట! ఐనా మిమ్మల్ని నేమ విసి గించుకోదలచలేదు. ఇదిగో, యిప్పుడు మంత్రిగారు కార్యక్రమాన్ని ప్రారంభిస్తారు.... మంత్రిగారు కంఠం సవరించుకున్నారు. ఆయన గొంతుక మేఘగర్జన సంకాశంగా వుంది ప్రార్థన" అంటూ ఆయన చెప్పింది ఒకటేమాట ఉరుము తర్వాత వానలా వెనువెంటనే పాట.

"మముగన్న మాతల్లి! ఓ తెనుగురాణి!
మమ్మేలుకోవమ్మ! నిత్యకల్యాణి!

అనందమయావిగా. అమరాగజలధిగా
ఆకాంతములదాక పేరుమోసిన తల్లి...."

అది విశ్వపతి పాట, ఆ రోజుల్లో ఎక్కడంటే అక్కడ, ఎప్పుడు బడితే అప్పుడు చీప్‌గా వినిపిస్తూండేది. కాలం దాని విలువను పెంచింది.

హాల్లో జనాల త్రొక్కిడి ఎలా వున్నప్పటికీ ఆ సభలో కార్యక్రమాలు మాత్రం వీలైనంత వింపాదిగానే జరుగుతున్నాయి. వేరే తొందర పనులుండడంవల్ల మంత్రిగారు మధ్యలోనే వెళ్ళిపోవడం, ఆ సమావేశం అర్థరాత్రిదాకా కొనసాగడానికి మరింతగా తోడ్పడింది. విశ్వపతి కోసం జనంలో నలువైపులా పరికించాను. అన్వేషణ ఫలించలేదు. వెనుదిరిగి యింటిముఖం పట్టడంకన్నా చేయగలిగింది లేకపోయింది. గంగలో మునిగి, కొల్లేటిలో తేలినవాడిలా విశ్వపతి యింటిదగ్గరే కనిపించాడు.

"ఆఖరుదాకా వుండిపోయావా రాజశేఖరం! అయ్యో, పాపం! నిన్ను సినిమాకైనా వెళ్ళమని చెప్పివుండవలసింది.

ఒక్కొక్కప్పుడు బుద్ధి బొత్తిగా పనిచేయదు. పాట పాడగానే నేను ఈవలకి వచ్చేయడం నిన్ను వెదికి పట్టుకోవాలనే! కానీ ఆలోగానే మా సంగీతం మేష్టారు జోగయ్యగారు కనిపించారు. ఆయన కూతుళ్ళకు తిరుచానూరులో పెళ్ళి చేస్తున్నారులే! రేపులేదు. మరునాడే పెళ్ళి. "బాబ్బాబూ! ఒక బస్సు కుదిర్చిపెట్టరానాన్నా!" అన్నాడు. ఆయన్ను వెంట పెట్టుకుని జూపిటర్ బస్సు కంపెనీకి దారితీశాను. జూపిటరు ప్రొప్రయిటరు మణవాళనాయుడుగారి కుమారుడు కుమరవడివేలు తెలుసుగదా నీకు! మనతోనే చదువుకుంటూ వుండేవాడు. తీరావాకబు చేసేసరికి అతడు కుంభకోణం వెళ్ళినట్టు తెలిసింది...."

"ఉండండుండండి!" అంటూ ఆ ఇంటి గృహిణి అడ్డుపడటంవల్ల నేను మణవాళనాయుడుగారి అబ్బాయి కుమరవడివేలు కుంభకోణం వెళ్ళినందుకు కారణమేమిటో తెలుసుకోవడానికి వీల్లేకపోయింది. భోజన కార్యం

నిర్వర్తించి, తాంబూల సేవనం చేస్తూ, ఎదుట పోసి పెట్టుకున్న పచ్చి మిరపకాయల్లోంచి తోడిమెలు గిల్లి వేసి, ప్రస్తుతం ఎర్రగడ్డలపైన పొట్లు ఒలిచి ఒలిచి "ఉఫ్" మని వూది పారేస్తూ తన పనిలో తాను నిమగ్నుడై వున్న విశ్వపతి నాకిప్పుడు మణవాళనాయుడు కుమారుడు కుమరవడివేలు కుంభకోణం వెళ్ళినకథే కాదు, కుమారస్వామి మయూర వాహనం ఎక్కి ముల్లోకాలను తిరిగివచ్చిన కథకూడా చెప్పగలడు."

"కాళ్ళు కడుక్కోండి అన్నగారూ! విస్తరి వేశాను...." అంది విశ్వపతి భార్య.

"అదీ. అలా వుండాలి!" అంటూ భార్యను మెచ్చుకున్నాడు విశ్వపతి. "తమ్ముళ్ళలో లక్ష్మణుడు, కొడుకుల్లో పరశురాముడు, భార్యల్లో మా శకుంతల. ఎంత చెబితే అంతగాళ్ళ లిష్టులే రాజశేఖరం!"

పరాయి మనిషి ఒకడున్నాడు గదా అని, ఆ యిల్లాలు మాత్రం ఎంత సేపని వూరుకుంటుంది?. "భర్తల్లో మీరు...." అంటూ లిష్టు పూర్తి చేసింది.

"ఇదిగో, నవ్వంటే యిలా వుండాలి" అన్నట్టుగా మనసంతా విప్పి, మనిషి మనిషంతా కదిలిపోతూ బిగ్గరగా నవ్వేశాడు విశ్వపతి.

గృహిణి అన్నం వడ్డించింది. సాంబారు గిన్నెతెచ్చి ఆకుదగ్గర పెట్టింది.

"పోసీగాపీ మంత్రిగారేం చెప్పారో చెప్పవోయ్ రాజశేఖరం!" అడిగాడు విశ్వపతి.

ప్రసంగాలను మక్కీకి మక్కీగా జ్ఞాపకం పెట్టుకునే ధారణాశక్తి నాకులేదు. ఐనా అడిగిన తర్వాత జ్ఞాపకమున్నంతవరకూ చెప్పాలిగదా. జిల్లాలో సీటివనర్ల అభివృద్ధికి వున్న అవకాశాలనుగురించి మంత్రిగారు చాలాసేపు ప్రసంగించారు. నెమిలిదిన్నె ప్రాజక్టు రాయలచెరువులో మట్టి త్రవ్వకం, రిగ్గులసాయంతో భూగర్భ జలధారను పైకితీయడం, యిలాంటి

విషయాలు ప్రస్తావించారు. ఇంకా చెరకు పంటలో ఎరువుల వాడకం, ద్రాక్షతోటల్ని పెంచిచూడడం, ఉమ్మడిగా పల్లెకొక ట్రాక్టరు మొదలైనవి కూడా ఆ ప్రసంగంలో దొర్లిన అంశాలే! జేవ్‌రికార్డరులా కాకపోయినా, షార్ట్‌హేండ్ పెన్సిల్లా చెప్పుకుపోతున్నాము.

భర్త కడ్డు తగిలినట్టే, నా మాటకుకూడా అడ్డు తగిలింది యింటి యిల్లాలు.

"ఎందుకు చెబుతారులెండి అన్నగారూ! ఆయనెప్పుడో నిద్ర పోయారు ..."

ఓరి నీయిల్లు బంగారంగానూ? ఎంత పుణ్యాత్ముడివోయీ విశ్వపతీ! మేలుకున్నంతసేపూ పనిచేయడం, యిక సాగదనిపించగానే పడుకోవడం. పడుకోగానే నిద్రపోగలగడం, ఈ మూడు దివ్యవరాలు నీ కేదేవుడిచ్చాడురా బాబూ! ఆ దేవుడెవరోగానీ వాడి హృదయం కరుణకు కాణాచిరా తండ్రీ శరీరాన్ని పడకపైన చేరవేసి దొర్లి దొర్లి నుసిగి నుసిగి, వెయ్యి రకాలుగా బ్రతిమాలినా నిద్రాదేవత కొందరిని కరుణించదే!

అవునండీ నిజం! ఆ రోజు రాత్రి నాకు నిద్రపడితే ఒట్టు! ఏం పని చేశానని నాకు నిద్రపడుతుంది? మిత్రుడి గృహంలో భోజనానికి భరోసా చిక్కిందిగదా అని గోళ్లు గిల్లుకుంటూ కూర్చున్నాను చేసిన పనికి తగ్గట్లుగా శరీరం మానవుడి కిచ్చే అనుదిన వేతనం—నిద్ర. పగటిపూట నిద్ర పోతావు. పీసమెత్తు పనిచెయ్యవు. రాత్రివేళ కన్ను పొడుచుకున్నా నిద్ర పట్టదు. నో ఎక్సెప్షన్, కుర్చీలో కూర్చుని పనిచేసినట్లే నటిస్తూ, వృథాగా కాలహరణం చేసి ముప్పయి రోజులు తిరగగానే నెలజీతం జేబులో వేసుకోడానికి యిదేమైనా గవర్మెంటు ఉద్యోగమా మనసులో నూట పదహారు కుళ్ళుబుద్ధులు దాచుకుని యింతకంటే పెద్దమనిషి మరొకడుండనట్లుగా అభినయిస్తే కావచ్చులెమ్మని మోసపోవడానికి మానవ సమాజమా? కాదు. ఇది శరీర యంత్రం. దేవుడిచ్చింది. పని నహీ, నిద్ర నహీ.

తల్లిదండ్రులపట్ల, భార్యాబిడ్డలపట్ల సమాజంపట్ల మానవుడు నిర్వర్తింపవలసినవిధులున్నాయి. ఏరోజు కా రోజు ఆ విధుల్ని సక్రమంగా నిర్వ

త్రి స్తేనే, అతగాడు ఋణ విముక్తుడైనట్లు లేదా, అతడు బాకీపడినవాడు, ఋణబాధ దారుణంగదా! కంటికి కూర్కురమ్మంటే ఎలా వస్తుంది? ఏదీ, నిద్రపో చూద్దాం. నువ్వెలా నిద్రపోగలవో నేను చూస్తాను! అంటూ చేతకర్ర బుచ్చుకుని మనసు నన్ను కాపలా కాస్తోంది. అది కాస్తా ఆద మరిచి వున్నప్పుడు కనీసం ఒక్కసారైనా కునుకుదీసి లేవాలన్నది నా ప్రయత్నం. ఆ ప్రయత్నం ఎన్నిసార్లు ఫలించిందో, ఫలించబోతుండగా ఎన్నిసార్లు విఫలమైందో నేను నిష్కర్షగా చెప్పలేను. గంట నాలుగు కావస్తుండగా వీధి తలుపు కిర్రుమని తెరుచుకున్న సవ్వడి వినిపించింది. ఆ తరువాత నడవగుండా సైకిలు తోసుకెళ్తున్న అలికిడికూడా వినవచ్చింది. ఉలికిపడి లేచి కూర్చోబోతూ "ఎవరక్కడ?" అన్నాను. "నేనేలే రాజ శేఖరం! మేలుకునే వున్నావా? వస్తావా బస్ స్టాండుదాకా వెళ్ళొద్దాం." అన్నాడు విశ్వపతి.

"బస్ స్టాండుదాకా! ఇప్పుడెందుకూ?"

"ఈ వేళప్పుడు బస్‌స్టాండు ఎలా వుంటుందో నువ్వు చూచి వుండవు. రచయితవుగదా? పనికొస్తుందిలే! లేచి రావోయ్ రాజ శేఖరం."

ఆ యింటికి బస్ స్టాండొక అరమైలు దూరంలో వుంటుంది. నగరం ఇంకా మేలుకోలేదు. పగటివేళలో చేయడానికి వీల్లేని పనులు కొన్నింటిని రాత్రుల్లో సునాయాసంగా చేసిపారెయవచ్చు. తాను సైకి లెక్కుతూ విశ్వపతి నన్ను వెనకవైపున కూర్చోమన్నాడు.

కొద్ది నిమిషాల సైకిలుజర్నీ మమ్మల్ని బస్‌స్టాండులో దిగ విడి చింది.

దూరంగా హోటళ్ళు, దగ్గరగా టీ స్టాల్స్ మినహాగా బస్ స్టాండులో మసక చీకటే రాజ్యమేలుతోంది. అక్కడక్కడా ఒకరిద్దరు మనుషులు నడమాడకపోలేదు. ఆకృతులో స్థూలరేఖల్ని బట్టిమాత్రమే అవి మానవా కారాల్లా తెలియవస్తున్నాయి. ఉండి పుడిగే బ్రోకర్లు కొందరు ఏయే బస్సు

ఎక్కడెక్కడికి వెళ్తున్నదీ గొంతెత్తి అరుస్తున్నారు. నా పరిశీలన యింకా పూర్తి కానేలేదు. విశ్వపతి ఏ టీ స్టాల్లోనో దూరి ఓ పెద్ద ట్రంకుపెట్టెలాంటి పార్సెల్‌తో ఈవలికి వచ్చాడు.

"నా కొకటి రెండుగంటల పనుంది రాజశేఖరం! అందాకా నువ్విక్కడే బస్ స్టాండు విశేషాలు తిలకిస్తూ కూర్చున్నా సరే! లేదా నీకొక పత్రిక యిస్తాను. ఇంటికివెళ్ళి చదువుతూ కూర్చున్నా సరే!" అన్నాడు.

"నువ్వు దినపత్రిక ఏజన్సీకూడా పుచ్చుకున్నావా ఏమిటి విశ్వపతీ!" అన్నాను.

"దినపత్రిక ఏజన్సీ వెనుకకూడా గొప్ప పరమార్థం వుందిలే రాజశేఖరం! నీకు తెలియదు. ఎక్కడివాళ్ళక్కడ పడుకుని ఆదమరచి నిద్రపోతారా. తెల్లవారగానే నిద్ర లేస్తారు. గడచిన యిరవైనాలుగు గంటల్లో ప్రపంచం ఎంతగా మారిందీ, ఎన్ని విశేషాలు జరిగిందీ వాళ్ళు తెలుసుకోవద్దూ! భూగోళం తనచుట్టూ తానొకసారి ప్రదక్షిణం పూర్తిచేసేసరికి సూర్యుడుదయిస్తున్నాడు. ఆ సూర్యుణ్ణి లోకబాంధవుడంటున్నాం. ఈ దినపత్రిక మాత్రం లోకబాంధవి కాకపోయిందా? అనుదినమూ యిదిలా క్రొత్త ప్రాణాలు పోసుకొని యింటింటికీ వెళ్ళగలుగుతోందంటే అందుకోసం ఎందరెందరు ఎన్నెన్ని విధాలుగా పనిచేస్తున్నాడో వూహించాలి. ఎడిటర్ రిపోర్టులు, వార్తలు పంపుతున్నాడు. ఆ వార్తల్ని వడగడుతున్నారు. విద్యుత్తు ప్రవహిస్తోంది. యంత్రాలు కదులుతున్నాయి. బస్సులు రైళ్ళు పరుగెడుతున్నాయి. ఈ మహా యంత్రాంగంలో నేనొక చిన్న మరచీలనుకో! అలా భావించబడటం నాకు గౌరవమే! ఇదిగో నీకొక పేపరు. డబ్బివ్వనక్కరలేదులే! ఉచితంగా ఏజంటుకొక కాపీ యిస్తారు. చదవటానికి నాకు తీరికుండదు. నీబోటి వాళ్ళకిచ్చి సారాంశం మాత్రం తెలుసుకుంటాను—బయల్దేరవా రాజశేఖరం! నువ్వా హోటల్లో కూర్చో. ఆరు గంటలకల్లా నేను నీ ముందు హాజరు...."

సౌఖశాయనికుడిలా ఊరిపైన పడ్డాడు విశ్వపతి.

మాయ లివాసీలా దినపత్రిక నన్ను ప్రపంచం నలుమూలలకూ త్రిప్పింది. అక్షరం వదిలిపెట్టకుండా అడ్వర్టయిజ్మెంట్లతో సహా చదివేశాను. అవతలివైపున ఆకాశంలో అరుణరాగం చెల్లాచెదరైపోయి. అంశుమాలి కిరణాలు ప్రకృతి కొప్పులో బంగారు సూదుల్లా పైకెగ బ్రాకుతున్నాయి. ఊరినొక చుట్టువేసుకుని హూటాహూటీగా తిరిగివచ్చి హోటలు ఎదుట సైకిలు దిగిన విశ్వపతి ముఖంలో చిరు చెమటలు కమ్ముకుంటున్నాయి. నాకైతే టిఫిన్ చేయాలన్న ధ్యాస అపాటికింకా కలగనే లేదు. ఒక్క కాఫీతో నేను మధ్యాహ్నందాకా వుండిపోగలను. కాని విశ్వపతికి అవురావురంటూ ఆకలివేస్తూ వుండవచ్చు.

"ఎలాగూ భళ్ళున తెల్లవారిపోయింది విశ్వపతీ! ఏకంగా టిఫిన్ చేసి యింటికి వెళ్దాం" అన్నాను.

"భలే వాడివే! ఇంట్లో వందమందికి ఉపాహారం సిద్ధమౌతుండగా నువ్వు హోటల్లో టిఫిన్ చేస్తావా!"

"వందమందికి టిఫినా! ఎందుకూ!"

అదీ చెప్పాడు విశ్వపతి. స్కూల్లో ఎన్. సి. సి. కుర్రాళ్ళకు కంట్రాక్టు పద్ధతిపైన తానే టిఫిన్ సప్లయి చేస్తుంటాడట. ఇది వారానికి మూడు తడవలు మాత్రమే జరిగే పని!

"ఈ పాటికి పోయిమీద బాణలి పెట్టేసి వుంటారు. నూనె కాగుతూ వుంటుంది, పూరీలు రుద్దేస్తుంటారు. పచ్చిమిరపకాయలు, ఎర్రగడ్డలు యింట్లోనే వున్నాయి. మనం యిలా మార్కెట్టుకు వెళ్ళి రెండు వీశెల బంగాళాదుంపలు పట్టుకెళ్ళామంటే అరగంటలో టిఫినైపోతుంది. ఎనిమిది గంటలకల్లా పొట్లాలు తట్టలో వుండాలి మరి........"

"చూడు విశ్వపతీ!" ఏడుపురావడ మొక్కటే కొరతగా వున్న కంఠంతో, ప్రాధేయపడుతూ అడిగాను నేను—"ఎనిమిది గంటల తర్వాత

సీ ప్రోగ్రామేమిటో నేను తెలుసుకోవాలి. దాన్నిబట్టి నా ప్రోగ్రామును నేను నిర్ణయించుకోవలసివుంది...."

విశ్వపతి తటాలున రోడ్డుపైన ఆగిపోయి "నువ్వు నాతో ఏదైనా పనివుండి వచ్చావా రాజశేఖరం!" అన్నాడు.

"పని సంగతి తర్వాత చెబుతాను. మొదట నీ కార్యక్రమమేమిటో చెప్పు" అన్నాను.

"మరేంలేదు. నాటకాలపోటీ అన్నానుగదూ! పదిన్నరకు సారథ్య సంఘ సమావేశం వుంది. ఆలోగా కొందరు మెంబర్లకు యింటిమేట్ చేసి రావాలి. రెండుగంటలకు బంగారుపాళెం వెళ్ళాలి, హెడ్మాస్టరు గిరిధరరావుగారు మనిషిపైన మనిషిని పంపుతున్నారు. వాళ్ళ పిల్లల కేవో జాతీయగీతాలు నేర్పాలట. తిరిగి రావటానికి అయిదు కావచ్చు. ఆరు గంటలకక్కడ శ్రీరామవిలాస సభలో...."

వాక్యం సగంలో ఆగిపోయింది. "ఈ సైకిల్ కాస్త పట్టుకుంటావా రాజశేఖరం!" అన్నాడు విశ్వపతి. "అదిగో, శ్రీమన్నారాయణమూర్తి డిస్పెన్సరీలోకి వెళ్తున్నారు. ఆయన మన సారథ్య సంఘంలో ఒక మెంబరు. ఇప్పుడే ఒకమాట చెప్పేస్తే మళ్ళీ యింటికి వెళ్ళవలసిన అవసరం ఉండదు...."

లాభంలేదు, నా నవలను విశ్వపతికి చదివి వినిపించడం సాధ్యం కాదని తేలిపోయింది. పట్టణానికి రావడంవల్ల నే ననుకున్న పని కాలేదు. చేకూరిన ప్రయోజనం యింకొకటి. "విశ్వపతితో యిరవై నాలుగు గంటలు" అని వ్యాసం వ్రాయదలచుకుంటే, అందుకు మెటీరియల్ దొరికింది. కాలమన్న గుర్రంపైన కూర్చుని, కళ్ళెం చేతపట్టుకుని దాన్ని తన చెప్పుచేతల్లో పరుగెత్తిస్తున్నాడు విశ్వపతి. తాను నిద్రపోవలసి వచ్చినప్పుడు మాత్రమే ఆ గుర్రానికి విశ్రాంతి. తాను నిద్రలేచేసరికి అది మళ్ళీ సిద్ధంగా వుండాలి. మళ్ళీ పరుగు, మళ్ళీ ప్రయాణం.

"సాగుమా సాహిణీ, అగవివేగమే జీవితము" అన్న నిర్వచనమే ఈ ప్రయాణానికి ప్రమాణం.

"వెళ్ళొస్తాను విశ్వపతీ" అన్నాను.

"అబ్బే, వచ్చిన పనేమిటో చెప్పందే, నిన్ను వెళ్ళనివ్వను" అన్నాడు విశ్వపతి.

చెప్పాను.

"అలాగా! నవల వ్రాశావా రాజశేఖరం! నిన్నటినుంచీ నాకొక మాట మాత్రమైనా చెప్పావుకాదు. నేను తప్పకుండా చదవాలి. మరేమీ అభ్యంతరం లేకపోతే పుస్తకం నాచేతికిచ్చి వెళ్ళు. విరామం దొరికినప్పుడు ఒకటే వూపులో చదివేస్తాను...."

పుస్తకం విశ్వపతి చేతుల్లో పెట్టి నేను సెలవు తీసుకున్నాను.

నెల రోజుల తర్వాత నేను వ్రాసిన ఉత్తరానికి ప్రత్యుత్తరం వచ్చింది. నాటక పోటీలు జరుగుతున్నాయట. రాష్ట్రంలో పలుతావుల్లో నుంచీ వచ్చి యిరవైనాలుగు నాటక సమాజాలు అందులో పాల్గొంటున్నాయట. వచ్చినవారికి విడిది భోజన సదుపాయాలు నిర్వాహకులే సమకూరుస్తున్నారట. తన కొక క్షణమైనా తీరిక దొరకడం లేదని వ్రాశాడు విశ్వపతి. అందుకు దాఖలాగా ఉత్తరాన్ని ఎవరిచేతనో వ్రాయించి. తానొక సంతకంమాత్రమే పెట్టి పోస్టుచేశాడు. "నిజంగా ఒకచోట కూర్చుని పట్టుమని నాలుగుగీతలు వ్రాసే ఓపరికమే నాకుంటే నవల వ్రాయమని నీకు కథ చెబుతానా రాజశేఖరం? ఇలా జరిగినందుకు మరేమీ అనుకోవుగదూ" అని చమత్కరించాడు.

నా నవలపైన అభిప్రాయం తెలుపవలసిందని మాటిమాటికీ నేను విశవపతిని యిబ్బందిలో పెట్టదలచుకోలేదు. అందువల్ల తాత్కాలికంగా అతడికి ఉత్తరాలు వ్రాయడంకూడా మానుకున్నాను. మళ్ళీ నెలరోజుల తర్వాత విశ్వపతి తానే ఒక ఉత్తరం వ్రాశాడు. స్వయంగా తన స్వంత దస్తూరీతోనే వ్రాయడం యిందులోని విశేషం. దక్షిణాదికి యాత్రవెళ్ళి వచ్చే నిమిత్తం తానొక బస్సును ఏర్పాటు చేస్తున్నాడట! వారం రోజుల యాత్ర రాకపోకలకంటూ చెల్లించుకోవలసింది అరవై రూపాయలు మాత్రం. ఎవరి

భోజనాలు వాళ్ళవే, మదరాసు, పింగప్పెరుమాన్ కోయిల్, పక్షితీర్థం, మహాబలిపురం, పాండిచ్చేరి, నైవేలి, కోయంబత్తూరు, తంజావూరు, మధుర, ధనుష్కోటి....అంటూ ఒక పెద్ద జాబితా ఏకరువు పెట్టాడు. ఇది వరకొక జాబులో నేను మరేమీ వ్యాపకాలు లేకుండా ఒక అరగంటసేపు మీ పాట వినగలిగితే బాగుండునని వ్రాశాను. అందుకొక దివ్యమైన అవకాశాన్ని సూచించాడు విశ్వపతి. పరుగెడుతున్న బస్సులో ఎంతసేపు పాడుకున్నా, అడిగే వాళ్ళుండరట. "కొండలు కోనలు, పంటపొలాలు, కొబ్బరితోటలు వాటి నడుమ బస్సు పరుగిడుతుంటే వెన్నెల రాత్రుల్లా లోక మంతా విశ్రమించేవేళ ఎలుగెత్తి పాడుకోడం మహదానందకరంకాదా రాజశేఖరం?" అన్నాడు. అమ్మో. విశ్వపతిలో కవికూడా దాగివున్నాడు. సహజంగానే కొంత బద్ధకస్తులైన కవులకు, కథకులకు కూడా బ్రతుకు గడవాలి గదా అన్న సదుద్దేశంతోనే కావచ్చు. భగవంతుడు విశ్వపతి కా రచనా స్ఫూర్తినీ. రచనా శక్తినీ యివ్వడం మానేసేవుంటాడు.

వరుసగా వారం రోజుల పొడుగునా ఇల్లు విడిచి వుండగల పరిస్థితులు నాకు లేవు. అందువల్ల దక్షిణాది యాత్రలకు వెళ్ళలేక పోయాను.

ఆ తరువాత రెండు మాసాలవరకూ విశ్వపతిని గురించిన వర్తమానాలు నాకు తెలియవు. ఏదో పనిమీద హఠాత్తుగా పట్టణం వెళ్ళవలసిన పని తగిలింది. వెళ్ళిన తరువాత కనిపించే రావాలి. ఇంటికి వెళ్ళాను. విశ్వపతిలేడు. పాఠశాలలు పనిచేసే సమయం. ఇంటిలోపల అలికిడి లేక పోవడంలో ఆశ్చర్యం లేదు. విశ్వపతి భార్య కనిపించింది. "ఈ మధ్య ఆయనకు పెద్ద జబ్బు చేసిందండీ అన్నగారూ! బెంగపడి పోయాము! ఆ జ్వరంలోనైనా వూరుకోరేమోనని తీసుకెళ్ళి ఆసుపత్రిలో చేర్పించారు. ఇప్పుడొక నాలుగు రోజులుగానే జ్వరంలేనిది. పథ్యం పుచ్చుకుంటున్నారు. రేపో మాపో డిశ్చార్జ్ చేస్తారట," అంటూ ఆమె గ్రుక్క త్రిప్పుకోకుండా విషయం నివేదించింది.

ఎక్కవచ్చినవ రికాలో అలాగే ఆసుపత్రికి వెళ్లాను.

దిట్టంగా ఒక మంచమూ, దానిపైన మెత్తగా ఒక పడక, ఆమకో
డానికి పొందికగా ఒక దిండు, ఈ అదనపు సౌకర్యాలను వినియోగించుకుని
సగం పడుకున్నట్టుగా, సగం కూర్చున్నట్టుగా మంచంపైన సేదదీరుతూ
మోకాళ్ళకానించి తెరిచి పట్టుకున్న పుస్తకంలోనుంచీ నా నవలను దీక్షగా
చదివేస్తున్నాడు విశ్వపతి.

నేను ద్వారం దగ్గరే నిల్చున్నాను.

ఒకటి, రెండు నిమిషాలకుగానీ అతడు ద్వారం దగ్గర మనిషి
పొలకువను పసిగట్టలేదు. తల పైకెత్తి నేను కనిపించగానే "వచ్చావా రాజ
శేఖరం!'' అన్నాడు. ఆ పలకరింపులో నా కోసమే వేచికూర్చున్న భావం
వుంది. ''నువ్వు రావలసిందే! ఎందుకంటే నా అభిప్రాయం గాలికి తెరిచి
పెట్టిన హారతి కర్పూరం. సమయానికి నువ్వు రాకపోతే అది కాస్తా అయిపు
లేకుండా హరించుకపోవచ్చు. రా, కూర్చో. ఐనా, యిదేమిటి బాబూ,
ఈ నవలనిలా వ్రాసి పెట్టావు. ఇందులో కొన్నిచోట్ల కథ కదలదే! ఈ
రమేష్, ఈ రంగనాథం ఈ శాంత ఈ శ్యామల వీళ్ళకు మరేమీ పనులు
లేవా? గంటల తరబడి ఒక గదిలో కూర్చుని మాట్లాడు కుంటారా? దిక్కుల
అంచులదాకా వ్యాపించివున్న సముద్రాన్ని వదిలిపెట్టి వచ్చి వీళ్ళలా చెంబెడు
నీళ్ళలోపడి గిలగిలా కొట్టుకుంటా రెందుకయ్యా బాబూ! ఇదంతా ఎలా
వుందంటే రాజశేఖరం, నా చిన్నతనంలో ఒక వుపద్రవం జరిగింది.
దాగుడుమూత లాడుకుంటున్నామేమో, ఎవరకీ తెలియకుండా వుండాలని
నేనొక కొయ్యపెట్టె తీసి అందులో కూర్చున్నాను. కూర్చున్నవాణ్ని
అంతటితో వూరుకోకుండా పైన మూత వేసుకున్నాను. ఆ మూతకొక చిలు
కుంది. అది కాస్తా కొక్కానికి తగులుకు పోయింది. కాళ్ళూ, చేతులూ
కదిలించవచ్చు. తల మాత్రం క్రిందికీ పైకీ ఆడించవచ్చు. ఆ కదలిక
కూడా కొద్ది అంగుళాళమేరకే పరిమితం. అయిదు నిమిషాలలా గడిస్తే, ఆ
తరువాత, వూపిరి త్రిప్పుకోడంకూడా సాధ్యం కాకపోవచ్చు. భగవంతుడా,

ఇక నా గతి యింతేనేమో! నేనింక రోడ్డుపైకి వెళ్ళలేనేమో! మనుషుల ముఖం చూడలేనేమో! ఆ బస్సులు, ఆ రైళ్లు ఆ విశాల ప్రపంచం అవన్నీ నా పాలిటికిక మిథ్యేనేమో! ఇదంతా ఒకటి రెండు నిమిషాల దురవస్థ. కానీ తలచుకుంటే యిప్పటికీ గుండె గుభేలుమంటుంది. వద్దు బాబూ వద్దు. ఆ దురవస్థ పగవాడికైనా వద్దు. నీ రమేషు, నీ రంగనాథం వగయిరాలతో అలా మాట్లాడించడం తప్పనిసరయితే, వాళ్ళని కనీసం ఏ పరుగిడుతున్న రైల్లోనయినా కూర్చోబెట్టు. నా కంతే కావలసింది. మిగిలిన విషయాల్లో నీ నవల చాలా బాగుంది....''

ఆనాటి సాయంకాలం ఆసుపత్రినుంచి డిశ్చార్జి అయ్యాడు విశ్వపతి.

మరునాటి వుదయం పెరిగిపోయిన క్రాపింగును సంస్కరించుకోడం కోసం సెలూనుకు బయల్దేరిన వాడల్లా ఆ కార్యక్రమాన్ని కొంత సేపటి వరకూ వాయిదా వేసుకుని బస్‌స్టాండుదాకా వచ్చి నన్ను బస్సెక్కించాడు.

"మళ్ళీ యింకొక నవలకు ప్లాటుకావాలి విశ్వపతీ! ఎప్పుడు చెబుతావు!'' అన్నాను.

''మళ్ళీ యింకొకప్పుడెప్పుడైనా లారీ కోసం వేచివున్నప్పుడడిగితే తప్పకుండా చెబుతాను'' అన్నాడు విశ్వపతి.

నా కొక అమంగళం స్ఫురించింది. ''ఎందుకులే విశ్వపతీ! దానినెవ్వు చదవాలంటే మళ్ళీ జబ్బుపడాలి. వద్దులేబాబూ! నువ్వు చెప్పనే వద్దు'' అన్నాను.

విశ్వపతి నవ్వసాగాడు.

బస్సు బయల్దేరడాని కింకా కొంత టైముంది.

''వెళ్దువుగాని కూర్చో విశ్వపతీ!'' అన్నాను.

''అబ్బే, వెళ్ళాలి రాజశేఖరం! తల కత్తిరించుకుని, వేడివేడిగా నీళ్లు కుమ్మరించుకోవాలి. ఇన్నినాళ్ళుగా ఈ వూరంతా ఏమైందో ఏమిటో

ఒకసారి నాలుగువైపులా వెళ్లాలి. పదిమందినీ కలుసుకోవాలి. వస్తాను మరి. ఇక్కడికి కొచ్చినప్పడల్లా కనిపిస్తుంటావు గదూ... "

సైకిలెక్కాడు విశ్వపతి. ఆ సైకిలు రాకెట్టులా రోడ్డుపైకి దూసుకపోతోంది. గిర్రున తిరిగిపోతున్న ఆ సైకిలు చక్రాలు బ్రతకడానికి పని చేయడమే పరమార్థమని చెబుతున్నట్టున్నాయి. నిజమే? జడత్వం మృత్యులక్షణం. చైతన్యం జీవలక్షణం. నిర్వ్యాపారత్వం మృత్యులక్షణం. నిరంతర కార్యాచరణ జీవలక్షణం. ప్రొద్దు పోకపోవడం మృత్యులక్షణం. ప్రొద్దు చాలకపోవడం జీవలక్షణం, విశ్వపతి ప్రొద్దుచాలని మనిషి. ★

# ఒకే కాడ రెండు పువ్వులు

ఉన్నట్టుండి సుబ్బరామయ్యకు తాసిల్దారుగారితో పనిబడింది. మరొకరూ మరొకరూ అయితే చిటికెలో సాధించుక రాగలిగిన పని. కానీ సుబ్బరామయ్య పాలిటి కది కొండల్ని త్రవ్వడమంత కష్టసాధ్యంగా కనిపించింది.

ఉద్యోగుల ముఖం చూడరాదన్నది; కాకపోతే వాళ్ళ ముఖాన పడరాదన్నది సుబ్బరామయ్య ఆదర్శం. వార్తా పత్రిక చూడకుండా వుండడం సాధ్యంగావచ్చు, సినిమాకు వెళ్ళకుండా వుండడం సాధ్యం గావచ్చు, వానలో తడవకుండా సాధ్యంగావచ్చు. కానీ, ఈనాటి మానవుడు ఏ రంగంలో జీవిస్తున్నా, ఉద్యోగులతో జోక్యం పెట్టుకోకుండా జీవించడం దుస్తరం! కానీ, సుబ్బరామయ్య విషయం వేరు. ఆరు నూరైనా, నూరు ఆరైనా అతడు తన ఆదర్శంనుంచి ఏనాడూ తప్పటడుగు వేయలేదు.

ఇక్కడెవరికైనా ఉద్యోగుల పట్ల సుబ్బరామయ్య కలాంటి అభిప్రాయం కలగడానికి కారణ మేమైవుంటుందన్న జిజ్ఞాస కలగడం సహజమే; పూర్వగాధ లేకపోలేదు. సుబ్బరామయ్య ఉద్యోగులని గొప్పగా చెప్పుకోదగినవారెవరూ లేని పల్లెలో పుట్టి పెరిగాడు. గ్రామంలోవున్న మునసబు, కరణము గ్రామ పౌరులుగానే తప్పా, ఉద్యోగులుగా పరిగణింపబడేవారు కారు. ఆ ఊరి పేరు కంకి మిట్ట. గ్రామ కరణం పేరు శరభయ్య. అతడు సుబ్బరామయ్య తండ్రికి వేలువిడిచిన పెదతండ్రి కొడుకు. అందువల్ల సుబ్బరామయ్యకు పెద తండ్రి వరుస. పాపం, అతగాడికి పిల్లలు లేరు. తనకు పిల్లలు లేకపోతే గాపీ, ఎదుటివారి బిడ్డలను ప్రేమతో దగ్గరికి చేరదీయరాదన్న సిద్ధాంతం మనుస్మృతిలో వుందో, లేదో తెలియదు. ఆ సిద్ధాంతానికి అనుగుణ్యంగా శరభయ్య సుబ్బరామయ్యను దగ్గరకు చేరదీసి ముద్దుకు చూచుకుంటూ మురిపాలు ఒలకబోసేవాడు. ముద్దు మురిపాలతో

బాటుగా అతడు తన సుగుణ సంపత్తినిగూడా కొంతలో కొంత సుబ్బ్రామయ్యకు సంక్రమింప జేశాడు.

పేరుకు శరభయ్యేగానీ కంకిమిట్ట కరణం ధాటీగా నీళ్ళయినా మ్రింగడం చేతకాని సాధువు. రివిన్యూ యిన్స్పెక్టరు గ్రామంలోకి రాబోతున్నాడంటే, ఆ ప్రాంతంలో రాజాధి రాజొకడు మజిలీ వేయబోతున్నాడన్నంతగా అతడు బెంబేలు పడిపోయేవాడు. కూర్చున్నచోట కూర్చునేవాడు గాడు. నిల్చున్నచోట నిల్చునేవాడు కాడు. రివిన్యూ యిన్స్పెక్టరుగారు రాబోతున్నాడని చెప్పుకుంటూ గ్రామమంతా చెడదిరిగేసేవాడు. రాబోతున్న ఉద్యోగి శాకాహారి అయితే అందుకొక రకమైన ఏర్పాటు. సర్వభక్షకుడైతే అందుకొక విధమైన సన్నాహం. రోడ్డులో బస్సు దిగితే, అక్కడినుంచి పట్టుమని నాలుగు ఫర్లాంగులు లేకపోయినా, ఆ మాత్రం నడచి రావటానికైనా ఉద్యోగిగారి సుతిమెత్తని ప్రాణం ఒప్పుకోక పోవచ్చునని అందుకోసం ఒక ఒంటెద్దు బండి తయారింపు. అతడువచ్చి బండిదిగేసరికి, లోపలికి వెళ్ళి పాత కోటు తగిలించుకుని, తలపాగా సర్దుకుంటూ బయటికి పరతెంచి వచ్చే తీరు. ఆపాటికే చంకల్లో పొన్నుకర్ర లమరగా, నడుములదాకా వంగబెట్టి, ముకుళిత హస్తుల్నిగా చేసి తోటి, తలారి వారిని ముందు వెనుకలుగా నిల్పోబెట్టిన పద్ధతి - చిన్ననాడు యిలాంటి దృశ్యాలను తరచుగా చూడడానికి అలవాటు పడ్డాడు సుబ్బ్రామయ్య.

రివిన్యూ యిన్స్పెక్టరుగారు వెళ్ళిపోయిన తర్వాత, నిండుగా వూపిరి వదిలి అరుగుపైన చతికిలపడిపోయేవాడు శరభయ్య. సుబ్బ్రామయ్య మెల్లగా అతడి సరసకు చేరేవాడు. సదుపదేశాలప్పుడే ప్రారంభ మయ్యేవి.

భయం;"అదికాదు పెదనాన్నా! రివిన్యూ యిన్స్పెక్టరంటే ఎందుకంత అతడిచేత తుపాకీ అయినా లేదే; అతడు కనీసం ఎర్రటోపీ అయినా వేసుకోలేదే."

బుల్లివాడి అమాయకత్వానికి శరభయ్య పకాలున నవ్వేసేవాడు "ఒరేయ్ కుర్రకుంకా! నాకు తెలుసు. నువ్వు చెపుతున్నది పోలీసును గురించి. రివెన్యూ యిన్స్పెక్టరు పోలీసెందుకౌతాడు. ఆయన మరికొంత కాలానికి

తాశీల్దారవుతాడు. తాశీల్దారంటే ఏమిటో తెలుసా; తాలూకా కంతా పెద్ద. నువ్వెక్కడ చూశావుగానీ కోటకొమ్మల (తాలూకా కేంద్రం)లో తాలూకాఫీసుంది. ఎర్రటి ఇటుకరాళ్ళతో కోటలాంటి కట్టడం. ఇనుప కమ్మల దర్వాజా లుంటాయి దానికి; నువ్విందాకా చెప్పావే. ఆ పోలీసువాళ్ళు ఆ తలుపుల దగ్గర కాపలా వుంటారు...."

"పోలీసులు కాపలా కాయడమెందుకు నాన్నా?"

"అది తాశీల్దారుగా రుండే చోటు గదూ! అందుకని...."

"పోలీసులు లేకపోతే, తాశీల్దారుగారు ఒంటరిగా వుండలేడా పెదనాన్నా!"

"ఛాఛా? ఆయన కేం భయంరా సుబ్బులూ: తాలూకా అంతటా వసూలైన కిస్తీ డబ్బులు అక్కడే వుంటాయి గదూ! ఆ ఖజానాకు పోలీసులు కాపలా కాస్తారన్నమాట!"

"ఓయబ్బో! అలాగైతే తాశీల్దారుగారి దగ్గర లెక్కలేనంత డబ్బుంటుందన్నమాట?"

"ఉంటుంది గానీ. ఆ డబ్బు ఆయనది గాదురా సుబ్బులూ; గవర్మెంటుది ..."

"గవర్మెంటా? వాడెవడు పెదనాన్నా? తాశీల్దారుకంటే గొప్పవాడా ఏమిటి?"

ఇలాంటి చొప్పదంటు సందేహాలవల్ల గవర్మెంటుయొక్క ఘనత కేదో అపచారం జరిగిపోయినట్టుగా నొచ్చుకునేవాడు శరభయ్య - "గవర్మెంటంటే మనిషి కాదురా సుబ్బులూ! అదొక సంస్థ. తెలుగులో ప్రభుత్వం అనడం దాన్నే! తాలూకా కొక తాశీల్దారుంటాడా? అలాంటి తాశీల్దారులు పది, పన్నెండుగురికి పైన కలెక్టరుంటాడు. జిల్లాలో అతడి అధికారానికి తిరుగుండదు. ఎంత కొమ్ములు తిరిగిన తాశీల్దారయినా సరే. కలెక్టరుగారి ఎదుట గడగడలాడి పోవలసిందే? అంతెందుకు! గవర్మెంటొక కొండలాంటిదనుకో!

అందులో నేను-అంటే గ్రామ కరణాన్ని — ఒక చిన్న గులకరాయిలాంటి వాణ్ణి. రివిన్యూ యిన్స్పెక్టరొక గుండ్రాయిలాంటి వాడనుకో. అప్పుడు తాశీల్దారు ఒక రుబ్బురాయంతటి వాడు. రెండు చేతులతోనూ అప్పళించుకో డానికి వీల్లేని పెద్ద గుండుంది చూచావూ, కలెక్టరు నంతటి వాడను కోవచ్చు....''

''మరైతే కొండల్లో అంతకంటే పెద్ద గుండ్లుండవా పెదనాన్నా?''

''ఎందుకుండవు. వాళ్ళే గవర్నర్లు. మనం దేవుళ్ళనేనాడైనా చూచామట్రా సుబ్బులూ? నే నొకసారి గవర్నరు దొరగారిని చూచాను. రాజ్యమేల డానికి పుట్టినవాళ్ళు అలా వుంటారేమో? అబ్బ, ఏం మీసాలు! ఏం ఠీవి! కారులోనుంచి దిగి హుందాగా చేతులూపుకుంటూ, అలా అలా మందగమనంతో వచ్చి బంగళాముందు నిల్చున్నాడు. నిలువెత్తు భారీ మనిషి, ఆయనొక వూడల మర్రిలా వున్నాడనుకో! ఆయన ఎదుట కలెక్టర్లు కానుగ చెట్లు, తాశీల్దారులు తుమ్మచెట్లు, రివిన్యూ యిన్స్పెక్టరులు గరికపోచలు, మరి మాలాంటివాళ్ళ దేముంది? మేము లెక్కలోనివాళ్ళం కాము....''

''అలాగైతే ఈ రాజ్యమంతా గవర్నరుదేనా పెదనాన్నా?''

''అబ్బే, అతడుగూడా ఉద్యోగస్తుడే! అలాంటి గవర్నరులందరూ వైస్రాయికి సలాములు చేయాలి మరి! చెప్పుకోవడమేగానీ వైస్రాయిని ఎవరు చూచారురా సుబ్బులూ! ఎక్కడో ఢిల్లీలో వుంటాడుట! ఢిల్లీ, ఢిల్లీ అనడమేగానీ అదెల్లావుందో ఏమిటో! రైల్లో వెళ్ళి రావాలంటే టిక్కెట్లుకే వంద రూపాయలు కావాలిట!''

''ఆ వైస్రాయి ఇంకొకరికి భయపడాల్సిన అవసరం వుండదా పెదనాన్నా?''

''ఎందుకుండదు! వైస్రాయి రాజుగారికి జవాబు చెప్పుకోవాలిగదా? తెలియదట్రా సుబ్బులూ! మనదేశానికి రాజు ఇంగ్లాండులో వుంటారు. మృగాల్లో సింహం రాజుగదూ! చుక్కల్లో చంద్రుడు రాజుగదూ! నరమానవులకు ఆయన అలాంటి రాజన్నమాట? అందరూ ఆయనకే భయపడాలి.

ఆయన ఒకరికీ భయపడరు. అందరూ ఆయనకి జవాబు చెప్పుకోవాలి. ఆయన ఒకరికి జవాబు చెప్పరు—."

ఈ అధికారోపనిషత్తును శ్రద్ధగా విన్నందుకు ఫలితంగా సుబ్బరామయ్య లేత బుర్రలో ఒక తిరుగులేని అభిప్రాయం నెలనాటుక పోయింది.

తాను బ్రతికితే ఆ మహారాజులాగైనా బ్రతకాలి. (ఆయన ఒకరికి భయపడడు గనుక!) లేదా అసలు పినలు సుబ్బరామయ్య లాగైనా బ్రకకాలి. (తానొకరికి భయపడవలసిన అవసరం లేదు గనుక!) అంతేగానీ వెళ్ళి వెళ్ళి సాలీడు గూటిలో తగులుకున్న ఈగలా ఉద్యోగుల చక్రంలో యిరుక్కో గూడదు!

కానీ సుబ్బరామయ్య తండ్రికి మాత్రం తన కుమారుడు ఉద్యోగాలు చేసి, ఊళ్ళేలాలన్న కోరిక మిక్కుటంగా వుండేది. మెట్రిక్కుదాకా చదువు కుంటే సబ్ యిన్స్పెక్టరు గావచ్చు. శిరస్తాదారు గావచ్చు. కలెక్టరాఫీసులో హెడ్డు గుమాస్తా గావచ్చు- దేవుడు దయదలిస్తే యింకా ఏమైనా కావచ్చు. ఈ ఆశతోనే అతడు సుబ్బరామయ్యను హైస్కూల్లో చేర్పించాడు. ఆనాటికింకా హైస్కూళ్ళు తామరతంపరగా పల్లెలకు, పేటలకు దిగుమతి కాలేదు. దగ్గరలోవున్న హైస్కూలు జిల్లా ముఖ్య పట్టణంలో వుండేది. సుబ్బరామయ్య ఆ హైస్కూల్లోనే చేరాడు. చేరాడేగానీ అతడు హైస్కూలు చదువును తీరామారా తుదముట్టించలేదు. మధ్యంతరంగా చదువుకు స్వస్తిచెప్పి, యింటికి తిరుగు ముఖం పట్టాడు.

పట్టణంలో గడపిన ఆ అయిదారేళ్ళలోనూ, సుబ్బరామయ్యకు ఉద్యోగుల ప్రపంచాన్ని గురించి మరికొన్ని విషయాలు తెలిసొచ్చాయి.

బడి మామూలుగానే జరిగిపోయింది. అంటే చెప్పటానికి అలవాటు పడిన అయ్యవారు పాఠాలు చెబుతూనే వుంటారు. చెప్పవివాళ్ళు చెప్పనే చెప్పరు. ఉన్న మంచి చెడ్డలన్నిటిలోనూ, నిమ్మళంగా సాగిపోతున్న పాఠశాలలో సంవత్సరానికి కొకసారి ఎక్కడలేని సంచ

లనం బయలుదేరుతుంది. బూజు దులపడం, గోడలకు వెల్ల వేయడం, తాతల కాలంనాటి పాత పటాలను వెలుపలికి తీయడం, రంగు కాగితాలతో తోరణాలు కట్టడం. వారం రోజులపాటు ఒకటే సందడి! పెళ్ళి పడిన పాటు, కుర్చీలో కుషీకి పాట్లు పడడం అదొక విధాయక కృత్యంగా అలవరచుకున్న మేష్టారు సైతం ఆ వారం రోజులపాటు నిలుచునే పాఠం చెబుతారు. ఆలస్యంగా తప్పితే బడికిరావి మేష్టారు అరగంటకు మునుపే కాంపౌండులో కాలుపెడతాడు! ఏమిటో మార్పు? బడి ఎల్లప్పుడూ ఇలాగే జరిగితే ఎంత బాగుండేది.

బడి ఎప్పుడూ ఇలా జరగాలనుకోడమే తప్పు! సంవత్సరాని కొకసారి యిలాంటి చైతన్యం నీటిబుడగలా అంతలో పుట్టి, ఇంతలో చిట్లి పోవడమే ఒప్పు అంటూ తేల్చి చెప్పేవారు అనుభవజ్ఞులు.

ఎందుకంటే—

పై అధికారి ఏడాది పొడుగునా బడిని తనిఖీ చేయడం లేదు!

కానీ బడి సక్రమంగా జరగడం పై అధికారి సంతృప్తి కోసమా? విద్యార్థుల అభివృద్ధి కోసమా?

విద్యార్థుల అభివృద్ధి! అబ్బో. ఉద్ధారకుడు బయల్దేరాడు. బడి క్రమంగా జరిగితే మాత్రం విద్యార్థులందరూ అభివృద్ధిచెంది పోతారన్న నమ్మకమేముంది?

ఏడాదికొకసారి యిలాంటి హంగామా జరిగితే పై అధికారికి సంతృప్తి కలుగుతుంది. సంస్థ బ్రహ్మాండంగా నిర్వహింపబడుతోందన్న కితాబు లభిస్తుంది. ఆ కితాబునొక తక్కెడలోనూ, వెయ్యిమంది విద్యార్థుల అభివృద్ధి నొక తక్కెడలోనూ వుంచి తూచుకుంటే, త్రాసు నిస్సందేహంగా మొదటివైపుకే మొగ్గుతుంది!

తన అంతరంగంలో పై అధికారికి వందన సహస్రాలు సమర్పించు కునేవాడు సుబ్బరామయ్య,

"ఓయీ పై ఉద్యోగీ! భూగోళం ధర్మమన్న యిరుసు చుట్టూ తిరుగుతోందని చెబుతుండే వాళ్ళు పూర్వులు. ఇప్పుడా ధర్మం ఏమైందో తెలియదు. ఇప్పు డీ భూ వలయానికి యిరుసువి నువ్వు. నువ్వు చండశాసనుడివి. నువ్వొకడివి వున్నావు గనుకనే, ఈ పాఠశాలలు, ఈ ఆఫీసులు మొదలైనవి ఈ మాత్రంగానైనా పనిచేస్తున్నాయి? నువ్వు నీ పై ఉద్యోగికి భయపడబట్టేగదా?"—అనుకునేవాడు సుబ్బరామయ్య.

కొందరు క్రింది ఉద్యోగులు పై ఉద్యోగికి అంతగా భయపడరు. కేవలం కర్తవ్య నిష్ఠవల్లనే గట్టెక్కవచ్చు. ననుకుంటారు. అలాంటి వాళ్ళను పై ఉద్యోగి నిర్దాక్షిణ్యంగా అట్టడుగుకు ముంచివేయ జూస్తాడు. మరికొందరు క్రింది ఉద్యోగస్తులు కర్తవ్యాన్ని నట్టేట ముంచి. కేవలం ధూప దీప నైవేద్యాల వల్లనే పై ఉద్యోగిని ప్రసన్నుణ్ణి చేసుకోజూస్తారు. జగన్నాటకంలో వీళ్ళ పాచిక పారకపోలేదు. మానవులందరూ సమాను లనుకోడం కద్దు! ఈ సమానత్వం భగవంతుడు పుష్కలంగా ప్రసాదించిన గాలిని పీల్చుకోడం ఒకదానిలో తప్ప మరెందులోనూ కనిపించదు. పై వారికీ, క్రిందివాడికీ వున్న తేడా పై వాడినెంత కర్కశుణ్ణిగానైనా చేస్తుంది. క్రింది వాడిని ఎంత పనికిమాలిన వాణ్ణిగానైనా చేయగలుగుతుంది.

కానీ, ఈ తేడా ఒకచే కాడలోనుంచి రెండురకాల పువ్వుల్ని పుట్టించ గలదని మాత్రం సుబ్బరామయ్య ఆనా దూహించనైనా లేదు!

* * *

పులి కడుపున పులిపిల్లే పుట్టినట్టుగా, మేక కడుపున మేకపిల్లే పుట్టినట్టుగా సుబ్బరామయ్య కడుపున మూర్తులా సుబ్బరామయ్య లాంటి కుమారుడే పుట్టాడు. ఆ అబ్బాయి బట్టకట్టి బడికి వెళ్ళనేర్చిన కాలానికి కంకిమిట్ట కొకక్రోసెడు దూరంలోనే హైస్కూలు వెలసింది. అందువల్ల చదువులకోసం యింటికి దూరం కావలసిన అవసరం లేకపోయింది. కుర్రవాడు గూడా బుద్ధిగా చదువుకున్నాడేమో, స్కూల్ ఫైనల్‌దాకా రథాన్ని సాఫీగా లాక్కొచ్చేశాడు. అంతవరకు అక్షరాలా ఆ తండ్రికి తగ్గ కొడుకే ననిపించుకుంటూ, తండ్రి గీచిన గీటుపైనే సాగిపోతున్న ఆ కుర్రవాడి బుద్ధి

స్కూలు ఫైనల్ పాస్పై, సర్టిఫికెట్టు చేతికి రాగానే తటాలున 90 డిగ్రీల కోణంతో వక్రించింది. అతగాడు తాను ఉద్యోగం చేయవలసిందే. చేసి తీర వలసిందే నన్నాడు. రైతు కొడుకు రైతే కానవసరం లేదు. అతడు ఉద్యోగం చేయదలచుకుంటే ఈ సర్వ స్వతంత్ర ప్రజారాజ్యంలో అడ్డ గలిగిన దేదీ లేనేలేదన్నాడు, అనడంతో ఎక్కడూరుకున్నాడు? తనకు తానై స్వప్రయోజకత్వం వెలిగించి ఏవేవో ఉద్యోగాలకు దరఖాస్తులు పెట్టుకున్నాడు. అందులో ఒక చోటనుంచీ ప్రత్యుత్తరం గూడా రానేవచ్చింది. ఉన్న సర్టిఫికెట్ల కన్నింటికీ నకళ్ళు తీయించి, స్థాయిలో తాశీల్దారుకు తగ్గని గెజిటడ్ ఆఫీసరు దగ్గర సంతకం చేయించి వారంరోజుల్లో చేరేటట్టుగా అప్లికేషను పంపుకుంటే దరఖాస్తుదారుడికి ఇంటర్వ్యూ తేదీ తెలుపబడుతుందని ఆ ప్రత్యుత్తరం నివేదించింది. లక్ష్మణుడు మూర్ఛ మునిగిన సమయంలో రావలసివచ్చిన సంజీవనిలా, ఇప్పుడు గెజిటడ్ ఆఫీసరుగారి సంతకం కావాలి! ఎక్కడ దొరుకుతుందది? ఎలా దొరుకుతుందది?

కోట కొమ్మలలో తాశీల్దారుగారి ఆచూకీని గురించి తెలియచెప్పడానికిప్పుడు శరభయ్యగారు సజీవులై లేరు.

"ఒరే సుబ్బీ! నేనెన్నడూ ఆఫీసుల వెంట తిరగలేదు, నీ పాట్లేవో నువ్వేపడు. కావలిస్తే అయిదో, పదో యిస్తాను. తీసుకెళ్ళు....." అన్నాడు సుబ్బరామయ్య.

అబ్బాయికి ఉద్యోగమంటే యిష్టమేగానీ, ఉద్యోగులంటే బెదురులేక పోలేదు. ఆ పని ససేమిరా తనవల్లకాదు పొమ్మన్నాడు. కుమారులకు ఉద్యోగాలు సంపాదించి పెట్టే ప్రయత్నంలో అక్కడక్కడా కొందరు తల్లి దండ్రులు, మునుపటికి రావణాసురుడు కైలాసాన్ని పెల్లగించినట్టుగా, ప్రభుత్వాన్నే కదిలించి వేస్తున్న ఉదంతాలను సోదాహరణంగా వివరించాడు.

సుబ్బరామయ్యకు గత్యంతరం లేకపోయింది. అతడు తాశీల్దారుగారి కోసం బయలుదేరక తప్పలేదు.

సుబ్బరామయ్య తన జీవితం పొడుగునా మహదాశ్చర్యకరమైన సంఘటనల నెన్నింటినో చూశాడు. మూతలేని పెట్టె ఒకటి మాటల మూటగా, పాటల పేటికగా పనిచేయడం అతని కెనలేని విస్మయాన్ని కలిగించింది. తెరగుడ్డపైన బొమ్మలాడడం మాత్రమేగాదు. మాటాడడంగూడా అతడు విన్నాడు. కూతవేటు దూరమన్నది ఒక ఫర్లాంగు దూరంనుంచి, యోజనాలకు యోజనాలే అధిగమించడం అతడి జీవితకాలంలోనే జరిగింది. సుబ్బరామయ్య కంతగా ఆశ్చర్యం కలిగించినవాటిలో, కోట కొమ్మల యొక్క పెంపుదలతో కానవచ్చిన పరిణామ క్రమంగూడా ఒకటి. పాతికేళ్ళకు మునుపు ఒక పెద్ద పాళెగాడు వేటకోపం వచ్చి అడవిలో వేసుకున్న నాలుగైదు గుడారాలకు మల్లే ఆ గ్రామంలో చెదరు చెదరుగా కొన్ని యిళ్లు కనిపించేవి. ఒళ్ళు వంచి పని చేయడంవల్లనైతేనేమి, పైవారి కృపా కటాక్షం అవ్వారిగా లభించడంవల్లనైతే నేమి తొందర తొందరగా ప్రమోషన్లు అందుకుని పైమెట్టుకు చేరుకోగలిగిన ఉన్నతోద్యోగిలా కోటకొమ్మల గ్రామం కాలంతో పందెం వేసుకుని పట్టణంగా పరిణమించింది. పంచల స్థానాన్ని ఫ్యాంటు లాక్రమించు కున్నట్టుగా పాతయిండ్ల శిధిలాలపైన అందమైన సిమెంటు మేడలు వెలశాయి. నిగనిగలాడే నున్నటి క్రాపింగులా తారు రోడ్లు ఏర్పడ్డాయి. పెట్టెలు, పట్టె మంచాలు, గవాక్షాలకు గుడ్డలు, గడప దగ్గర గుట్టలాంటి పాదరక్షలు; చలువరాతి బొమ్మలు, చదువబడిన పుస్తకాలు, సుఖాసనాలు, స్థూలకాయాలు మొదలైనవి ఉన్నతోద్యోగి యింటికి హంగులు, పట్టణానికి గూడా దానికి కావలసిన హంగులు దానికి లేకపోలేదు. బంకులు, షాపులు, సినిమాలు, హోటళ్ళు, ఆటమైదానాలు, ఉద్యానవనాలు మొదలైనవన్నీ కోటకొమ్మలలో చోటుచేసుకున్నాయి.

పదిమందిని వాకబుచేసి, పదివీధులు తిరిగిన తర్వాత గానీ సుబ్బరామయ్య తాశీల్దారుగారి యింటిని కనిపెట్టలేక పోయాడు. దొంగలు ఆలీబాబా యింటిని గుర్తుపట్టలేక పోవడానికి కారణమేమిటో పాఠకులకు తెలుసు. అప్పులకని, ఆహారానికని యింకా మరి కొన్నింటికని అద

వంగా కొందరు తాశీల్దారులు ఏర్పడి వుండడంవల్ల అసలు తాశీల్దారుగారి యింటిని వెదకి పట్టుకోడంలో కొంత ఆలస్యమే వాటిల్లింది.

పట్టణంలోని యిండ్లకు వాస్తు శాస్త్రానికి బొత్తిగా సంబంధం వున్నట్టు తోచదు. సంగీతం రానివాళ్ళు పాడడంవల్ల అది దేవతలకు వికృతరూపం వాటిల్లిందని చెప్పనేర్చిన మన పెద్దలు, నగరాలలోని గృహ నిర్మాణంవల్ల వాస్తు పురుషుడు చిత్రహింసలకు గురౌతున్నాడని ఎందుకు చెప్పలేదో మనకు తెలియదు। ముక్కోణాకారంగా ఒక జాగా కనిపించినా సరే, అక్కడొక కట్టడాన్ని లేవదీసే కక్కుర్తి పట్టణాలలోనే కనిపిస్తుంది. సూదిగొంతు, బానకడుపు అన్న సామెతకు రూపకల్పనలాగా తాసిల్దారుగారి యిల్లు వెడల్పు తక్కువ, పొడవెక్కువ. వీధిలో నిల్చున్నవారికి ఆ యింటి తాలూకు వరండా కనిపిస్తుంది. నాలుగడుగుల మేరకు గోడ, దానిపైన యినుప కమ్ముల అల్లిక, మూయబడివున్న రెక్క తలుపులు. ఈ యింటిలో మనుషులనేవాళ్లున్నారా? ఉంటే ఎక్కడున్నారు? ఇంతకూ తాసిల్దారుగారున్నట్టా, లేనట్టా? ఎవరు చెబుతారు?

పది పదిహేను నిమిషాలు వేచిచూచిన తర్వాత సుబ్బరామయ్య ఒక్కింత సాహసానికి పూనుకుని రెక్కతలుపుమీద చెయివేసి చూచాడు. లోపల గడియ పెట్టలేదేమో, తలుపు మెల్లగా తెరచుకుంది. అనుమతి పత్రం లేకుండా విదేశంలో అడుగు పెడుతున్న పరదేశీయుడిలా సుబ్బరామయ్య మెల్లగా లోపల కాలుమోపాడు.

నిశ్చల కాసారంలో సంచలనం చెలరేగడానికి ఒక చిన్న గులక రాయి పడినా చాలు. సుబ్బరామయ్య వరండాలో అడుగుపెట్టిన మరుక్షణంలో గ్రామసింహ గర్జన ఒకటి ఉన్నట్టుండి ఉద్వేగంగా చెలరేగింది. సుబ్బరామయ్య ఒక్క ఉదుటున బయటికి లంఘించేవాడే। కానీ ఆ కుక్క ఓ గొలుసుకు గట్టిగా బంధింపబడి వుండడం అతడి కొక్కింత ధైర్యాన్ని చేకూర్చింది. ఇజ్జూ....జూ....అంటూ అతడొక రకంగా కుక్కను సముదాయించడానికి కూడా ప్రయత్నించాడు. పరాయి వ్యక్తి తన ఎదుటినుండి

విశ్రమించేదాకా ఆ కుక్కనోరు మూసే ధోరణిలో లేదు. ఒరులసాయం లేకుండా కుక్కలను వూరుకోబెట్టడ మెలాగో సుబ్బరామయ్యకు తెలియదు.

ఆ అపత్సమయంలో, టైగర్, అంటూ ఓ అదలింపు వినిపించడ మేమిటి, టైగర్ నోటికి తాళం పడట మేమిటి రెండూ ఒక్కసారే జరిగాయి. వరండాలో ఓ మూలగా వేయబడివున్న వాలు కుర్చీపైన పది పన్నెండేళ్ళ కుర్రవాడొకడు పవ్వళించి వున్నా డన్న విషయంగూడా సుబ్బరామయ్య కప్పుడే తెలిసింది....

"తాసిల్దారుగా రున్నారా బాబూ?" సుబ్బరామయ్య వీలైనంత వినయంగానే ప్రశ్నించాడు.

"అప్పుడే తెల్లవారిందా?" అంటూ ఆ ప్రశ్నకు ప్రత్యుత్తరంగా యింకొక ప్రశ్న వెలువడింది.

సుబ్బరామయ్య విస్తుపోయాడు. గంట ఎనిమిది కావస్తున్నది. ఇంకా తెల్లవారక పోవడ మేమిటి? తొలి కోడి కూయగానే తెల్లవారిం దనుకోడం పల్లెల్లో సాంప్రదాయం. ఇక్కడెన్ని గంటలకు తెల్లవారుతుందో తనకు తెలియదు.

ఐనా ఆ అనవసరమైన గొడవ తనకెందు కన్నట్టుగా సుబ్బరామయ్య మళ్ళీ అసలు విషయంలోకే వచ్చాడు. "తాసిల్దారుగారితో కాస్త పనుండి వచ్చాను. ఆయన్నొకసారి కలుసుకోవాలి...."

"అందుకు నా పర్మిషన్ దేనికి?"

"పర్మిషన్‌కాదు. తాసిల్దారుగారు యింట్లో వుంటే కలుసుకోవచ్చునని...."

"అవును మరి. ఇంట్లోవుంటే కలుసుకోవచ్చు. లేకుంటే కలుసుకోవడం సాధ్యంకాదు. అన్ని విషయాలూ మీకు తెలిసేవున్నాయి, మరైతే పన్నడగడ మెందుకూ?"

"అదికాదు బాబూ!"

"ఏది కాదు?"

సుబ్బరామయ్య నిరుత్తరుడై పోయాడు. వివాదపరిష్కారం కోసం ప్రపంచ రాజ్యాలు కొన్ని చర్చలు జరుపుకోవడం కద్దు. ఏ ప్రాతిపదికపైన ఆ చర్చలు జరగాలన్నది మొట్టమొదటి సమస్య. ప్రాతిపదిక మాట దేవుడెరుగు. వివాదం పరిష్కారం కావాలన్న సదుద్దేశం ఉభయ వర్గాలలో ఏ ఒక్కదానికి లేకపోయినా చర్చలొక ప్రహసనంగా పరిణమించడం సంభవమే! కుర్రవాడితో సుబ్బరామయ్య సంభాషణ అంతకంటే మెరుగ్గా లేదు.

పది నిమిషాలవరకూ సుబ్బరామయ్య మౌనంగా వుండిపోయాడు. తాసిల్దారుగారు లోపలవున్న పోలికువలేవీ కానరావడంలేదు. మౌనవ్రతాన్ని పాటిస్తూ నిలువుకాళ్ళశిక్ష అనుభవిస్తూ తానెంతకాలం యిలా తాసిల్దారుగారింటి వసారాలో గడపవలసి వున్నదో అతనికి బోధపడలేదు. 'ధైర్యే సాహసే లక్ష్మి' అన్నారు పెద్దలు. మళ్ళీ ఒకసారి ఆ కుర్రవాణ్ణి కదిపి చూడదలచుకున్నాడు సుబ్బరామయ్య.

"చూడు బాబూ! ఒక విషయం తెలిస్తే చాలు నాకు. అయ్యగారు యింట్లోవున్నట్టులేరు. ఆయన ఎప్పుడు వస్తాడో తెలిస్తే వెళ్ళిపోతాను...."

చదువుతున్న పుస్తకాన్ని టేబిలుపైకి విసరి ఆ కుర్రవాడు సుబ్బరామయ్య వైపొకసారి తీక్ష్ణంగా చూచాడు—"ఆయ నెప్పుడొస్తారో నాకేం తెలుసు? గంటల్ని తెలిపే గడియారంలా నేను తాసిల్దారుగారి రాకపోకల్ని తెలిపే యంత్రాన్ని గాను...."

సుబ్బరామయ్య ముఖాన ప్రత్యేకంగా చింతపీళ్ళు చల్లవలసిన అవసరం లేకపోయింది! అచట పుట్టిన చిగురు కొమ్మయిన చేవ, అంటూ ఒక పద్యాన్ని ఎక్కడో చదివినట్టు జ్ఞాపకం! బహుశా ఆ మాటను యిలాంటి వాళ్ళను గురించే అన్నారేమో! ఇంతకూ ఒకరినని ఏం లాభం? పల్లెలో తానాకుర్రకుంకను చదివించకుండా పొలందారి పట్టించి వుంటే యిలా నామర్దాపాలు కావలసివచ్చేదిగాదు.

కత్తివేటుకు నెత్తురుచుక్క లేని ముఖంతో సుబ్బరామయ్య వెలుపలికి వచ్చాడు. మతిచెడిన వాడిలా బజార్ల వెంట తిరిగాడు. ఎండకు మగటిమి హెచ్చి, గంట పదిన్నర కావస్తుండగా సుబ్బరామయ్యకొక విషయం జ్ఞప్తికి వచ్చింది. ఉదయం ఆరింటికల్లా సూర్యుడు పూర్వాద్రి శిఖరాల పొడసూపినట్టుగా పది గంట లయ్యేసరికి ఉద్యోగు లందరూ ఆఫీసుకు చేరుకోక పోరు. తాసిల్దారుగారిని సంధించడాని కదే సజావైన పద్ధతి....

సుబ్బరామయ్య వెళ్ళేసరికి తాలూకాఫీసు ప్రాంగణం జనంతో కిట కిటలాడి పోతోంది. అప్పుడప్పుడే గుమస్తాలు కుర్చీలలోకి సర్దుకుంటు న్నారు. వసారాలో తనకు తారసిల్లిన మొదటి బంట్రోతునే అడిగి చూచాడు సుబ్బరామయ్య—"బాబ్బాబూ! తాసిల్దారుగారిని కలుసుకోవడాని కెప్పుడు వీలవుతుందో తెలుసుకోవాలి. ఆయనతో కాస్త పనుండి వచ్చాను" అన్నాడు.

పల్లెటూరి వాలకాలతో వ్యవహరింపవలసి వచ్చేసరికి బంట్రోతులే గెజటడ్ ఆఫీసర్లు. సుబ్బరామయ్య వైపొకసారి ఎగా దిగా చూశాడు జవాను—"ఆ కాడికి నువ్వొక్కడివే పనులున్నవాడివి. ఇక్కడ తాసీల్దారు గారికిగానీ, నాకు గానీ పనులు లేవనుకుంటున్నా వేమిటి?"

"అబ్బే, నే నామాట అనలేదు!" బిక్కమొగం పెట్టాడు సుబ్బ రామయ్య.

"ఐతే, నా మామూలు నా కిలా పడేయ్...."

మారుమాట లేకుండా ముడుపు చెల్లించుకున్నాడు సుబ్బరామయ్య.

వివరాలు వెల్లడింపబడ్డాయి—

తాసిల్దారుగారు ఊరిలో లేరు. క్యాంపుకు వెళ్ళారు. సాయం కాలానికి తిరిగి రాగలరు. బడలికతో వుంటారు గనుక అప్పటికప్పుడు ఆయనను సందర్శిస్తే పని సానుకూలం గాకపోవచ్చు. రాత్రి భోజనా నంతరం ఆయన కెవరితోనైనా కాసేపు బాతాఖానీ వేయాలని వుంటుంది.

భోజనం చేసి వచ్చి నింపాదిగా తాంబూలం వేవిస్తూ ఆయన వరాండాలో కూర్చుంటారు. ఆయనను కలుసుకోవడానికదే అనువైన సమయం.

సుబ్బరామయ్య మళ్ళీ రోడ్డుపై కెక్కాడు. కనిపించిన హోటల్లోకి వెళ్ళి నాలుగు మెతుకులు నోట్లో వేసుకుని తిన్న శాస్త్రం ముగించాడు. ప్రొద్దు పోయేటంతవరకూ పుర వీధుల్ని సర్వేచేశాడు. గళ్ళతో నిండిన వినీల వసనాలను వ్రేలాడదీసినట్లుగా, చిరుచీకట్లు ముసురుకోసాగాయి. సుబ్బరామయ్య కాళ్ళు అతడి నొకచోట నిలువనీయడం లేదు. అవి అప్రయత్నంగా అతణ్ణి తాసిల్దారుగారు నివసిస్తున్న వీధిలోకే తీసుకుని వెళ్ళాయి. హఠాత్తుగా ఒకచోట నిల్చుని ముందు వెనుకలు చూచుకునేసరికి అతడు తాసిల్దారుగారి యింటి ఎదుటనే వున్నాడు.

సూదితో పొడిచినట్లుగా సుబ్బరామయ్య కప్పుడో విషయం జ్ఞప్తికి వచ్చింది. ఉదయం కనిపించిన ఆ కుర్రవాడు. ఆ తర్క విద్యా కుశలుడు, ఆ బాల మేధావి మళ్ళీ వరాండాలో కనిపిస్తే అతనితో మాట్లాడడం తన చేతగాదు. భగవంతుడి అనుగ్రహంవల్ల అతగా డక్కడ లేకుంటే చాలు, అదే పదివేలు!

తచ్చాడుతూ, తారుతూ, వీధి గుమ్మంలోకి వెళ్ళి లోపలికి తొంగి చూచాడు సుబ్బరామయ్య.

"ఎవరండీ? ఏం కావాలి?"

సౌజన్యం పుట్టిపడుతున్న కంఠస్వరం. గగనంనుండి భూపతనమై పోతున్నవాడికి అంతర్మధ్యంలో ఒక పూల సెజ్జ దొరికినట్టున్న పలకరింపు. ఆ మాటలు నిజంగానే తనకు వినిపించినట్లుగా తానొక భ్రమాప్రమాదానికి లోనయ్యాడా!

సుబ్బరామయ్య నలా పలకరించిన వ్యక్తికి పాతికేళ్ళుంటాయి. ఆ యువకుడు వాలుకుర్చీలో కూర్చుని వార్తాపత్రిక చదువుకుంటున్నాడు....

"నిలబడిపోయారెందుకు? అదిగో, బెంచిపైన కూచోండి...."

"అయ్యగా రున్నారా బాబూ!"

"ఏవో కాగితాలు చూచుకుంటున్నారు, ఆ పని కాగానే కలుసు కుందురు గానీ, అలా కూచోండి..."

పది నిమిషాల్లో అతడు పత్రిక చూడడం పూర్తి గావచ్చింది. కళ్ళ జోడు సర్దుకుంటూ అతడు ప్రశ్నించాడు—

"ఆఫీసులో కలుసులేకపోయారా?"

"వెళ్ళాను. క్యాంపు వెళ్ళారని తెలిపింది. ఉదయం యిక్కడికే వచ్చాను. అప్పుడింట్లో లేరు..."

"ఏ వూరునుంచి వచ్చారు?"

"మాది కంకిమిట్ట, అబ్బాయి స్కూల్ ఫైనల్ ప్యాసయ్యాడు, ఏదో ఉద్యోగం కోసం అప్లికేషన్ పెట్టాడు. గెజటడ్ ఆఫీసరుగారి సంతకం కావాల్సి వచ్చింది...."

"కంకిమిట్ట అన్నారు గదూ! మీ అబ్బాయి బహుశా తాళ్ళపూడి హైస్కూల్లో చదువుకుని వుంటాడు. మార్కులెలా వచ్చాయి?"

"నాలుగు వందలకు పదో పదిహేను తక్కువ."

"కాలేజికి పంపలేక పోయారా?"

"అబ్బో, ఏమగుకు ఆహారం అందించగలమా బాబూ! పెద్దకొండ లకు సన్నలు వేయదలచుకోలేదు. ఎవడి కెంత ప్రాప్తమో అంతే దక్కాలి మరి!"

"అది చాలా పాత సిద్ధాంతం! ఎవడికేది అవసరమో వాడి కది దక్కాలి. ఎవడికెంత అవసరమో వాడి కంత దక్కాలి. చదువుకోగలిగిన వాడికి అవకాశాలు లేవు. చదువుపైన బొత్తిగా ధ్యాసలేని వాడికి అవకాశాలు దండిగా వున్నాయి. ఎలా వుందంటారు! అజీర్ణ రోగికి విందు భోజనాలున్నూ ఆకలిగొన్నవాడికి ఉపవాసాలా?"

"ఇదిగో శంకరం! ఎవరితో మాట్లాడుతున్నావు?"

శంకరం లేచివెళ్ళి కిటికీలోనుంచి లోపలికి చూస్తూ "మీ కోసం ఎవరో వచ్చారండీ నాన్నగారు! సంతకం కావాలిట!" అన్నాడు.

"నా కిక్కడ బోలెడన్ని కాగితాలున్నాయి మరి."

"గంట ఎనిమిది దాటితే ఈ వూరి హోటళ్ళలో భోజనా లుంటాయటండి నాన్నగారూ! ఉసూరుమంటూ పస్తుపడుకోవలసిందే!"

"అవునవును. ఆమాటా నిజమే! ఎవరతను? లోపలికి రమ్మను...."

ఎదుటనున్న కాగితాలను అవ్వలికి తోసి, తాసిల్దారుగారు బేటీ యివ్వడానికి సిద్ధంగా కూర్చున్నారు. సుబ్బరామయ్య గూడా గదిలోపలికి వెళ్ళాడు. శంకరం గుమ్మంలోకి వచ్చి వీధి వైపు చూడసాగాడు.

కొన్ని నిమిషాలు నిశ్శబ్దంగా గడచిపోయాయి.

అలాంటి సందర్భాల్లో తాసిల్దారుగారు అడగవలసిన ప్రశ్నలు చాలా వున్నాయి. ఎవరు నువ్వు? ఏ వూరు? వి. యం. సర్టిఫికెట్టు ఎక్కడ? రివెన్యూ యిన్స్పెక్టరు రుజువు పరిచాడా?—అలాంటి ప్రశ్న లేవీ శంకరానికి వినిపించలేదు. నాన్నగారేం చేస్తున్నట్టు!

శంకరం మళ్ళీ కిటికి దగ్గరికి వెళ్ళాడు.

తాసిల్దారుగారు సుబ్బరామయ్యవైపు చూస్తున్నారు. సుబ్బరామయ్య తాసిల్దారుగారివైపు చూస్తున్నాడు. ఇద్దరి ముఖాలలోనూ తొలినాటి జ్ఞాపకాల కోసం గింజుకుంటున్న సూచనలు కానవస్తున్నాయి. ఆఖరుకు తాసిల్దారుగారే జయించారు.

"నువ్వటోయ్ సుబ్బరామయ్యా! ఎంతగా మారిపోయావ్. ఏం కథ! అన్నట్టు ఈ తాలూకాలోనేనా మీ వూరు?"

సుబ్బరామయ్య కుర్చీ స్వీకరించడాని కింకా జంకుతూనే వున్నాడు—

"గుర్తురావడంలేదా నేమ! నీవెనక దస్కంలో కూర్చునేవాణ్ణి. వెంకటేశ్వరరావుని! హిస్టరీ మేష్టరుగారిని గిరీశం అనేవాళ్ళుగదూ! ఆయనకు ప్రియశిష్యుడినైనందున నన్ను వెంకటేశం అంటుండేవాళ్ళు. అందుకు తగ్గట్టుగా కొన్ని దుడుకుపనులు గూడా చేస్తుండేవాడిని. ఒకటి రెండుసార్లు పిరావల్లి నీ చొక్కాగూడా ఖరాబుచేసినట్టు జ్ఞాపకం... చూచావా శంకరం ....నాకు హైస్కూలు జీవితంనాటి స్నేహితులెవరూ లేరని చెబుతూండే వాడిని. సుబ్బరామయ్య స్వయంగా విచ్చేశాడు....ఎందరోయీ బిడ్డలు?"

"ఇద్దరు మగబిడ్డలు. ఇద్దరాడ బిడ్డలు...."

"బాగానేవుంది. పడవకు ఒడిదుడుకులు లేవన్నమాట! చాలాకాలానికి కలుసుకున్నాం. ఇప్పుడు వెళ్ళాలన్నా నీకు బస్సులు లేవు. ఈ రోజంతా నా కోసం వేచి వుండడంతోనే సరిపోయింది గనుక ఈ పూట నీ కిక్కడే భోజనం!....పీటలు వేయమంటావా శంకరం!"

సుబ్బరామయ్య యిరకాటంలో పడ్డాడు. హైస్కూల్లో చదువుకున్న రోజుల్లో యితణ్ణి 'ఒరేయ్' అని పిలిచేపాటి చనువు తనకుండేది. ఇప్పుడు ఏకవచనంతో సంబోధించడానికైనా మనసొప్పడంలేదు. ఇక్కడి నుంచి వీలైనంత త్వరగా బయటపడితే బాగుండును! కానీ. యితడు భోజనానికి వుండి పొమ్మంటున్నాడు? హోదాలో గొప్పవాడు. బాల్య స్నేహాన్ని పాటించి ఆతిధ్యం యివ్వదలచుకుంటున్నాడు. వద్దనడం ఏం బాగుంటుంది?

భోజనాలు కొనసాగుతుండగా తాసిల్దారుగారు తమ సంతానాన్ని మిత్రుడికి పరిచయం చేయసాగారు, "శంకరాన్ని చూచావుగా సుబ్బ రామయ్యా! వాడే పెద్దవాడు. బి కాం. ప్యాసై స్టేట్ బ్యాంకులో పనిచేస్తు న్నాడు. వీడి తరవాత యిద్దరాడపిల్లలు, పెద్దమ్మాయి పెళ్ళయింది. రెండో అమ్మాయి హాస్టల్లో వుంటూ కాలేజీలో చదువుకుంటోంది. అదిగో వాడే చిన్నబ్బాయి. చిట్టిబాబు!"

హాల్లోనుంచి వరండావైపు వెళుతున్న చిట్టిబాబు ద్వారం దగ్గర ఆగి సుబ్బరామయ్యవైపు కొరకొర చూడసాగాడు—

"ఆ అబ్బాయిగారిని యిదివరకే చూచాను. ఉదయం ఒకసారి యిక్కడికి వచ్చానుగదూ! అప్పుడు కనిపించాడు."

"నేను వూళ్ళో వున్నదీ, లేనిదీ చెప్పలేదన్నమాట!"

"ఇన్, అవుట్ అంటూ అక్కడొక బోర్డుండగా ప్రత్యేకంగా నేను చెప్పడం దేనికి నాన్నా!"

"అదీ పాయింటే! కాదంటావా సుబ్బరామయ్యా!"

"ప్రేలెడంత వున్నాడో లేదో. తల బిరుసుతనం మాత్రం బోలెడు ...." పుస్తకం చేతబట్టుకుని మీద మెట్లెక్కుతున్న శంకరం తమ్ముడివైపు చురచుర చూచాడు. అన్నదమ్ములిద్దరూ ఒక్కటే సారిగా రంగం నుంచీ తప్పుకున్నారు.

"పసితనం గదండీ మరి ...." సుబ్బరామయ్య సర్దిచెప్పచూచాడు.

"అబ్బే. అదికాదులేవోయ్ సుబ్బరామయ్యా!"

"ఏదికాదు?" సుబ్బరామయ్య తల పైకెత్తి సాభిప్రాయంగా తాసిల్దారుగారి వైపు చూడసాగాడు. ఎంతకూ వివరణ లభించకపోయేసరికి మళ్ళీ అతడే ఉపక్రమించాడు—

"ఈ చిట్టిబాబు ఆ శంకరానికి తమ్ముడుగావడమే విచిత్రం!"

తాసిల్దారుగారూ అటూ ఇటూ కలయజూసి మరెవ్వరూ వినడంలేదన్న నిర్ధారణకు వచ్చినట్టుగా "నీకో రహస్యం చెప్పనా సుబ్బరామయ్యా" అన్నాడు.

"అంత కంటేనా!"

"శంకరం పుట్టిననాటికి నేను గుమాస్తాని! ఓ చిన్న పెంకుటింట్లో నివసిస్తుండేవాణ్ణి. కూరానారా తెచ్చుకోవాలంటే స్వయంగా సంచీ చేత పట్టుకొని మార్కెట్టుకు వెళ్ళి వచ్చేవాడిని. ఒక్క మా ఆవిడ పైనతప్పా

ప్రపంచంలో మరెక్కడా నా అధికారం సాగేదికాదు. శంకరం ఓ గుమాస్తా కడుపున పుట్టాడు. పది పన్నెండేళ్ళ వరకూ యించుమించుగా అదే వాతావరణంలో పెరిగాడు.''

ఆశ్చర్యంతో వింటున్నాడు సుబ్బారామయ్య.

''చిట్టిబాబు సంగతలా కాదు. వీడు బుడిబుడి నడకలు నేర్చుకునే సరికి నేను తాసిల్దారునై పోయాను....''

''మజ్జిగ వేసుకున్నారా'' అంటూ హాల్లోకి వచ్చిన ఆ యింటి యిల్లాలు నోరు తెరచుకొని విగ్రహంలా కూర్చున్న సుబ్బరామయ్య వాలకాన్ని చూచి విస్తుపోయింది.



# స్వస్థానం

పల్లె, పేట,బస్తి. పట్నం, నగరం అంటూ కొన్నిపదాలు వాడుకలోవున్నాయి సరే: ఏది పల్లె: ఏది పేట: బస్తీ అంటే ఎలాంటిది: దేన్నిపట్నం అనాలి? ఎలాంటి పట్నం నగరంగా పేర్కొనబడుతుంది? అన్న విషయాల పైన స్పష్టంగా నిర్వచనాలు జరిగినట్టు లేదు. ఇందుపైన ఎవడి వూహ వాడికి ప్రమాణంగా వున్నట్టు తోస్తుంది. నా ఊహపారినంతలో నరహరిపేట నిజంగా పేటగాదు. దాన్ని చిన్న బస్తీ అనవచ్చు. ఊరి నడుమపెద్ద రోడ్డు ఒకటి పరుగిడుతుంది. ఆ రోడ్డుకు సమాంతరంగా తూర్పుదిక్కున రైల్వే స్టేషను కానవస్తుంది. స్టేషను కటువైపున వున్నవన్నీ రైల్వే సిబ్బంది తాలూకు నివాసగృహాలు. అందువల్ల నరహరిపేట వ్యాపించి వుండడమంతా రోడ్డుకు పడమటి వైపున్నే: ఆ వూరి నింత బాగా సర్వేచేసే అవసరం నా కేమి వచ్చిందని ఎవరికైనా సందేహం కలగవచ్చు బాబూ: ఆ మాటే చెబుతున్నాను. వాడలుగా, వీధులుగా, సందులుగా, గొందులుగా ఒక చదరపు కిలోమీటరు పర్యంతం విస్తరిల్లి వున్న నరహరిపేటలో అప్పుడు నేనొక అద్దె యింటి కోసం అన్వేషిస్తూ నాతంటాలు నేను పడుతున్నాను.

ఆఫీసు పని ముగిసిన సాయంకాలాల్లో నేను సాగించిన అన్వేషణకు ఫలితంగా 'అద్దె యిల్లు' అన్న విషయంపైన ఒక 'తీసీస్' వ్రాయడానికి కావలసినంత సరంజామా నాకు లభించింది.

ఒకటి; ఖాళీ యిళ్ళన్నీ అద్దె కివ్వబడవు.

రెండు; అద్దె కివ్వబడే ఖాళీ యిళ్ళన్నీ నివాసయోగ్యాలు గావు.

మూడు: నివాసయోగ్యమై వుండి అద్దెకివ్వబడే ప్రతీ ఖాళీయిల్లూ అద్దె రేటు దృష్ట్యా మన కందుబాటులో వుంటుందన్న నమ్మకంలేదు.

నా నెలజీతం రెండువందల యాభై రూపాయలు. నేనిచ్చుకోగలిగిన యింటి అద్దె అందులో పదోవంతు. కాదంటే అవసరాన్ని బట్టి ఇంకొక అయిదు రూపాయలు ఎక్కువ.

ఈ హద్దుకు కట్టుబడినట్టుగా నరహరిపేటలో నా దృష్టికొచ్చినవి రెండంటే రెండే యిళ్ళు.

పరిశీలన మాత్రమే మనవంతు! ఎన్నిక చేయవలసిన వ్యక్తిని నేను కాను. ఆ వ్యక్తి పేరు నీరజ. ఎవరో కాదు లెండి. సాక్షాత్తుగా మా యింటావిడ!

కానుపుకోసం పుట్టింటికి వెళ్ళివున్న మా ఆవిడకు నా అభిప్రాయాల సారాంశాన్ని ఎంతో సిన్సియర్‌గా ఒక నివేదన రూపంలో సబ్‌మిట్ చేశాను.

"ప్రియమైన నీరజకు శుభాశీస్సులు!

నేనిక్కడ-అదే, నరహరిపేటలో యిప్పటివరకూ క్షేమంగా వున్నాను. ఇక్కడి భీమా భోజనశాలలో యింకొక వారం రోజులు వరుసగా భోజనం చేసినట్టయితే నేను క్షేమంగా వుండగలనన్న నమ్మకంలేదు. నెల రోజుల పాటు భీమాభోజనశాలలో భోజనం చేయదలచుకున్న వారు ముందుగా తమ జీవితాన్ని భీమా చేసిన తరువాతగానీ అలాంటి సాహసానికి పూనుకోరట! చూచావా, అదీ విషయం!

అందువల్ల నువ్వు నీ పుట్టింటి పారడైజ్ నుంచి ఈ నరహరిపేటకు రాకతప్పదు. జననియు, జన్మభూమియూ స్వర్గముకన్నా ఎంతగా ఎక్కువే అయినప్పటికీ, మొగుడన్నవాడు సైతం పూర్తిగా నిరాదరణీయుడు కాడు గదా! (వాట్ ఎ పిటీ మై కంట్రీ వుమెన్!)

నువ్వు. నేను, మన చిరంజీవు లిద్దరు వెరశి మన నలుగురికి కావలసిన వసుపాయాలను నీగాలో పెట్టుకొని అప్రమత్తుడినై నేను అద్దె యిళ్ళవేట కొనసాగించాను. ఈ ప్రయత్నంలో కృతకృత్యుణ్ణి కాగలిగానని తెలుపుకో డానికి ఎంతో ఆనందిస్తున్నాను.

నేను వెదికి పట్టిన రెండు యిళ్ళల్లోనూ నీ అభిరుచులకు ఏది వచ్చు తుందో నాకు తెలియకుండా వుంది.

ఈ రెండు యిళ్లూ ఒకదాని కొకటి అరమైలు దూరంలో వున్నాయి. పరిసరాల్ని బట్టి, పరిస్థితులను బట్టి ఈ రెండు యిళ్ళకున్న అంతరం అంత కంటే విస్తృతమైనది. ఏలాగంటావా, అవధరించు.

ఒక యిల్లు ఊరికి దక్షిణపు వైపు కొసలో వుంది. ఆ వాడ పేరు అశోకపురం. పేరు పెట్టడంలోని సదుద్దేశం యింకా కార్యాచరణలోకి వచ్చి నట్టు లేదు. అందువల్ల అక్కడున్న యిళ్ళన్నీ గూడుగట్టుకొన్న శోకంలాగే కనిపిస్తాయి. ఉప్పుతిని రాలిపోతున్న మట్టి గోడలతో, తాటిమట్టల పై కప్పుతో అశోకపురానికి పెట్టని ప్రాకారంలా పరివేష్టించి వున్న గుడిసెల నడుమ కొన్ని పెంకుటిళ్ళు వున్నాయి. ఆ యిళ్ళల్లో ఒకటి యిప్పుడు ఖాళీగా వుంది. దొడ్డి తలుపు తెరిచి అవతలికి తొంగి చూచావంటే నేల యీని నట్టుగా ఒక వంద గుడిసెలు కనిపిస్తాయి. తమ రోళ్ళతో, తమ కుక్కలతో, తమ బిడ్డ పాపలతో అనాధులైన ఏనాది వాళ్ళెవరో ఆ గుడిసెల్లో నివసిస్తారు. అక్కడ నిల్చోలేక వీధి గుమ్మంలోకి వచ్చి నిల్చుంటా వనుకో. అక్కడ కనిపించే వైనా ఏ మంత ఉల్లాసకరమైన దృశ్యాలు గావు. నువ్వెప్పుడూ ఉతికిన బట్టలే కట్టుకుంటావు. శుభ్రంగా తల దువ్వుకుంటావు. ముచ్చటగా బొట్టు పెట్టుకుంటావు! శరీరాలంకరణ విషయంలో ఈ వీధి ఆడవాళ్ళకు నీ కున్నంత ఓపరికం వున్నట్టులేదు. వీళ్ల ప్రొద్దస్తమానం ఏదో ఒక పని చేయడమే చేయడం! ఎందుకు బ్రతుకుతున్నారో బ్రతకడమే బ్రతకడం!

పోగా నేను చెప్పిన రెండో యిల్లుంది చూచావా నీరజా. అది బజారు కవతల పూలంగి తేరు వీధిలోవుంది. పేరుకు తగ్గట్టుగా అక్కడి యిళ్ళన్నీ పూలంగితేరులా వుండడం ఆ వీధి ప్రత్యేకత. కొయ్య ముక్కనేది కంటికి కనిపించకుండా సిమెంటుతో కట్టిన కట్టడాలు. చుట్టూరా పచ్చటి పూలమొక్కలు, ప్రాణాలకు హాయిగొలిపే గృహాంతర్భాగాలు. ద్వారం

దాటుకోగానే పాదానికి మెత్తగా తగిలే తివాచీ. కూచోడంలోని సుఖాన్ని ఎరుగుదువా అంటూ ప్రశ్నించేటట్టున్న సోఫాసెట్లు. గాజు కుండీల్లో తాజా పువ్వులు. సన్నగా వినవచ్చే రేడియో సంగీతం. ఇన్నిమాట లెందుకు? మన బోటి వాళ్ళం గనక లోపలికి వెళ్తే ఉన్నట్టుండి వేరొక లోకానికి వచ్చేశామేమోనన్న భ్రమకలగక మానదు. ఇంతలో ద్వారబంధానికి వ్రేలాడుతున్న తెర ఎద్దైనా ప్రక్కకు తొలిగి, అతివ ఆకారం ఒకటి ఈవలికి కనిపిస్తే నువ్వు నమ్ముతావో నమ్మవోగానీ నీరజా. మన కళ్లు జిగేల్ మనే వెల్తురు తాకిడికి రెపరెపలాడక తప్పదు. ఆ అతివ ముఖం రాకేందు బింబంలా వుంటుందని నేను చెప్పడం లేదు. (ఉండవచ్చు ఉండకపోవచ్చు) ఆవిడ చెవులు శ్రీకారసన్నిభాలని నేను చెప్పను. (అవునోకాదో తెలిస్తే గదా చెప్పడానికి!) కంఠం శంఖంలా వుంటుందని నిక్కచ్చిగా చెప్పలేను. ఇంతకూ నేనిక్కడ చెప్పదలచింది. చెప్పవలసింది ఆ కనిపించే కాంతామణి శరీర లక్షణాలను గురించి కాదు. ఆమె ఒంటిని ఆశ్రయించుకున్న ఆభరణాలను గురించి! కమ్మలా కర్ణకుండలాలా, నెక్లెసులా, చంద్రహారాలా, ఒంకీలా, ఒడ్డాణాలా, రత్నకంకణాలా, రవ్వలు పొదిగిన ఉంగరాలా, ఎలా చెప్పను! ఎన్నని చెప్పను! పేరుపేరునా అన్నింటి పేర్లూ చెప్పడానికి నేనేమైనా నగలకొట్లో కాటలాగులు కంఠోపాఠం చేశానా! ఐదేండ్ల సాంసారిక జీవనంలో కట్టుకున్న పెళ్ళానికి పట్టుమని పదికాసులతో ఒక నగచేసి పెట్టలేని నేనెంత, నా పరిజ్ఞాన మెంత? ఇంతకూ చెప్పొచ్చేదేమంటే యిలాంటి అసూర్యం పశ్యలకు ఆలవాలమైన పూలంగి తేరు వీధిలో వసంత నిలయం అంటూ ఒక సౌధం వుంది. ఆ సౌధం తాలూకు అవుట్ హవుసే నేను మన కోసం చూచిన రెండో యిల్లు. 'చూడ చూడ వేడుక' అన్నమాట నువ్వెప్పుడైనా విన్నావా నీరజా! ఆ మాట ఈ అవుట్ హవుసుకు వర్తిస్తుంది. ఒక చివర చిన్న స్టోరు రూము. మధ్యలో హాలు. మూడో గదిలో సగం వంటకు, సగం స్నానానికి రెండు భాగాలు. ఇనప్పెట్టెలోనైనా మనకంతటి భద్రత లభించదు. పెరటికోసం యిల్లు దాటనక్కరలేదు. వీధిలో జరిగే రణగొణ ధ్వనులు నీ చెవిలో పడవు. వెన్నెలొస్తే చక్కా ఆరు బయట పడుకోవచ్చు. చలి కాలమైతే తలుపులు బిడాయించుకోవచ్చు. ఎండా కాలపు రాత్రుల్లో

నై తే మిద్దెపైకి వెళ్ళిపోవచ్చు. హేమంత రాత్రుల సంగతి సరేసరి! సర్వ కాల సర్వావస్థలకు అనువైన ఈ దివ్యోప మందిరం బహుశా మనకోసమనే నిర్మించబడి వుండాలి. నా కలా అనిపించిది మరి! చూచావంటే నీకైనా అలా అనిపించకపోదు.

సవిలో పనిగా నేను చూచిన మొదటి యింటిని గురించి యిక్కడ మరి కొన్ని సంగతులు చెప్పేయడం మంచిది. ఇప్పు డశోకపురమనే ఈ వాడ నెలకొని వున్నచోటు పూర్వం ఒక చెరువు కడుపై వుంటుందని నా అను మానం. గోడల్లోనుంచి గూడా చెమ్మ తొంగి చూస్తూవుంటే యిక నేలపైన పడుకునే ఆశ ఎక్కడిది? తలుపు తెరిచి లోపలికి చూసేసరికి పైకప్పు తాలూకు పెంకులు కొన్ని క్రిందనేల పైన కనిపించాయి. ఇది కప్పులో స్థిర నివాసం చేస్తున్న మూషిక రాజాల పనట! ఇంటి యజమాని చెప్పాడు. ఏమో ఎవరు చూచారు' ఆ పెంకుల్లో అంతకంటే అపాయకరమైన ప్రాణులు కాపురం చేయడం లేదన్న గ్యారంటీ ఏముంది? ఈ ఉపద్రవాల కన్నింటికీ తల మానికంగా అశోకపురంలో దొంగల భయం హెచ్చట! నిజమే కాబోలు ననిపించింది. ఎందుకంటావా? ఈ వాడలో ఒక వ్యక్తి ముఖం చూచి ఇతడు లేదా ఈమె దొంగ కాదని చెప్పగలమా? సాధ్యంకాదు. నేను క్యాంపుకు వెళ్ళినా, మా ఆఫీసులో ఇన్‌స్పెక్షను జరుగుతున్నా ఒంటరిగా యింట్లో వుండవలసిన దానివాయె! ఆలోచించు.

ఇప్పుడిక నేను నీ అభిప్రాయం కోసం వేచివుంటాను. ప్రత్యుత్తరం రాగానే నీవు కోరుతున్న యింట్లో మన కాపురం సర్దుబాటుచేసి నీ రాక కోసం నిరీక్షిస్తూ వుంటాను.

ఉందునా మరి...."

ఏమాట కామాటే చెప్పుకోవాలి. మాటకు మాట బదులివ్వడంలో ఎంతటి దిట్టో. ఉత్తరానికి బదులు వ్రాయడంలోనూ అంతే ప్రాంప్టుమా నీరజ! ప్రత్యుత్తరమైతే నాలుగురోజుల్లోనే వచ్చింది. కాని అది నే నాశించిన జవాబు గాదు. ఒకటే ప్రశ్నకు నాలుగు జవాబులు సరఫరా చేసి అందులో ఒక్కటి మాత్రం ఎన్నిక చేయమనే పరీక్షా విధానం ఒకటుందని తను తెరుగుదురు

గదా! నా ప్రశ్నకు నేనిచ్చిన జవాబులు తెండే! అందులో ఒకటి మాత్రమే కరెక్టని నా అంతట నేను బాహాటంగానే సూచించి వున్నాను. కానీ ఎన్ని విద్యలు అవలీలగా నేర్చినా నారీ హృదయాన్ని అర్థం చేసుకునే బ్రహ్మవిద్య మాత్రం మగవాడి పాలిటికి దుస్సాధ్యంగానే వుండిపోయింది. నా అంచనాను త్రిప్పికొడుతూ మా ఆవిడ నేను చూచిన మొదటి యింటినే సెలక్టుచేసి పారేసింది.

ఏంచేస్తాడు భవదీయుడు, అశోకపురంలోని శోక గృహంలో అలక పాన్పుకు బదులుగా సులక మంచం సవరించుకుని యింతచే శావా యింతీ అని విచారించడం మినహా!

ఇలా నా పాటుకు నేను నా విచార దినాలు గడుపుతుండగా శ్రీమతి గారు బయల్దేరి వస్తున్నట్టు వార్త అందింది. రిసీవు చేసుకోడానికి బస్ స్టాండుకు వెళ్ళాను. మాతృశ్రీ సమేతంగా, తన మాతృత్వానికి చిహ్నంగా వున్న చిరంజీవులతో బాటుగా బోలెడు సామానుతో సహా నీరజ బస్సు దిగింది.

"ఈ వూళ్లో జట్కాలు లేవు" అన్నాను.

"ఫరవాలేదు లెండి. నడిచే వెళ్ళిపోదాం. మేము చెరొక బిడ్డను తీసుకుంటాం. మీరు సామాన్లు పట్టించుకు రండి...."

ఇంకా నయం! నన్నే ఎత్తుక రమ్మన లేదు.

నిజం చెప్పొద్దూ! బిడ్డలెంత ముద్దొస్తున్నా నీరజపైన నాకు చెప్పరానంత కసిగా వుంది! ఇప్పుడేమయింది? అమ్మగారి తమాషా అంతా ముందే వుంది. మిడి గ్రుడ్లుపెట్టి అరచేతిని నోటికడ్డం పెట్టుకుని ఈవిడగారు హాహాకారం చేయవలసిన పరిస్థితి అదే! గడిచిన పది పదిహేనురోజులుగా నేను పని గట్టుకుని నా ప్రస్తుత నివాస గృహాన్ని క్రయిమ్ పిక్చర్లో భూత గృహం సెట్టింగులా దిద్ది తీర్చివున్నాను. బూజు దులపలేదు. సాలిగూళ్లు తీసెయ్యలేదు. వెదికిపట్టిన ప్రతి వల్లినీ గోడపైకి తీసుకెళ్ళి మరకలు సృష్టించాను.

పొగచూరిన గోడలకు యింటి యజమాని సున్నం కొట్టిస్తానంటే వద్దన్నాము. దొడ్డిని అడివిలా వుండిపోనిచ్చాము.

కాపీ నీరజ దగ్గిరికి వచ్చేసరికి ఈ నా రెండో అంచనాగూడా మందు దట్టించని టపాకాయలా తుస్సుమంటూ వెలవెల పోతుందని నేను కలలో నైనా భావించలేదు.

అటూ యిటూ నాలుగుసార్లు తిరిగి యిల్లంతా కలయపరికించిన నీరజ మెల్లగా నా దగ్గిరికి వచ్చి "నేనెలా వుంటుందనుకున్నానో అలాగే వుందండీ యిల్లు" అంది.

"ఇది నువ్వు వలచిన రంభ. ఇది నువ్వు మునిగిన గంగ. ఇదిలా వుండండలోగానీ, యిందులో మన ముండడంలోగానీ నా ప్రమేయమేమీ లేదు" అన్నాను.

నా వుడుకు మోత్తనం చూచి నీరజకు నాపట్ల జాలి అయినా కలిగి వుండాలి. లేదా ప్రేమైనా యినుమడించి వుండాలి. ఆమె గోముగా నా సర సకు వచ్చి చెంపపైన చేయివేసి నన్ను తన వైపుకు త్రిప్పుకుంటూ "కోప్పడ కండీ? మనమేం ఎల్లకాలమూ యిక్కడే వుండబోతామా! పెంపరరీగా యిదొక మజిలీ! నేను చెబుతున్నానుగా! త్వరగానే వెళ్ళిపోదాం" అంటూ అనునయించింది.

"ఏమన్నావు నీరజా! ఇదొక మజిలీనా? మరైతే మన గమ్యస్థానం ఏది?" ఉత్కంఠతో ప్రశ్నించాను.

"కంగారు పడకండి. నెక్స్ట్ మజిలీయే మన గమ్యస్థానం."

నా కర్థం కాలేదు. తెల్లబోయాను. నన్ను అమాయకుణ్ణి చేసి పారేసి నందుకు మురిసిపోతున్నట్టుగా నీరజ నవ్వింది. ఆ గొడవలో పడి మజిలీల విషయం విస్మరించాము.

ఆ రోజు రాత్రి బిడ్డలిద్దరూ నిద్రపోయిన తరువాత, తన తల్లి పిలి మాకు వెళ్ళిన అదను చూచుకుని నీరజ అప్పటికప్పుడు యింట్లో ఒక చిన్న

బెంచి కోర్టులాంటి దాన్ని ఏర్పాటు చేసి నన్ను ముద్దాయినిగా నిలోచ్చబెట్టింది. తామ న్యాయమూర్తిగా మారిపోయి విచారణ ప్రారంభించింది.

"ఏమండీ! ఓ విషయం అడగాలి మిమ్మల్ని...."

"అడుగు. నిరభ్యంతరంగా అడుగు."

"నేను మా పుట్టింటికి వెళ్ళి ఎంతకాలమైంది?"

"కానుపు కింక మూడు మాసాలుందనగా వెళ్ళావు. కానుపైన తర్వాత మూడు నెలల కొచ్చేశావు."

"నేనింటిదగ్గర లేనప్పుడు మీకు మామూలుగా నెల ఒకటింటికి ఎంత ఖర్చవుతుండేది?"

"ఎంతో ఎందుకవుతుంది? వంద రూపాయలతో సరిపోయేది...."

"మీ లెక్క-ప్రకారం నెలకు నూటయాభై మిగిలినట్టే గదా! నూట యాభై ని ఆరు పెట్టి గుణించండి...."

"గుణించాను."

"మా నాన్నగారిచ్చిన డబ్బుంది. నేనొక నూరిస్తాను. కలుపు కోండి...."

"అయింది."

"ఏమిటి?"

"కూడిక."

"ఆ వెయ్యి రూపాయలూ పట్టుకెళ్ళండి. ఎంత బంగారం వస్తే అంత కొనండి. రెండు పేటలతో నాకో గొలుసు చేసిపెట్టండి...."

మంచిమాట ఎవరు చెప్పినా వినవలసిందే! కాంతను కనకంతో అలంకరించడం గూడా సాంప్రదాయమే! ఐనా ఒక సందేహం. నా

ప్రవర్తన కి యిచ్చి వదిలిపెట్టిన తర్వాత కి అయిపోయేదాకా పరుగెత్తే బొమ్మ మోటారులా వుండడంలేదుగదా!

ఒక పని భారమయ్యేదిగానీ, కాకపోయేదిగానీ, వాడివాడి జీవనస్థాయిని బట్టి వుంటుంది. మా ఆవిడ పురమాయించింది నా పాలిటికి భారీ వ్యవహారమే. అనుభవజ్ఞులలో సంప్రదించాను. హెచ్చరికలు మనోగతం చేసుకున్నాను. దగ్గర్లోవున్న టౌనుకు వెళ్లి బంగారం కొన్నాను. పొందికగా నగ చేసిపెట్టే బత్తుడికోసం వాకబు చేశాను. అలాంటివాడొకడు పొరుగూళ్ళో వున్నట్టు తెలిసింది. అతని దగ్గరికి వెళ్ళడానికి మధ్యవర్తి ఒకరు కావాలసి వచ్చింది. ఇలా బంగారు గొలుసు తయారీ అయిదారునెలల ప్రణాళికగా పరిణమించింది.

ఈలోగా కొత్తనీళ్ల ఒంటికి పట్టక యింటిల్లుపాదీ ఒకసారి జబ్బుపడి లేచాము. మొదట మూడేళ్ళ చంటివాడికి జలుబు చేసింది. మూసిన కన్ను తెరవకుండా మూడు రోజులపాటు ముమ్మరంగా జ్వరం కాసింది. నేనుగానీ, నీరజగానీ పెళ్ళిగాక మునుపు పసిబిడ్డలతో వేగినవాళ్ళం కాము. కనీసం 'బిడ్డల పెంపక'మన్న పుస్తకమన్నా చదువుకోలేదు. మాకన్నీ అనుమానాలే! - ఒకసారి బిడ్డకు పొరబోయి గ్రుడ్లు తేలవేసేసరికి నీరజ భోరుమని ఏడవసాగింది. అంతవరకూ కాస్త ఎడమెడంగావున్న ఆ వీధి ఆడవాళ్ళందరూ బిలబిలా యింటి లోపలికి వచ్చేశారు. ఒకావిడ బిడ్డను చేతుల్లోకి తీసుకుని నిముషంలో సముదాయించేసింది. ఇంకొకావిడ వుయ్యెల్లో వేసి నిద్రపుచ్చింది. 'అయ్యో, యిదేం చోద్యమమ్మా! బిడ్డకు పొర బోదా ఎక్కడైనా! అంతమాత్రానికే ఏడ్చేస్తారా!' అనుకుంటూ వరుసగా అందరూ ఒకసారి విస్తుపోయారు. జ్వర తీవ్రతలో బిడ్డకు నెమ్మదిగా నిద్రపట్టేదికాదు. మేలుకుని వున్నప్పుడు కాళ్ళపైన పడుకోబెట్టుకుని మెల్లగా తడుతూవుండకపోతే ఏడుపు లంకించుకునేవాడు. అప్పట్లో ఎదురింటి తులసమ్మ, లేదా నాలుగో యింటి కామాక్షమ్మ, కాదా ప్రక్కింటి అప్పలమ్మ ఎవరో ఒకరు నీరజకు సాయం వచ్చేసేవారు. బిడ్డ తల్లిని వదిలి పెట్టకపోతే తామే స్వయంగా వంటపనికి పూనుకునేవారు. మంచిదో, చెడ్డదోగాని, ఈవాడ మనుషుల్లో ఒక

గుణం వుంది. ఎవరి గొడవలు వాళ్ళే పడనీలెమ్మని వాళ్ళూరుకోరు. నీ ఆనందంలో గానివ్వు. దుఃఖంలోగానివ్వు ఆహ్వానం లేకపోయినా వచ్చి పాలు పంచుకుంటారు. "ఏంచేస్తున్నావమ్మా నీరజా. మార్కెట్టుకు వెళ్తున్నామగ నీ కూరగాయలేమైనా కావలసివస్తే చెప్పు. తెచ్చి పడేస్తాను" అంటూ ఒకావిడ నేరుగా యింటికే వచ్చి పలకరించి వెళుతుంది. 'వంట చెరకు అయిపోయినట్టుందే! తెచ్చి పడేయమంటావా అక్కయ్యా" అంటూ పొరుగింటి కుర్రవాడు యధోచిత సహాయం నెరపడానికి ముందుకొస్తాడు. ఇంతలో ఇంటి వెనకవైపున వున్న ఏనాదివాళ్ళ ఆడవాళ్ళు కొందరితో నీరజకు పరిచయం ఏర్పడింది. వాళ్లామెగారివి పిండి రుబ్బనివ్వడంలేదు. చివరకు అంట్లుగూడా వాళ్ళే తోమిపెడుతున్నారు. హఠాత్తుగా నీరజకొక సందేహం కలిగింది. "ఏమిటండీ! నేనిప్పుడుండటం పుట్టింట్లో కాదుగదా! ఏమిటో మరి. ప్రాణాలకెంతో హాయిగా వుంది," అంటూ ఆశ్చర్యం ప్రకటించింది. నా మట్టుకు నేను నా ఆశ్చర్యాన్ని బయటికి వెల్లడించ లేదంతేగానీ, ఆఫీసుకు వెళ్లిరావడమొక్కటి తప్పితే నాకు గూడా అత్తగారింట్లో వున్నట్టే వుంది!

ఈ వ్యవధిలో మా చిరకాల స్వప్నం కాస్తా ఫలించింది. బంగారు గొలుసు నీరజ మెడలోకి వచ్చేసింది. ఆ రోజు మా కుటుంబానికి నిజంగా ఒక పండగ లాంటిదే! కొత్త పెళ్ళికూతుర్ని చూడ్డానికి వచ్చినట్టుగా వచ్చారు జనం! 'పచ్చి పసుపుకొమ్ములా వుందిగదా! అప్పటమైన బంగారానికి అదే గుర్తు' అన్నారు. పవిత్రతనాన్ని మెచ్చుకున్నారు. ఆ నగవల్ల నీరజ కంఠానికి ఎక్కడలేని అందం వచ్చిపడిందన్నారు. పుత్రోత్సాహమా? కొత్తగా ఒక నగ చేయించుకోవడమా? ఏది ఎక్కువ ఆనందప్రదం? ఏమో, నేను చెప్పలేను.

అలా గడిచింది ఒకటి రెండు రోజులే! మూడోనాటి సాయంకాలం నేనింటికి వచ్చేసరికి దిగులు నీడలు పారాడుతున్న ముఖంతో నీరజ గుమ్మంలోనే నాకెదురైంది.

నా మనసు గతుక్కుమంది, మెడవైపు చూశాను. పరవాలేదు. గొలుసు పదిలంగానే వుంది.

"ఏం జరిగింది నీరజా. ఎందుకలా వున్నావు?" అని ప్రశ్నించాను.

"ఎంతటి ప్రమాదం తప్పిందనుకున్నారు!గుండెలవిసి పోయాయంటే నమ్మండి. స్నానం చేస్తూ గొలుసు తీసి జామచెట్టు కొమ్మకు తగిలించాను. ఏనాదివాళ్ల అమ్మాయి లేదూ, సుబ్బులు-అది నీళ్లు చేదడానికని వచ్చింది. దాని కేవో పనులు పురమాయించి చక్కా లోపలికొచ్చేశాను. విస్తరి వేసుకుని నింపాదిగా భోజనం చేస్తూ కూర్చున్నాను. 'అమ్మగోరూ! గొలుసు చెట్టు కొమ్మకే వుంచేశారేమండీ!' అంటూ ఆ పిల్ల తీసుకొచ్చి ఇచ్చేదాకా నా కా విషయమే జ్ఞప్తిలో లేదు..."

"చూశావా నీరజా! ఎప్పుడూ ఎక్కనివాడు అందలమెక్కితే ఇలాగే ఏదో అయిందట! పోనీలే. ఇకనయినా జాగ్రత్తగా వుండు" అన్నాను.

"వద్దు బాబూ వద్దు! ఏవేళ కెలా వుంటుందో చెప్పలేం; ఎందుకురా యిదిలా చెబుతోంది అనుకోకుండా మీరు చప్పున వేరే యిల్లు చూడండి. వెంటనే వెళ్ళిపోదాం...."

"అబ్బే, ఎందుకులే నీరజా! ఈ యింటిని గురించి ఏవో దురభిప్రాయా లుండిన మాట నేను కాదనను. కానీ అవన్నీ యిప్పుడు మాసిపోయాయి. ఇక్కడి కొచ్చాక చీకూ చింతా లేకుండా నిశ్చింతగా వున్నాము. కొత్త నగ గూడా చేయించుకున్నాము. చిటికెలో మటుమాయం కావలసింది మళ్లీ మన చేతిలోకి వచ్చింది గూడా!...."

"కాదులెండి బాబూ! మీకు తెలియదు. నేను మొదటి రోజునే మీతో చెప్పానుగా! ఇది తాత్కాలికంగా ఒక మజిలీయే! మరొకటి. మరొకటీ మనకొద్దు. ఆ పూలంగి తేరు వీధిలోనే ఓ యిల్లు చూడండి...."

"ఆ వీధిలోనా?" ఆవిడ యింగిత మేమిటో తెలియక తెల్లబోయాను.

"ఇప్పుడు నా మెడ బోసిగా లేదు గదా! పరవాలేదు లెండి! మన మిప్పుడు భేషుగ్గా అక్కడే కాపురం పెట్టొచ్చు...."

తెలిసింది. బంగారపు గొలుసనేది నీరజ కంఠానికి అలంకారం మాత్రమే గాదు. నా ప్రయోజకత్వానికి గుర్తు మాత్రమేగాదు. అది పూలంగి తేరు వీధిలోకి ప్రవేశ పత్రం గూడా!

'ఒక్కొక్కతరి జవరాండ్రు కటారికత్తియల్' అన్నాడు కవి. నా దృష్టిలో వాళ్లెప్పుడూ కటారి కత్తులే! వాళ్లొక సలహా చెబుతారు. అది నీకు నచ్చదు, నవేమిరా ఒప్పుకోవు. కానీ అలా ఎంతో కాలం గడవదు. అయిదు రోజులకో, ఆరు రోజులకో నువ్వు కాస్త మెత్తబడతావు. ఇంకొక ముహూర్తంలో ఎప్పుడో 'కానీలే చూద్దా' అంటావు. మళ్ళీ కొద్దిరోజులు గడిచేసరికి కాంతామణి కోరిక ఏదైతే వుందో దాన్ని నెరవేర్చే ప్రయత్నంలో గొంతుబంటి దాకా మునిగిపోయి వుంటావు.

ఉదాహరణకు నా విషయమే తీసుకోండి. నెల తిరగక మునుపే నేను అద్దెయింటికోసం అన్వేషిస్తూ పూలంగి తేరువీధిపై బయల్దేరాను.

అదృష్టం కలిసొచ్చినట్టుగా నాలుగైదు నెలల మునుపు నేను చూచి వచ్చిన అవుట్ హౌస్ యింకా ఖాళీగానే వుండిపోయింది. ఇంటి యజమాని జరిగిపోయిన విషయాలను గురించి అట్టే పట్టించుకునేవాడిలా లేడు. "మీరా! వచ్చేశారా! మంచిది నిరభ్యంతరంగా మీ రీ యింట్లోకి రావచ్చు. అన్నట్టు చిన్నబిడ్డలే అన్నారు కదూ! వాళ్ళు గూడా చాలా చిన్నవాళ్ళన్నారు. తోటకేమీ ప్రమాదం లేకుండా వుండడమే మాక్కావలసింది! తాళం చెవులు యింటి దగ్గరే యిచ్చివుంటాను. మీకెప్పు డిష్టమయితే అప్పుడే చేరవచ్చు" అన్నాడు.

కొత్తయింటిలో కాపురాన్ని గురించి తలచుకున్నకొద్దీ ఎంత ఆనందంగా వున్నా, నాకు లోలోపల ఒకందుకు బాధ గూడా లేకపోలేదు. తోటలో ఒక కొయ్య నాటిపెడితే తీగలు కొన్ని అల్లిబిల్లిగా దాని కల్లుకుంటాయి. మళ్ళీ వాటిని వేరుచేయడం మనసు కెంతో బాధ కలిగించే సన్నివేశం. ఈ మాటలోని నిజాన్ని మరింత బాగా అనుభూతిలోనికి తెచ్చుకోదలచిన వారు శకుంతలను అత్తవారింటికి పంపిన నాటి కణ్వాశ్రమ దృశ్యాన్ని ఊహలోకి తెచ్చుకోవచ్చు. అశోకపురంలోని యింటిని ఖాళీ చేసిన రోజున అక్కడి

యిరుగుపొరుగు వాళ్ళను తొలగతోసుకుని ఈవలికి రావడం మా పాలిటికి బ్రహ్మప్రళయమయి పోయింది.

జీవితంలోనుంచి వీలయినన్ని ఎక్కువ సదుపాయాలు పంచుకోదలచిన వాళ్ల విధిగా కొన్ని మానసిక దౌర్బల్యాలను జయించాలి. బంధుప్రేమను ఎక్కడి కక్కడే తెగ్గోయాలి. పాపభీతి తగ్గించుకోవాలి. మాట పట్టింపు లుంచుకో గూడదు. నీతి, అవినీతి అంటూ మడిగట్టుకుని కూచో గూడదు. తోడి మానవుల పట్ల మమకారం పెంచుకోవడం అలాంటి దౌర్బల్యమే! అశోకపురం పెంకుటింటిని వదులుకోకపోతే, వసంత విలయం అవుట్ హవుసులోని సుఖం లభ్యమౌతుందా? అయిదు నెలలకు మునుపు వాళ్లెవరో నాకు తెలియదు. నే నెవరో వాళ్లకు తెలియదు. ఓ పవికిమాలిన అనుబంధాన్ని పెంచుకుంటూ నా మన సెందుకు అశోకపురం వైపు మొగ్గు జూపుతుందో నా కర్థమై చావడం లేదు.

అవుట్ హవుసులో కాపురం పెట్టేశాము.

అవుట్ హవుసులోనుంచి సూర్యోదయం ఎంత అందంగా వుంటుందో చూచాము. వెన్నెల్లో అక్కడి మేడల గోడల, నీడల రామణీయకత తిలకించాము. వసంతం వచ్చి గృహోపవనంలో విడిది చేయడం గమనించాము. గ్రీష్మం వచ్చి పోయింది. వర్షాలు విజృంభించాయి. హేమంతంలో మంచు వానలా కురిసింది. ఋతువుల మూలంగా పుట్టుకొచ్చే అసౌకర్యాలేవీ మమ్మల్ని సోకడంలేదు.అందువల్ల నేగావచ్చు,మాకు ఋతువులన్నీ ఒక్కలాగే వున్నాయి. అంతా బాగానే వుందనీ, సుఖమంటే అదేననీ సంతృప్తి పడడానికి ప్రయత్నించాము. కానీ ఆ సంతృప్తికి వెనుక ఏదో తీరని వెలితి దాగొని వున్నట్టు నన్నొక శంక పట్టి పీడిస్తోంది. ఏమిటది! ఏమై వుంటుం దది? పని గట్టుకుని రెండు రోజుల పొడుగునా ఆలోచించి చూచాను. స్ఫురించింది. ఉన్న వెలితి అవుట్ హవుసులో మా కాపురానికి సంబంధించింది గాదు. అదిక్కడి మనుషులకు సంబంధించింది. వీళ్ళొకరి యింటి కొకరు వెళ్లరు. ఎవరి గోడల నడుమ వాళ్లదొక రాజ్యం. మా మట్టుకు మాకు ఒక ఏకాంత ద్వీపంలో నివసిస్తున్నట్టేవుంది!

ఎవరి యిన్వెన్షన్ వాళ్ళే దాచుకుంటే యిక లోకం మేం బాగుపడుతుంది? నీరజతో చెప్పేశాను.

ముఖకవళికలను బట్టి చూస్తే నీరజ మారుమాట లేకుండా నా అభిప్రాయాన్ని ఒప్పుకోబోతున్నట్టే తోచింది. కానీ ఒకటే క్షణంలో ఆ ధోరణి మారిపోయింది. "బాగా అన్నారులెండి! మగవాళ్ళు మీకేం తెలుస్తుంది? ఇంటావిడ గిరిజాబాయమ్మ రోజు మార్చి రోజయినా యిక్కడికి వచ్చి వెళ్తుంది. ఆవిడ కోడలు రమాప్రియ పోయిన సోమవారం నాడనుకుంటాను. మన యింటి కొచ్చింది. నేనూ తీరిక దొరికినప్పుడల్లా వాళ్ళ యింటికి వెళ్ళి వస్తూనే వున్నాను....."

అలాగా! నాకు తెలియదు. పూలంగితేరు వీధి మహిళా సమాజంలో నీరజకు సభ్యత్వం లభించిం దన్నమాట! అంతేచాలు. ప్రస్తుతానికదే పదివేలు!

ఈ కొత్త పరిచయాల ప్రభావం మెల్ల మెల్లగా మా కాపురంలో చోటు చేసుకోసాగింది. ఇంటావిడగానీ ఆవిడ కోడలుగానీ ఇంటికొస్తే కూచోడాని కొక సుఖాసనమైనా లేకపోతే ఏం చేయగలం? రెండు గాడ్రేజ్ కుర్చీలు తీసుకొచ్చి పడేశాను. ఇంటికొచ్చిన వాళ్లకు ఉపాహారమైనా పెట్టి పంపకపోవడం ఏం బాగుంటుంది? ఒక డైనింగు టేబిలు కొనుక్కురావడం తప్పనిసరై పోయింది. దీపావళి పండుగకు బట్టలు కొనుక్కురావడానికి బజారుకు వెళ్తూ ఇంటావిడ తోడుగా నీరజను కూడా తీసు కెళ్ళింది. వట్టిచేతులతో తిరిగిరావడం బాగుండదని నీరజకు ఒంటి రంగుకు సూట్ అయ్యేటట్టుగా డెబ్బయి రూపాయల్లో ఒక చీర సెలక్టుచేసి డబ్బు నాలుగురోజుల్లో ఇవ్వొచ్చు లెమ్మని సిఫారసు చేసింది. వస్తూ వస్తూ నీరజ తన చేతవున్న ముప్పైరూపాయలు పెట్టి బిడ్డ లిద్దరికీ చెరొక జత రెడీమేడ్ దుస్తులు పట్టుకొచ్చింది. ఇంటావిడ మనమళ్ళు కూడా సరిగ్గా అలాంటి దుస్తులే తొడుక్కుంటారు. గనుక నేను పెదవి కదపటానికి వీల్లేక పోయింది. నాలుగు రోజులబట్టి చంటిబిడ్డ సరిగ్గా పాలు తాగడం లేదని చెప్పేసరికి, ఇంటావిడ ఈ కేసును గూడా వాళ్ల ఫామిలీ డాక్టరుకే రికమండ్

చేపింది. ఆయన చర్మంలోకి ఒక సూది దిగబొడిచి, గుప్పెడుమందు పొట్లా లిచ్చి, అదనంగా పదిరూపాయల ఖరీదుతో ఒక టానిక్కు కొనుక్కోమనీ, సదరు టానిక్కు దుర్గా మెడికల్ షాపులో దొరుకుతుందనీ సలహా చెప్పి పంపాడు.

ఈ హంగుల కేమొచ్చెగాని పూలంగితేరు వీధిలో ప్రత్యేకించి చెప్పు కోవలసిన వైభవం ఆడవాళ్ళు పేరంటాలకు వెళ్ళిరావడం. ఎవరెవరు ఏయే చీర కొనుక్కున్నారో, ఎవరెవరు ఏ యే ఆభరణం చేయించుకున్నారో తెలిపి వచ్చేది అప్పుడే. నీరజ కున్న మంచి చీరలు ఏ నాలుగో అయిదో మాత్రమే నన్నది ఆ వీధి వనితామండలి కొక చర్చావిషయమై పోవడం నా దురదృష్టం. ఇందువల్ల నాకు కొంత మనశ్శాంతి కరువై పోయింది. రాను రానూ ఈ పేరంటమన్నమాట చెవిన బడితే నేను నత్తగుల్లలా ముడుచుక పోసాగాను. ఎందుకంటే వాటికి రిక్తహస్తాలతో వెళ్ళగూడదట! ఓ జాకెట్టు ముక్క తీసు కెళ్ళాలి. అది రివాజున్నూ, అతిక్రమించరానిదిన్నీ! జాకెట్టుముక్క ఖరీదును బట్టి దాన్ని తీసుకెళ్ళేవారి అంతస్థుకు ధర కట్ట కట్టబడుతుంది.

ఈ లెక్కన ఈ అవుట్‌హవుసులో ఇంకొక ఆరు మాసాలు గడిచే సరికి నా బ్రతు కెక్కడ తెల్లవారుతుందో నా వూహ కందడం లేదు.

ఎలాంటి ఆపద వచ్చి చుట్టుముట్టినా ఒక చిన్న కిటుకులో అందులో నుంచి బయటపడే హీరోలను నేను సినిమాల్లో చూచాను. నా విషయంలో అలాంటి 'మిరకిల్' ఏదైనా జరగకూడదా అనుకున్నాను. 'మిరకిల్'గా చెప్పుకోదగిన గొప్ప సంఘటన ఏదీ జరగక పోయినా, మా కాపురంలో నే నాశించిన మార్పు రావడమనేది వుంది చూచారా? అది నా అదృష్టం.

ముచ్చటగా మూడు మాటల్లో చెప్పి ముగిస్తాను.

ఓరోజు సాయంకాలం నే నిల్లు చేరుకునేసరికి నీరజ ముఖంలో కత్తి వేటుకు నెత్తురు చుక్కలేదు. ఎన్నిసార్లు గుచ్చి అడిగినా జవాబు లేదు. "చెప్పు నీరజా! అవమానమయినా, సన్మానమయినా మన ఇద్దరిలో ఒకరికి జరిగితే ఇంకొకరికి జరిగినట్టే గదా! ఫరవాలేదు చెప్పు చెప్పవూ" అంటూ

బుజ్జగించాము. ఇంకా వెయ్యి విధాలుగా బ్రతిమాలుకున్న తర్వాత నీరజ బయటపడింది.

వాసంతి అన్న పేరుతో ఇంటావిడకో మనుమరాలుంది. ఆ పదేళ్ళ పిల్ల తోటలో పూలు కోసుకుంటూ మా అవుట్‌హవుసు వైపు వచ్చిందట! 'రా అమ్మాయ్! కాఫీ తీసుకుని వెళ్దువుగాని.' అంటూ నీరజే ఆ పిల్లను ఆహ్వానించిందట! వచ్చినపిల్ల కాఫీ తీసుకుని తన మానాన తాను వెళ్ళి పోవచ్చును గదా! అలా వెళ్ళిపోకుండా 'నీరజమ్మక్కా! నీ మెడలో వున్న గొలుసు రోల్డుగోల్డుదా? కవరింగుదా?' అని అడిగిందట.

''పెద్దవాళ్ల చెప్పుకునేమాట గాకపోతే పసిపిల్లకు దానికేం తెలుస్తుం దండీ! వద్దుబాబూ వద్దు. మనకీ ఇల్లే వద్దు ఈ వీధే వద్దు'' అంటూ వాపో యింది నీరజ.

నీరజకు మరేది కావాలో నాకు తెలుసు. 

# వెలుగు సముద్రంలో చీకటి దీవి

లోకం బాగుపడి పోయిందన్న మాటపట్ల నాకు నమ్మకం లేదు. కానీ లోకం బాగుపడుతోందని ఎవరైనా చెబితే తటపటాయింపులు లేకుండా నమ్మేయాలనిపిస్తుంది. ఇది మెరమెచ్చులకోసం చెబుతున్న మాట గాదు. ఉద్యోగిలో లంచగొండి తనం. రైతులో స్వార్థం. వ్యాపారంలో బ్లాక్ మార్కెట్టు, విద్యార్థిలో క్రమశిక్షణా రాహిత్యం. ఈ అవినీతి లక్షణాలు సమాజంలో వున్న మాట నేను కాదనను. ప్రజాజీవనం ఒక మహాప్రవంతి; నువ్వెంతగానైనా ప్రయత్నించు. ఎంతో కొంత మురికీ ముర్రా, చెత్తా చెదారం అందులో కలిసివుండక తప్పదు. ఈ ఆసుపత్రులు. ఈ విద్యాలయాలు, ఈ ఎలక్ట్రిక్ స్తంభాలు, ఈ ప్రాజెక్టులు, ఈ సంతాన నియంత్రణా ప్రచారాలు యివన్నీ నాలాంటి ఆశావాది కేమని చెబుతాయి. దేశం బాగుపడుతుందనే చెబుతాయి.

కానీ ఈ నా అభిప్రాయాని కొకచోట దారుణంగా దెబ్బ తగిలింది. కాలగమనంలో గాయం మానిపోయినా మచ్చమాత్రం అలాగే వుండి పోయింది.

ఆ వూరిపేరు రంగాపురం. ఆంధ్రదేశంలో అధమపక్షం పది పన్నెండు రంగాపురాలైనా వుంటాయి. వాటిల్లో యిది ఏ రంగాపురమన్న ప్రశ్న యిక్కడ అప్రస్తుతం. కన్ను పొడుచుకోవడానికొక వ్రేలు కావలిసి వచ్చినట్లుగా. కథ చెప్పుకోడానికి వూరంటూ ఒకటి వుండాలి గదా! అదిగో, అదే రంగాపురం!

ఆ వూరికి నేను వెళ్ళడం తమాషాగా గానీ, యాదృచ్ఛికంగాగానీ జరిగిన సంఘటనగాదు. పురిటింట ఆడబిడ్డ ఏడుపు వినిపించగానే ఫలానా వాడికి పెళ్ళాం పుట్టిందనుకునే సాంప్రదాయం సర్వజన విదితమే! కొందరు మగ బిడ్డల విషయంలో వాడేదో ఒక ఉద్యోగం చేసి బ్రతకడానికే పుట్టాడని

భావించడం లోకంలో పరిపాటి. ఆ విధంగా మా పెద్దలు నా నుదుట లిఖించి పెట్టిన ఉద్యోగం పేరు మాష్టారు గిరి; దానిపైన నేను మరులు గొనేందుకు వీలుగా మావాళ్ళెన్నో దోహదక్రియలు సలుపుతూ వచ్చారు. "ఒరే అబ్బీ. అది గౌరవప్రదమైన వృత్తిరా" అన్నారు. అందులో పాపానికి చోటే లేదన్నారు మా నాన్నగారు. మా తాతగారు కూడా బడి చెప్పుకునే బ్రతికారు గనుక అది నాకు కులవృత్తి గూడా నన్నారు. ఆయీ హితబోధవల్ల నేను మాష్టారు గిరిపైన మోజు పడ్డాననే చెప్పవలసి వుంటుంది. నా పాలిటికి ఉద్యోగ మన్న దొక సహధర్మిణి లాంటిదైతే, యిక పాణిగ్రహణ మొకటే తరువాయి.

వరుడికి వధువు నచ్చింది. కట్నాలు, కానుకల విషయంలో పేచీయే లేదు. పెళ్ళికొడుకు పెళ్ళికోసం తహతహ పడుతున్నాడు గూడా; ఐనా ఉభయ కుటుంబాల్లోనూ ఏవో యిబ్బందులు ఏర్పడటం వల్లనైతే నేమి. ఆ తరువాత మరి కొంతకాలం పంచాంగాల్లో శుభయోగాలు కలిసి రాకపోవడం వల్ల నైతేనేమి వివాహాలు వాయిదా పడుతుండడం గూడా తమకు విదితమే. ఉద్యోగప్రాప్తిలో నా కెదురైందిగూడా అదే. వలచిన ఉద్యోగం జీవనాటవిలో మాయామృగం చందమై రెండేళ్ళపాటు నన్ను కింకురించింది. అలసి సొలసి వెయ్యి నిట్టూర్పులు విడిచిన తర్వాత చివరికెలాగైతేనేం చేతికి దొరుకుతానని బాస చేసింది. గొంతెత్తి బిగ్గరగా అరిచాను—ఎక్కడున్నావు; ఎప్పుడు దొరకుతావని. ఇదిగో యిక్కడున్నా నని రంగాపురం నుంచే చేయి వూపింది.

ఉద్యోగ వార్తను తీసుకొచ్చిన ఆ ఉత్తరువు కాగితం నా కళ్ళకు వివాహ పత్రికకంటె అందంగా కనిపించింది.

రోడ్డులో బస్సు దిగాను. దిగినచోట ఎర్రమట్టి పరచిన మట్టిబాట ఒకటి ట్రంకురోడ్డు నుంచీ చీలి పొలాలగుండా ఎక్కడికో దూసుకుపోతోంది. ఆ కూడలిలో నాటివున్న సిమెంటు పలకపైన "రంగాపురం రెండు మైళ్లు" అన్న సూచన. నేను వెళ్లవలసినచోటికే వెళ్తున్నానని నమ్మకం పలికింది.

పొలాలు, ఓ చెరువుకట్ట. కట్ట దాటుకోగా కొన్ని ఫర్లాంగుల మేరకు చవిటిపఱ్ఱ. అక్కడ బాటక్రిందికి దిగగా ఓ కొండ ఏరు. ఒక పెద్ద మిట్ట. అక్కడనుండి దట్టంగా మామిడితోపులు, హఠాత్తుగా ప్రత్యక్షమైంది రంగాపురం.

రంగాపురం మరేమంత పెద్ద వూరుకాదు. ఉన్న నూరు నూటయాభై యిళ్లు పిచ్చివాడి చేతిలోని రాళ్లలా చెల్లాచెదరుగా విసరివేయబడి వున్నాయి. ఊరిలో యిండ్లు ఆక్రమించి వున్న జాగాకంటే ఖాళీగా వున్న స్థలమే ఎక్కువ. ఆ ఖాళీ ప్రదేశమంతటా పిచ్చి మొక్కలూ, తంగేడు చెట్లు, చీమల పుట్టలు ఏపుగా పెరుగుతున్నాయి. పచ్చికలో ఒక్క మనిషి మాత్రమే నడవడానికి వీలున్నంతటి కాలిబాటలు యింటింటికీ లంకెలుగా విస్తరించి వున్నాయి. ఎవడికి వాడు తన ఇంటినంతమట్టుకు నివాస యోగ్యంగా వుంచుకో తలచడమేగానీ, ఊరేమై పోయినా పట్టించుకోని నిర్లిప్తత మొదటి చూపులోనే నా కవగతమయింది.

పరిసరాలను కలయ పరికిస్తూ ఊరిమధ్యకు వెళ్లి అక్కడొక రచ్చ దాపున నిల్చున్నాను.

ఏమిటో అనుకున్నానుగానీ రంగాపుర మన్నది సార్థక నామధేయం. ఎందుకంటే పెద్ద పెద్ద పేట రొంపల్లో సైతం కనిపించనంతటి సుందరమైన దేవాలయం ఒకటి ఊరినడుమ గంభీరంగా వెలసివుంది. ఏమయినా ఊరి కుండవలసిన హంగుల్లో గుడికూడా ఒకటి. కానీ బడి ఎక్కడ?

ఎవరినైనా అడుగుదామనే అనుకున్నాను. ఎవరో కొందరు వుండీ వుడిగీ వీధివెంట వెళ్తున్నారు గూడా; కానీ వాళ్ళ కెవరికీ రచ్చ ప్రక్కన క్రొత్త వ్యక్తి ఒకడు నిల్చున్నాడన్న ధ్యాసే వున్నట్టులేదు. ఎవడైతే మన కేమన్న ఉదాసీనతతో దూరదూరంగా వెళ్ళిపోతున్న వాళ్ళ వైఖరివల్ల నా అంతట నేనుగా వాళ్ళను పలకరించడానికి మనస్కరించడమూ లేదు.

అప్పటికింకా మధ్యాహ్నం కాలేదు. ఊరి నొక చుట్టు వేసుకొని వచ్చి అప్పటికీ బడి కనిపించకపోతే అప్పు డెవరి నయినా అడుగుదామన్న నిర్ణయానికి వచ్చాను.

రంగాపురంలో యిండ్లు ఒక క్రమపద్ధతిలో నిర్మించబడలేదని మనవి చేశాను గదూ! క్రమం లేకపోతేనేమిగానీ. అవి సమాజంలోని వైవిధ్యాన్నంతా తేటతెల్లంగా తెలివిడి చేస్తున్నామని ఒప్పుకోక తప్పదు. గారమిద్దెకు దాపున్నే మంటిమిద్దె దాని కెదురుగా పెంకుటిల్లు. దాని వెనుక పూరిపాక. అల్లంత దూరంలో ఒక గుడిస. ఇలా ఋష్యాశ్రమంలో పామూ కప్పా. పులీ. లేడీలాంటి ప్రాణుల్లా అక్కడ కలిమిలేములు సహజీవనం చేస్తున్నాయి. ఒక మూల చింతచెట్టు క్రింద గోలీకాయ లాడుకుంటూ కుఱ్ఱవాళ్ళు కొందరు కనిపించారు. కొందరు లాగులుమాత్రం వేసుకున్నారు. చొక్కాలు లేవు. కొందరు చొక్కాలు మాత్రం తొడుక్కున్నారు, లాగులు లేవు. తలలు, ఒడలు దుస్తులు మాపి మట్టిగొట్టుక పోయివున్న వాళ్ళ వైఖరిని బట్టి చూస్తే వాళ్లిటీవల ఎన్నడూ బడిముఖం చూచినట్టు లేదు. కాని ఆ వూరి బడిని గురించి వాళ్ళకు కొన్ని వివరాలు మాత్రం తెలిసివుండక పోవు. నాలో వాళ్ళకింకా మేష్టరుగారు కనిపించక మునుపే, బడిని గురించి వాళ్ళ అభిప్రాయాలను తెలుసుకోవాలన్న కుతూహలం కలిగింది.

దగ్గరికి వెళ్లి నిల్చున్నాను. ఓ క్రొత్త వ్యక్తి తమ క్రీడా రాజ్యంలో ప్రవేశించినందుకు వాళ్ళయినా ఏమంత సుముఖంగా వున్నట్టు లేరు. ఐనా నేను నా స్వప్రయోజనార్థం వాళ్ళ ఆనందానికి అడ్డు తగులక తప్పిందిగాదు.

"ఒరే అబ్బి: ఈ వూరి బడి ఎక్కడ?" అని ప్రశ్నించాను.

బడిమాట బయటపడగానే వాళ్లొకరి ముఖం ఒకరు చూసుకున్నారు. రానున్న ప్రమాదాన్ని శంకిస్తున్న వాళ్ళలా దూరంగా పైదొలిగి ఒదిగి ఒదిగి నిల్చున్నారు.

"మిమ్మల్నే అడగడం! ఎక్కడుంది బడి?"

"అదిగో. అక్కడ" వాళ్ళొకవైపుకు దృష్టిని గుడించారు.

వాళ్ళ చూపులు ప్రసరించినచోట బొత్తిగా కట్టడం లాంటిది లేక పోలేదు. పూర్వాశ్రమంలో అది ఒక పూరియిల్లు. ఇప్పుడు దాన్ని పూరిల్లని చెప్పడం పెంటదిబ్బను పొదరిల్లని చెప్పడం. పైకప్పు ఏనాడో గాలి కెగిరి పోయింది. నాలుగైదు వెదుర్లు మాత్రం వెన్నుగాడునుంచీ వ్రేలాడుతున్నాయి.

ఒకవైపు గోడ కూలిపోవడంవల్ల దూలాలు భూమిపైకి వ్రాలి ముక్కోణమంటే ఏమిటో తెలియజేస్తున్నాయి.

"ఒరే అబ్బీ. మీరు బడికి వెళ్ళడం మానుకుని ఎంత కాలమైంది?" అని అడిగాను.

"పొట్టి మీసాల మేష్టరుగారు వెళ్ళిపోయిన తర్వాత మాకు బడిలేదు" పిసింద్రీలాంటి కుర్రవాడొకడు బదులు చెప్పాడు.

"పొట్టి మీసాల మేష్టారు ఎప్పుడు వెళ్ళిపోయాడు?"

"బలంగా వానలు కురిశాయి. బడి పెట్టుకోడానికి తావే లేకపోయింది పొట్టి మీసాల మేష్టరుగారు బస్సెక్కి వెళ్ళిపోయాడు."

"మళ్ళీ రాలేదన్నమాట!"

"రాననే చెప్పి వెళ్ళాడు!"

పరిస్థితిలో ఒక్కింత మాత్రమే తెలిసి వచ్చింది. కానీ వుత్సాహాన్ని శృంగదీయడానికి ఆ కొద్దిపాటి విషయమే చాలు! నిల్చునే ఓపిక లేక ఆ చెట్టు క్రింద కూలబడిపోయాను.

ఆ కుర్రవాళ్ళకి మాత్రం నన్ను గురించి తెలుసుకోవాలన్న ఆసక్తి ఎంతైనా వుంది. ఎవరతడు? ఎందుకోసం వచ్చాడు? ఆ వెళ్ళిపోయిన పొట్టి మీసాల మేష్టరుకు యితడేమైనా బంధువా?

వాళ్ళ ఆసక్తి వాళ్ళకుండగా, నా మట్టుకు నాకు గూడా వాళ్ళ ద్వారా మరికొన్ని వివరాలు తెలుసుకోవలసిన అవసరం వుండనే వుంది. ప్రొద్దు పుట్టక మునుపే బస్సెక్కాను. మార్గ మధ్యంలో బస్సు ఒకటి రెండుచోట్ల

విలిచిన మాట నిజమే! కానీ అక్కడి హోటళ్ళలో ఏది జడితే అది తినేసే టంతగా నా ఉదరంలో జఠరాగ్ని ప్రకోపించలేదు. కేవలం కాఫీతో మాత్రం తృప్తిపడ్డాను. ఇప్పుడు కడుపులో కొక్కులు త్రవ్వుతున్నాయి.

"ఒరేయ్ అబ్బాయిలూ! ఈ వూరిలో హోటలుందా?" అన్నాను.

"ఒచేలా! అస్సే లేదండి! మా వూళ్లో అంగడైనా లేదు."

హతాశుడినై పోయాను. ఏం చేయాలో తోచిందిగాదు. ఎందుకైనా మంచిదని మునసబుగారి నొకసారి కలుసుకోదలుచుకున్నాను. ఆ కుర్రవాళ్ళే మునసబు గారింటికి దారి చూపించారు. వెళ్ళిన సమయానికి మునసబుగారు మంగలిచేత తలంటించుకుంటున్నారు. శివుడి జటాజూటంనుంచి గంగాజలం ధారలు కట్టినట్టుగా, తైలధారలు చారికలుగా క్రిందికి దిగి అసలే మన్నగా వున్న ఆయన స్థూల శరీరానికి మరింత నిగనిగలు సమకూస్తున్నాయి. నూనె కాస్తా కళ్ళల్లో గూడా బడిందేమో, ఆయన కళ్లు మూసుకుని యోగనిద్రా ముద్రితుడైన పరమ యోగీశ్వరునిలా వున్నాడు.

"నమస్కారమండి!" అన్నాను. తపస్సుకు భంగం కలుగజేసిన మూర్ఖుణ్ణి ఏ యోగీశ్వరుడు మాత్రం మన్నిస్తాడు? ఆయన నావైపు చురచుర చూశాడు.

నన్ను గురించి నేనే పరిచయ వాక్యాలు చెప్పుకున్నాను.

"ఓహో, మేష్టారుగారివా! ఇది మాకు పరిపాటే నాయనా! కూర్చో. ఏడాదికి నలుగురు మేష్టార్లయినా వస్తారు మావూరికి. రావడమూ, వెళ్ళి పోవడమూ! అంతేగాని చదువు చెప్పినపాపాన మాత్రం పోరు. అసలిక్కడ చదువుకోవాలన్న ధ్యాస మాత్రం ఎవరికుంది? అదిగో, ఆ పెట్టెలోనే వున్నాయి స్కూలు రికార్డులు. ఆ పెట్టె గూడా స్కూలుదే. అదేగాదు. ఇంకా కుర్చీ ఒకటి, మేజా ఒకటి, ఒక నల్లబల్ల గూడా వున్నాయి అన్నిం టినీ తీసుకెళ్ళు. లక్షణంగా చదువు చెప్పుకో...."

దక్షిణదేశంలో "నల్లతంగాళ్" అన్న పేరుతో సుప్రసిద్ధమైన జానపద కథ ఒకటుంది. నల్లతంగాళ్ పరమ సాధ్వి. వాళ్ళ దేశంలో కరు

వొచ్చి పడేసరికి ఆమెకు రారాని కష్టాలొస్తాయి. భర్త ఎటో వెళ్ళిపోతాడు. కొద్దికాలంపాటు తల దాచుకోడానికని ఆమె తన ఏడుగురు బిడ్డలతో సహా పుట్టింటికి వెళ్తుంది. అక్కడ అన్నగారుండరు. వదిన మూళిఅలంకారి, పరమ గయ్యాళి. ఆవిడ ఆడపడుచుకు సరఫరా చేసినవి ఓడుపోయిన కుండలు, దంచి వండుకోమని యిచ్చినవి జల్లి వడ్లు. వంటచెరకంటూ యిచ్చినవి అరటి పట్టలు. రంగాపురం మునసబుగారు నా పట్ల అంతకంటే తక్కువ ఆదరం చూపించలేదు.

కొన్ని సంవత్సరాల అనుభవంతోగానీ మనకు కొన్ని రహస్యాలు అవగతం కావు. కానీ రంగాపురానికి సంబంధించిన రహస్యాలన్నీ నాకు ఆ ఒక్కనాటి అనుభవంతోనే ఆకళింపుకు వచ్చేశాయి. ఆ తరువాత యించు మించుగా ఆరు మాసాలపాటు నేను రంగాపురంలో వున్నాను. ఆ ఆరు మాసాల పొడుగునా నా కెదురైన అనుభవాలు గూడా నా తొలినాటి అభి ప్రాయాలు మరింతగా బలపడడానికి మాత్రమే ఉపకరించాయి.

మునసబుగారు చెప్పినట్టు రంగాపురీకులకు ("నందవరీకుల"కు అను కరణ) తమ వూరిలో ఒక పాఠశాల వుండి తీరాలన్న పట్టింపేమీ లేదు. ఎందుకు లేదు? ఆ వూరిలో అంగాళ్ళుగానీ, హోటళ్లుగానీ మచ్చుకైనా లేవు. ఎందుకు లేవు? అనతికాలంలోనే ఈ యక్ష ప్రశ్నలకు సమత్తరం తెలుసుకో గలిగాను. నూర్ల కొలది గొర్రెలను మేపుకరావడానికి ఒక్కడే కాపరి చాలు. అలా కాకుండా ఒక్కొక్క గొర్రెకు నూరుమంది కాపర్లా? చదువురాని వాళ్ళం దరూ గొర్రెలకు మారు రూపాలుకాగా, చదువుకున్నవాళ్ళు గొర్రెల కాపర్ల వంటివారని రంగాపురీకుల నమ్మకం. ఎవడుబడితే వాడు చదువరిగా మారి పోయిననాడు గొర్రెలకంటే గొర్రెల కాపర్లే ఎక్కువై పోయే ప్రమాదం వుందని వాళ్ళ సిద్ధాంతం. తమ బిడ్డలు విద్యావంతులు కావాలని అభిలషించే కుటుంబాలు రంగాపురంలో చాల తక్కువ. చదువనేది విస్పందేహంగా అమృతంలాంటిదని వాళ్ళకు తెలుసు. కానీ ఈ ప్రభుత్వం మోహినీ దేవతకు మల్లే ఆ అమృతాన్ని ఏరీ కోరీ కొందరికి మాత్రమే పంచిపెట్టగా అందరికీ సమానంగా వడ్డిస్తాననంటుందే కర్మ! రంగాపురం వారి యీ యింగితాన్ని

ప్రభుత్వం పసిగట్టలేక పోయింది. అందుకు ఫలితంగా ఏడ్చినదే ఆ వూరి బడి. గుర్రాన్ని చెరువు దగ్గిరికై తే తీసుకెళ్ళవచ్చుగానీ, దానికి యిష్టం లేక పోతే నీళ్ళెలా తాగించగలవు అన్న సామెత అవూరిపల్ల సార్ధకమైంది. ఎర్రయ్య. పుల్లయ్య, జోగులు, వెంకటేశు అన్న పేర్లమధ్య వినయభూషణ్ విద్యాసాగర్‌ల వంటి పేర్లు చిక్కి బిక్కిరించడానికి సమ్మతించక ఘరానా కుటుంబీకులు తమ బిడ్డలను ఏ బంధువుల యింటికో, ఏ దూరప్రాంతాలకో పంపి చదివించుకుంటారు. ప్రభుత్వంవారు పెట్టిన బడికివస్తే గిస్తేఎల్లయ్యలు పుల్లయ్యలే వస్తారు. వాళ్ళయినా ఎలా వస్తారు? అయ్యవారిపల్ల బలవంతం పైన వస్తారు.

రంగాపురంలో అంగడిగానీ, హోటలుగానీ లేకపోవడానికి కారణ మేమిటంటే అది ఒక ప్రత్యేక ప్రపంచంగావడమే. బాహ్య ప్రపంచంలో చెల్లుబడి అవుతున్న న్యాయాలకు, ధర్మాలకు అక్కడ పరిగణన లేదు. మిగిలిన ప్రపంచంలోనై తే దర్జీవాడొక చొక్కాగుట్టి అందుకు ప్రతిఫలంగా ఒక రూపాయి పుచ్చుకుంటాడు. రంగాపురంలోనై తే వాడికి రూపాయిలో సగానికి సగమైనా గిట్టుబాటుకాదు. కాదుగీదని వాదుకు సిద్ధమయ్యాడో, పీపు సాపు చేయించుకుంటాడు. పోగా ఉప్పు, పప్పు, నిప్పు పెట్టెలాంటి వస్తువు లతో ఆ వూరివాళ్ల కవసరం లేకపోలేదు. ఆ అవసరాలను గమనించి ఎవడో ఒక బేరగాడు గ్రామంలో ఒక చిల్లరకొట్టు పెట్టదలచుకుంటే అతగాడికి (నాకు మునసబుగారినుంచి లభించినట్టే) వుచితంగా అనుమతి లభిస్తుంది. కానై తే అందుకు వినిమయంగా అతడు తన సరుకుల నన్నింటినీ వుచితం గానే పంపిణి చేయవలసి వుంటుంది.

*　　　*　　　*

రామబాణంచేత ఖండింపబడి మళ్ళీ మొలిచిన రావణాసురుడి శిర స్సులా రంగాపురంలో మళ్ళీ బడి ప్రారంభమైంది.

బొత్తిగా సాధ్యం కాదనిపించినా, పనిని కొంతమేరకైనా సాధించ డంలో మానవుడి కెంతైనా సంతృప్తి లభిస్తుంది. ఆత్మవిశ్వాసమన్న పౌధానికి ఆ సంతృప్తికంటే మించిన కాంక్రీటు పునాది వుండదు. పై పెచ్చు

అది నా మొదటి వుద్యోగం. పదికాలాలపాటు చేయవలసిన ఉద్యోగం కూడా. రంగాపురంలో కొద్ది నెలలపాటు బడి చెప్పగలిగానన్నమాట ఒకటి దక్కితే చాలు. ఆ మాట నా భావి ఉద్యోగ జీవితానికి బావుటాలా పనికి వస్తుంది. అందువల్లనే నేను పలాయనం చిత్తగించలేదు. పరిస్థితులను ఎదుర్కొన డానికే పూనుకున్నాను.

రంగాపురంలో బడి జరపడానికి చాలా ప్రతిబంధకా లున్నాయి. వాటిలో బడి ఉనికికి సంబంధించినది మొదటి సమస్య. ఆలోచించగా సూక్ష్మంలో మోక్షంలా ఒక ఉపాయం స్ఫురించింది.

రంగాపురంలో రంగనాథుడి కోవెల ఒకటి వుందన్నాను గదూ! దానికున్నవి బలమైన ప్రాకారకుడ్యాలు. ఒక మాదిరి ఎత్తైన గాలి గోపురం. దాని క్రింద వేసిన గుబ్బలతోసహా, వాటికి తగిలించిన గంటలతోసహా నల్ల బారిపోయిన సింహద్వారాలు నా ఆరునెలల అనుభవంలో అవి మచ్చుకొక నాడైనా తెర చిలేవు. ముప్పై మూడు కోట్ల దేవతల్లో ఏ ఒక్క దేవుడికీ లేని ఘోషాపద్ధతి నేనక్కడే మొదటిసారిగా చూచాను. పుంలింగమే గనుక గాకపోతే ఆ సూర్యం పశ్య అన్న కితాబు ఆయన కొక్కడికే తగును. నా యీ బడి నెపంతోనైనా రంగనాథుడి ఘోషాకు విచ్ఛిత్తి కలుగవచ్చునని ఆశించాను. బడిపిల్లల కోసమైనా గుడి తలుపులు తెరుచుకోవచ్చని ఉద్దేశిం చాను. సలహా కోసం మునసబుగారితో సంప్రదించాను.

మునసబుగారు ముసి ముసి నవ్వులు నవ్వుతూ వెళ్ళి నరసయ్యగారిని కలుసుకోమన్నారు.

"నరసయ్యగారంటే ఎవరండీ?" అన్నాను.

"రంగనాథస్వామి సంరక్షకుడు. గార్డియన్ అన్నమాట! నరసయ్య గారినే ఎరుగవా? భలేవాడివయ్యా పంతులూ! నీకు తెలియకపోతే గాలి గోపురంలోని పావురాల నడగరాదూ! నేలానట్రా, డబ్బూ దస్కం అంటూ కొట్లాటలకు దిగి వ్యవహారాల కెగబడే కోర్టుపక్షుల నడగ రాదూ! పోనీ టౌనుకు వెళ్లి సివిల్, క్రిమినల్ లాయర్లలో ఏ ఒక్కరినైనా పలకరించరాదూ?"

మామూలు విషయాన్ని గూడా పొడుపు కథలాగా చెప్పటం కొందరి కలవాటు. వెన్న చేతిలో వుండగా నేను నేతికోసం దేశమంతా తిరగదలచు కోలేదు ఆ వూరిలోనే మరికొందరి దగ్గర నరసయ్యగారిని గురించి వాకబు చేశాను. జనవాక్యం ఏమంత ప్రోత్సాహకరంగా లేదు. అయినా నరసయ్య గారి నొకసారి కలుసుకోదలచుకున్నాను. రచ్చకు అత్యంత సమీపంలో వున్నదే నరసయ్యగారి యిల్లు. కొంత భాగం మిద్దె. మరికొంత పెంకుటిల్లు. ఇవిగాక ఒక పూరిపాక. వెనుక వైపున ఓపినంత ఖాళీ జాగా. రచ్చపైన నిల్చుండే నరసయ్యగారి గృహావరణలో ప్రతి భాగమూ స్పష్టంగా కనిపిస్తుంది. భూపతి కోసంవెళ్ళగా, బృంగిరిటి ఎదురైనట్టు, నరసయ్యగారికోసం వెళ్ళిన నాకు వాళ్ళ పెద్దబ్బాయి. ఎదురయ్యాడు. అసలు పేరు కనకాచలం. వ్యవహారనామం పెద్దబ్బాయి. బొత్తిగా అబ్బాయి కాదు. మప్ఫయి అయిదేళ్ళుంటాయి. చెక్కి నిలబెట్టిన శిలా విగ్రహంలాంటి కాయవాటు శరీరం. అందుకు తగ్గట్టు లోతైన బావిలో కదలికలేని నీళ్ళలా జడస్థితిలో వున్న ముఖకవళిక. కానీ విశేష మేమిటంటే నేను క్రొత్తగా వచ్చిన టీచరునని తెలియగానే పెద్దబ్బాయికి పరమానందం కలిగింది. "అయ్యా మేష్టారూ! ఈ వూరిలో వుద్యోగం కావడం మీ అదృష్టం" అన్నారు "ఎందుకండీ?" అన్నాను "ఎందుకంటా రేమిటి? ఇక్కడ చదువు చెప్పినా, చెప్పకపోయినా అడిగే నాథుడు వుండడు" అన్నాడు. తన ధోరణి తనది తప్పితే ఎదుటివారి స్థితి గతులను గురించి పట్టించుకోని సుగుణాన్ని పరిపూర్ణంగా పెద్దబ్బాయిలోనే చూచాను. "బడికి కావలసిందేమిటండీ మేష్టారూ? పిల్లలేగదూ? మీ బడికి కావలసినంతమంది పిల్లల్లో సగం మంది మా ఇంట్లోనే వున్నారు" అంటూ అటూ యిటూ చూశాడు. "వాసూ, సీనూ, మణీ, నాగూ బాబూ, బేబీ" అంటూ గొంతెత్తి పిలుస్తున్నట్టుగానే జంట జంటగా ఒక చిన్న పిల్లల జాబితా ఒప్పగించాడు. ఆ పేర్లతో చలామణి అవుతున్న భౌతిక ఆకారాలేవీ కనిపించకపోయేసరికి యింట్లో ఒక్కొక్క మూలకూ వెళ్ళి ఒక్కొక్క శాల్తీని పట్టి తీసుకొచ్చాడు. "ఆ పొట్టిమీసాల బడిపంతులు వెళ్ళిపోయినప్పటినుంచి వీళ్ళతో వేగలేక చచ్చిపోతున్నాము. మీ రొచ్చారు గనుక బ్రతికిపోయాము" అంటూ పిల్లల వైపు తిరిగి "ఒరేయ్ వాసూ! ఏం రోయ్ సీనూ!" అని

పేరు పేరునా, అటెండన్స్ పిలిచినట్టుగా పిల్లలకు హెచ్చరిక గొలిపి "రేపు వుదయం తెల్లవారగానే బడిలోకి వెళ్లి కూర్చోవాలి మీరు! చద్దన్నాలయినా, కాఫీలైనా ఇంటికి గంట కొట్టినప్పుడే" అంటూ ముగించాడు.

"పెద్దబ్బాయి చేస్తున్న హంగామా నాకు కాస్తా చిరాకు కలిగించిందనే చెప్పాలి, ఐనా చిరాకును బయల్పరచకుండా నేను నా యిబ్బందిని తెలివిడి చేసుకున్నాను——"బడి ఎక్కడ పెట్టుకోవాలో పాలుపోవడం లేదండీ! నాన్న గారు అనుమతిస్తే గుడిలో జరుపుకుందామనుకుంటున్నాను" అన్నాను.

"గుడిలో బడి పెట్టుకుంటారా?" నావైపు అనుమానంగా దొంగను చూచినట్టుగా చూచాడు పెద్దబ్బాయి——"అబ్బే, ఏమిటండీ... మరి" అంటూ నీళ్లు నమిలి, అంతలో మనకెందుకులే అన్నట్టు మాట దప్పించి "ఏమం టారో మరి! నాన్నగారి నడిగి చూడండి" అన్నాడు. అంతలో వూరి మధ్య నుంచీ ఏదో అలజడి వినపించింది. అమ్మలక్కల జగడమై వుంటుంది బహుశా! "కూచోండి మేష్టారూ! నాన్నగారిప్పుడే వస్తారు" అంటూ తుర్రున ఆ వైపుకు జారుకున్నాడు పెద్దబ్బాయి.

పెద్దబ్బాయి వెళ్లిపోగానే చిన్న పిల్లలందరూ నన్ను చుట్టు ముట్టేశారు. వాళ్లు పెద్దబ్బాయి కొక్కడికి తప్పితే ఈ ప్రపంచంలో మరే శక్తికీ భయపడే టట్టులేరు. "మా సీను ఎక్కాలే మరచిపోయాడండీ" అని ఒకరు, "వాసు గాడు సామాన్య శాస్త్రాన్ని చించి పడవలు చేశాడని" ఒకరు, "బేబీకి ఓన మాలే రావని" ఒకరు యిలా ఒక్కుమ్మడిగా నా చెవుల చుట్టూ కోటలు కట్టసాగారు. అదిరించి, బెదిరించి కిమ్మనకుండా కూర్చోబెట్టడానికి యిది బడి కాదు. నరసయ్యగారు వచ్చేదాకా నాకీ పిల్లల బెడద తప్పేటట్టూలేదు. "ఒరేయ్ పిల్లలూ! మేష్టారుగారిని వూపిరి తిప్పుకోనివ్వరు(ట్రా! ఏమిటా గల్లంతు?" అంటూ తలుపు వెనుక నుంచి సన్నగా ఓ కంఠస్వరం కలుగ జేసుకొనేదాకా ఆ అల్లరి అలాగే కొనసాగింది.

"ఫరవాలేదండీ! పిల్లలుగాకపోతే అల్లరి మరెవరు చేస్తారు?" అన్నాను.

''పిల్లల మాటకేంగానీ మీరీ యాభై యేదో దేశంలోకి ఎందుకొచ్చి పడ్డారండీ మేష్టారూ! మరెక్కడా దొరకలేదా మీకు ఉద్యోగం?''

ఒక క్షణంపాటు నేను విస్మయచకితుడనై పోయాను. సరిగ్గా నా అంతర్వాణి పలుకుతున్న మాటలనే నేను వేరొక వ్యక్తిగుండా వింటున్నా నన్నమాట! రంగాపురంలో దైవ్యం నిస్పృహాయతా పూర్తిగా పాపాలేనను కున్నా నింతవరకూ! కాదు కాదు. అందులో పాలు పంచుకోడానికి యింకొక వ్యక్తి కూడా యిక్కడే వున్నట్టుంది....

''అదేమండీ, అలాగంటున్నారు? ఇక్కడ ఉద్యోగం గావడం నా అదృష్టమని యిందాకా పెద్దబ్బాయిగారే అన్నారే....''

నా యీ సందేహానికి లోపలనుంచి సమాధానం వస్తుందని కొంత సేపు వేచి చూచాను. ప్రత్యుత్తరం రాలేదుగానీ, కొన్ని నిముషాలు గడిచాక పరామర్శ మాత్రం వినిపించింది....

''కాస్త మజ్జిగ పుచ్చుకుంటారా మేష్టారుగారూ?''

నిజానికి నా కాకలిగానే వుంది. ప్రజ్వరిల్లుతున్న జఠరాగ్నిని చల్లార్చడానికి చల్లటి మజ్జిగ దొరుకుతుంటే వద్దని చెప్పడానికి నోరెలా ఆడుతుంది? ఐనా ఎవరు నేర్పిన పాఠం వాళ్లకే ఒప్పగించడం యుక్తమని పించి మౌనంగా వుండిపోయాను.

మజ్జిగ గ్లాసుతో ఆమె హాల్లోకి వచ్చింది.

దాహం తీర్చుకున్న తర్వాత ''పర్పయ్యగా రెప్పుడొస్తారండీ?'' అని అడిగాను.

ఆమె నవ్వింది. ''మీ పిచ్చే మీదండి మేష్టరుగారూ! మీరు తల్లి క్రిందులుగా తపస్సు చేసినా దేవళంలో బడి పెట్టుకోనిస్తారా మామగారు? బడి అన్న తర్వాత మాలా మడికీ అన్న తేడాలు చెల్లవుగదా! తిరుపతి వేంకటేశ్వరుడికైనా లేవుగానీ మా రంగనాధస్వామికింకా ఆ పట్టింపులు దండిగా వున్నాయి. మీరేదో భ్రమలో వున్నట్టున్నారు.''

అంతర్యం అవగతమైంది నాకు. నరసయ్యగారితో మాట్లాడ్డంవల్ల లాభ ముండదని గూడా తేలిపోయింది.

"ఐతే వృధాగా మాటలు ధారపోసుకోవడ మెందుకు? వెళ్లొస్తానండీ!" అంటూ పైకి లేచాను.

"పాపం చాలా చిన్న వయస్సులోనే ఉద్యోగానికి వచ్చినట్టున్నారండీ మేష్టరుగారూ! ఆ కాడికి మీరే నయం. నేను మీకంటే చిన్నప్పుడే ఈ వూరొచ్చేశాను. వచ్చి గూడా పదిహేనేళ్ళు దాటింది. ఎక్కడో తల్లి దండ్రులున్నారు. ఏదీ ఈ బాదరబందీనంతా వదిలించుకుని వాళ్ళ దగ్గరకు వెళ్ళడానికి నా కెక్కడ తీరుతుంది? ఇదే మనుషులు, ఇదే వూరు.... జైల్లో జీవిత శిక్షలావుంది బ్రతుకు...."

నరసయ్యగారింటి నుంచి బయటపడ్డాను. ఆ యింటి కోడలి మాటలు ఆ రాత్రంతా నా చెవిలో మార్మోగుతూ వుండిపోయాయి. ఆమె వయస్సు ముప్పైకి మించినట్టు తోచదు. అనవరతమైన చాకిరీవల్ల, సౌకుమార్యం లుప్తమైపోగా, ఆమె శరీరం చిక్కిపోవడమే గాదు, పాలిపోయింది. గూడా, మన కిష్టంలేని పని ఏదైతేవుందో, దాన్ని తప్పనిసరిగా చేయవలసి రావడ మన్నది మనసుకొక యాతన, శరీరానికి దండన. ఆ యాతన, ఆ దండన ఆమెకు పుష్కలంగా లభించినట్టున్నాయి. వాకబుచేయగా తెలిసింది. ఆమెకు తొమ్మండుగురు బిడ్డలు. తొలిచూలు ఆడబిడ్డకు పెళ్లీడు వచ్చింది గూడా!

*   *   *   *

మరునాటి ఉదయం రంగాపురం రచ్చపైన బడికి ప్రారంభోత్సవం చేశాను.

చిన్నగది ఒకటి అద్దెకు దొరికింది. నాలుగుమైళ్ళ దూరాన ప్రతి ఆదివారమూ సంత జరుగుతుంది. ఇరుగు పొరుగు గ్రామాల్లో చిల్లరకొట్లు లేక పోలేదు. కావలసిన సరుకులు తెచ్చుకుని తీరికున్న మధ్యాహ్న వేళల్లో స్వయంగా పాకకార్యం నిర్వర్తించుకునే వాణ్ణి.

బరువుగా రోజులు దొర్లిపోసాగాయి.

ఆ తరువాత నేను రంగాపురాన్ని గురించి క్రొత్తగా తెలుసుకున్న దేమీలేదు. లేదంటే ఆ చీకటి దీవి నట్టనడుమ మరింత దట్టమైన చీకటి బంధువును మాత్రం కనిపెట్టగలిగాను. ఆ చీకటి బంధువే సరసయ్యగారి యిల్లు.

ఇది సంతాన నియంత్రణ పైన ప్రచారంకోసం వ్రాస్తున్న కథకాదు. ఐనా దాని ఆవశ్యకతను గురించి నొక్కి చెప్పడానికి యింతకంటే మంచి వస్తువు దొరకదు. అంతా దైవనిర్ణమనుకుంటూ, బాధ్యతలను గాలికి వదిలి పెట్టి ఎలా వీలైతే అలా కాలం గడపదలచుకున్న పురుషుడు. సంసారాన్ని సరిదిద్దడానికి సర్వశక్తులను ధారపోస్తున్న స్త్రీ. ఆ యిద్దరి నడుమ జరుగు తున్న సంఘర్షణకు నాట్యరంగమే సరసయ్యగారిల్లు. ఆ యింటి పెద్దలకు సుష్టుగా తిని త్రేన్చుతూ వెలుపలికి రావడమొక్కటే తెలుసు. పిల్లలకు ఏ మాత్రం మిగిలిందో, వాళ్ళు తింటున్నారో లేదో తెలియదు. పెద్దబ్బాయికి యిరవైయేళ్ళ వయసులోనే పెళ్లి జరిగింది. బిడ్డల్ని కనడానికి, బండెడు చాకిరీ చేయడానికి శాశ్వతంగా ఒక మనిషి దొరికిందని అనుకున్నారేగానీ, ఆ మనిషికి మనసుందనీ, ఆ మనసుకు గూడా యిష్టాయిష్టా లుంటాయని పెద్దబ్బాయి కలలోనైనా భావించలేదు!

సంక్రాంతి సెలవులొచ్చాయి. ఇంటికి వెళ్లివద్దామనుకున్నాను "అమ్మ పిలుస్తోందండీ" అంటూ కబురుతెచ్చాడు వాసు.

వెళ్ళాను.

"ఊరికి వెళ్తున్నారటగా మేష్టరుగారూ!"

ఆమె తాను పొందలేని మధురానుభూతిని దేన్నో తలచుకుని తపించి పోతున్నట్టుంది.

"వెళ్తున్నానండీ! అయిదురోజులే సంక్రాంతి సెలవులు. మళ్ళీ సోమ వారంనాటికల్లా ఇక్కడుండాలి...."

"మిమ్మల్నయినా పండుగకు తల్లిదండ్రుల దగ్గరకు వెళ్లనిస్తున్నారు. అంతే చాలు. క్షేమంగా వెళ్లిరండి...."

కళ్లల్లో గిర్రున తిరుగుతున్న కన్నీరు నాకు కనిపించకూడదనే ఆమె ప్రయత్నం. బయటి ప్రపంచంలోనికి వెళ్ళి రావడానికి అనుమతి పొందిన తోడిఖైదీని వేరొక ఖైదీ సాగనంపుతున్న దృశ్యంలా వుందది. నిజమే మరి. ఆమెకూ నాకూ వున్న సామ్యం ఒక్కటే - రంగాపురంలో ప్రవాసం. ఎటొచ్చీ ఆమెది సుదీర్ఘ ప్రవాసం. త్రెంచుకోడానికి వీల్లేనిది. ఆర్రు వాచిపోయినా ఆమె బండిని లాకెళ్ళవలసిందే! తప్పదు. ఆమెతో పోల్చి చూచుకుంటే నా పరిస్థితి ఎంతో మెరుగు. ఎప్పుడు బడితే అప్పుడు నేను నా ప్రవాసానికి స్వస్తి చెప్పుకోవచ్చు.

"నాకో సాయం చేసిపెడతారా మేష్టరుగారూ?"

ఏమి టన్నాను.

ఆమె లోపలికి వెళ్లి రెండు చీటీలు తీసుకొచ్చింది.

"చూస్తున్నారుగా మేష్టరుగారూ! మణి రెండు నెలలైంది సరిగ్గా అన్నం తిని. రాత్రుల్లో నిద్రపట్టదు. బలవంతంగా తినిపిస్తే, వుబ్బసంతో రెండు గంటలసేపు వూపిరి త్రిప్పుకోలేక పోతుంది. సీనుకు రోజు మార్చి రోజు జ్వరం వస్తోంది. అదేం మాయదారి జ్వరమోగానీ అది వచ్చినప్పటి నుంచీ వాడికి చెవులే వినిపించడం లేదు. బిడ్డలు చిక్కి సగమై పోయారు. వాళ్ళను చూస్తుంటే గుండెలు తరుక్కుపోతున్నాయి. మొన్న డాక్టరుగారి వ్యానువస్తే చూపించాను. డాక్టరుగారు ఈ మందులు వ్రాపి యిచ్చారు——"

"ఆ మందులు కొని తేవడమే కదండీ! అదెంత పని?"

"కాదండీ మేష్టరుగారూ! నా దగ్గర డబ్బులు లేవు...."

"ఫరవాలేదు. నా దగ్గరున్నాయి——"

"బిడ్డల్ని మన మేమయినా కావాలన్నామా మేష్టరుగారూ? దేవుడిస్తాడు. అలాగే జబ్బులుగూడా. అవి వస్తాయి, వెళ్తాయికూడా. లేదంటే తమతోబాటుగా బిడ్డల్నిగూడా తీసుకెళ్తాయి. మనకేం నష్టం? ఎందుకులెండి మేష్టరు

గారూ! కడుపుచించుకుంటే కాళ్ళపైన పడుతుంది. ఈ మందులు తీసు కొస్తే మీకు పుణ్యముంటుంది. మీ అప్పు ఎలాగైనా చెల్లించుకుంటాను.''

ఆవేదనవల్ల లోపల ఇమడలేక బయటికి పెల్లుబికిన ఆమె మాటల్లోని అంతరార్థాన్ని నేను గ్రహించగలిగాను. అందుపైన వ్యాఖ్యానానికి పూనుకో లేక మౌనంగా ఆ చీటీలు చేతికి తీసుకున్నాను.

ఊరునుంచి తిరిగివస్తూ మందులు కొని తీసుకొచ్చాను.

వారం రోజుల్లో బిడ్డల ఆరోగ్యం చక్కబడుతున్న సూచనలు కాన వచ్చాయి.

ఓరోజు మధ్యాహ్నం వాసు కాస్త ఆలస్యంగా బడికి వచ్చాడు.

ఆలస్యానికి కారణం అడిగాను.

వాసుకి వాడి ఈడుకుమించిన తెలివితేట లున్నాయి. తీగతోబాటుగా డొంకంతా కదిలించేశాడు.

''పోస్టాఫీసు కెళ్ళానండీ! మా అమ్మ తాతయ్య కొక జాబు వ్రాసి పెట్టెలో వేసిరమ్మంది. మీరు మందులు కొనితెచ్చారటగదండీ మేష్టారు గారూ! మీకు డబ్బివ్వాలట, తాతయ్యను పంపమని రాసింది....''

పెద్దగా దానధర్మాలు చేసే తాహతు నాకు లేదని తెలుసు. కానీ వీలై నంతలో నేను కొన్ని దుబారా ఖర్చులు చేయనే చేస్తున్నాను. వాటితో పోల్చి చూస్తే మందులు కొనిపెట్టడం డబ్బును సద్వినియోగం చేయడం క్రిందికే వస్తుంది. అంతకంటే సత్కార్యానికి నేనెన్నడూ డబ్బును వినియోగించ లేదేమో! కానీ యీ వాదాన్ని ఆమె ఎలా అర్థం చేసుకో గలుగుతుంది?

మళ్ళీ కొన్ని రోజులు గడిచిపోయాయి.

ఒకనాటి మధ్యాహ్నం మరికొంతసేపటికి బడి వదిలిపెట్ట బోతున్నా రనగా పోస్టుమేన్ కనిపించాడు. నాన్నగారి దగ్గరినుంచి నాకో వుత్తరం వచ్చింది. ట్రాన్స్ఫరుకోసం తీవ్రంగా ప్రయత్నాలు చేశామనీ, కొద్ది రోజుల

వ్యవధిలో ఆర్డరు రావచ్చుననీ నాన్నగారు వ్రాశారు. ఆ సంబరం నా చేత పోస్ట్‌మేన్‌కు పావలా బక్షీసు గూడా యిప్పించింది.

"మా రాజులు చల్లగుండాలి" అన్నాడు పోస్టుమేన్. కార్డులూ, కవర్లూ గూడా అప్పుగా పుచ్చుకునే వాళ్లేగానీ తనకో పైసా ధర్మంచేసిన వాళ్ళు లేరట! "వెళ్లొస్తానండీ! నరసయ్యగారింటికి వెళ్ళాలి. అమ్మగారికో మనియార్డరు వుంది" అంటూ వెళ్ళిపోయాడు. ట్రాన్స్ఫర్ రానున్న ఆనందం నన్ను నిశ్చలంగా వుండనిచ్చింది గాదు. బడికి సెలవు పెట్టాను. బస్సెక్కి రెండా మడల దూరంలోవున్న ఒక బస్తీకి వెళ్ళాను. అక్కడ రెండు రోజులు గడపి రంగాపురం తిరిగి వచ్చాను.

నరసయ్యగారింటి వాతావరణంలో ఏదో మార్పు వచ్చినట్టు తోచింది.

ఆ యింటి పిల్లల్లో సంచలనం తగ్గింది. ఆ మేరకు వాళ్ల ముఖాల్లో ఏదో దిక్కులు తోచనితనం కనిపిస్తోంది. మణి అన్నం తినలేదనో, వాసు స్నానం చేయకుండా వచ్చేశాడనో యింకా అలాంటి కారణాలపైన పెరటి గుమ్మందాకా వచ్చి ఒకటి రెండు మాటలు మాట్లాడి వెళ్తుండిన ఆ యింటి కోడలు పొలకువ పసిగట్టడానికైనా వీల్లేకుండా నా దృక్పథంనుంచీ పైదొలగి పోయింది. ఎటొచ్చీ క్రొత్త దుస్తుల్లో ముస్తాబై యింట్లోకి వూళ్లోకి చెడ దిరుగుతూ కనకాచలం ఒక్కడు మాత్రం ఉషారుగా కనిపిస్తున్నాడు.

ఈ మార్పుకు కారణమేమిటో తెలుసుకోడానికి రెండు రోజులుపట్టింది. మామగారి మనియార్డరు తాలూకు డబ్బులు పెట్టెలోవుండగా, కనకాచలం తీసి స్వంత డబ్బులాగా వాడుకున్నాడు. అందువల్ల ఉన్న వాటితోబాటు, భార్యాభర్తల మధ్య క్రొత్తగా యింకొక వైమనస్యం వచ్చిపడింది. కనకా చలం భార్యపైన చేయి జేసుకోబోయాడు. ఆవిడ ఒక పూట వంట చేయ కుండా సత్యాగ్రహం సాధించింది.

ఈ సత్యాగ్రహంవల్ల తాను, తన బిడ్డలు తప్పా మరెవ్వరూ దుర పిల్లక పోగా, ఆమె రెండో పూటనుంచీ వంటచేయక తప్పలేదు.

ఆమెకు ఒక విషయం మాత్రం చెప్పాలని వుంది. నా కిప్పుడు డబ్బుతో వచ్చిన అవసరమేమీ లేదు. భావిలో ఎప్పుడు వీలైతే అప్పుడు అప్పు చెల్లింపబడవచ్చు. (ఆ మాటకొస్తే అది చెల్లింపబడక పోవడమే నా కిష్టం) ఈ మాట కాస్తా ఆమెతో చెప్పేయాలన్న నా ప్రయత్నం ఒక్క-నాటిదిగాదు. ఏడెనిమిది రోజుల పొడుగునా అదే ప్రయత్నంలో వున్నాను. ఆమె కంటికే కనిపించకపోతే నేనేం చేయగలను? ఋణదాత మంచితనం వల్ల ఋణగ్రస్తుడి కేమంత నమ్మకం కుదరకపోతే-మనం ఆశ్చర్యపడ వక్కరలేదు. చివరికిదంతా రోకలి చేతబట్టుకుని గృహస్థుడు అతిథి వెంట పరుగెత్తిన కథలాగా పరిణమించింది. అతిధికి రోకలి యిచ్చేయ్యాలని గృహస్థుడి ఉద్దేశం. ఆ రోకలితో "బడితపూజ" జరుగుతుందేమోనని అతిధి అనుమానం.

పదో నాటికల్లా ట్రాన్స్ఫర్ ఆర్డరు చేతికొచ్చింది.

ఉద్యోగి కోరికపైన జరుగుతున్న బదిలీ గనుక జాయినింగు టైము గానీ, ట్రావెలింగు అలవెన్సుగానీ యివ్వబడలేదు. మరునాటి మధ్యాహ్నాని కల్లా నేను క్రొత్త చోట ఉద్యోగంలో చేరాలి. సాయంకాలం నాలుగు గంటల తర్వాత రంగాపురం రోడ్డులో బస్సులుండవు. ఆదరాబాదరా ఛార్జి లిస్టు తయారుచేసి బడి వస్తువులన్నీ మునసబుగారికి అప్పగించే సరికి గంట మూడు కావచ్చింది.

నరసయ్యగారింటికి వెళ్లాను.

ఏదో పెన్నిధిని పోగొట్టుకున్న వాళ్లకు మల్లే పిల్లలందరూ దిగాలుపడి ఎక్కడ వాళ్లక్కడ స్తబ్దులై కూర్చుని వున్నారు. తల్లి తరువాత వాళ్లకు ఉపాధ్యాయుడినైనా, చెలికాడనైనా నే నొక్కడినే. ఊరిపట్ల కలిగిన వైముఖ్యంవల్ల ఏమేమిటో అనుకున్నానుగానీ ఒక కుర్రవాడి అమాయిక హృదయానికి ఆనందాన్ని అందివ్వగలిగినా చాలు. ఎలాంటి బాధలకైనా తట్టుకో వచ్చు. ట్రాన్స్ఫర్ రద్దయిపోయినా బాగుండుననిపించింది. కానీ అందు కోసమని విశ్వప్రయత్నం చేసి, తీరా అది సాధింపబడిన తరువాత విధిగా

బదిలీని అంగీకరించక తప్పదు. ఎవరెలా దురపిల్లినా నేను రంగాపురం వదలిపెట్టడం తప్పనిసరి.

"వాసూ! వెళ్ళిపోతున్నాను బాబూ! అమ్మతో చెప్పిపోదామని వచ్చాను" అన్నాను.

"వెళ్ళిపోతున్నారా మేష్టారూ! మీరైనా క్షేమంగా వుండాలి...." గాజుల గలగల గద్గదికమైన కంఠం, ముఖం మాత్రమే ఈవలికి కనిపించింది-"మీకు డబ్బివ్వాలి. వీల్లేకపోయింది. చిరునామా చెప్పి వెళ్ళండి. సర్దుబాటుకాగానే పంపుతాను...."

నా కళ్లు గూడా చెమ్మగిల్లాయి.

లేచి నిల్చుని—"నమస్కారమండీ" అంటూ చేతులు జోడించాను. ఆమె దిగాలుపడి చూస్తుండగానే చరచరా వెలుపలకు వచ్చేశాను.

నా చిరునామా తెలుసుకోడంలో ఆమె ఉద్దేశం డబ్బును తిరిగి పంపడమే అయితే నా చిరునామా ఆమెకు తెలియకపోవడమే మంచిది.

వడివడిగా రంగాపురం నుంచి దూరంగా నడవసాగాను.



# కోరిన కోనలో కురవని వాన

ఏ కాలేజీ లెక్చరరయినా 'ఆకలి' ని గురించి 'థీసిస్' వ్రాయదలచుకుంటే నేనతడికి సత్తిరాజు పేరు రికమండ్ చేస్తాను. ఆంధ్రా-మైసూరు బార్డరు దగ్గర్లో ఎక్కడోవున్న ఓ చిన్నపల్లెలో అతడి పుట్టుక. అక్కడ రాగులు తప్పితే మరొక ఆహారధాన్యం పండదట! అదైనా వెలిపంట. అయిదారు చాళ్ళు దున్నిన మెట్టపొలాల్లో రాగులు చల్లేస్తే దేవుడి దయవల్ల సకాలంలో వర్షాలు కురిస్తే పంట దండిగానే పండుతుంది. ఆ రాగిపిండి వంటకానికి ఒక్కటే అనుపానం ఎండు మిరపకాయల చట్నీ. "ఎంత బాగుంటుందో నీకేం తెలుసు లేవయ్యా రామంబాబూ! ఒకసారి రుచి చూచావంటే జన్మానికి వదల్లేవు" అంటుండేవాడు సత్తిరాజు.

సత్తిరాజు ఎంతగా ప్రలోభపెట్టినా చప్పటి రాగి పిండివంటకంలోను, ఎండు మిరపకాయల గొడ్డుకారంలోను, గొప్ప గొప్ప రుచులు నిక్షిప్తమై వుంటాయని నేననుకోలేదు. కానైతే ఈ స్టేట్‌మెంటు వెనకాలవున్న సత్తిరాజు అంతర్యాన్ని మాత్రం సానుభూతితో అవగాహన చేసుకోడానికి ప్రయత్నించాను. ఈ సందర్భంలో నాకొక అరేబియా జానపద గాథ జ్ఞప్తి కొస్తుండేది. ఒకానొక ఎడారి వర్తకుడు తన బిడారు నుంచి విడిపోయి దారితప్పి, ఇసుకపర్రల్లో తిరిగితిరిగి అలసిపోయాడట! విపరీతమైన దాహ బాధతో అతడినాలుక పిడచగట్టుక పోయింది. గ్రుక్కెడు నీళ్ళు దొరక్కపోతే ప్రాణాలు గుటుక్కుమనేటట్టున్నాయి. అలాంటి విస్పృహాయ పరిస్థితిలో అతడికొకచోట బండరాళ్ళకు నడుమగావున్న గోయిలో కొద్దిపాటి నీళ్ళు కనిపించాయి. అత డా నీళ్ళను దోసిళ్ళ కొద్దీ త్రాగేశాడు. చిత్రమేమిటంటే అవి అతడిపాలిటికి అమృతంలా వున్నాయి. ఈ యిలాతలంపైన అంతటి మంచినీళ్ళు మరెక్కడా వుండబోవనుకున్నాడు. తాను త్రాగినంత త్రాగి మిగిలిననీళ్ళను తనదగ్గరవున్న తోలుసంచిలోకి నింపి, తీసుకెళ్ళి బాగ్దాదు నగర ఖలీఫాగారికి సమర్పించాడు. ఖలీఫాగారు త్రాగి చూద్దురుగదా! ఆ

పీళ్ళల్లో ఆయనకు చెప్పుకోదగ్గ మాధుర్యవిశేషమేమీ కనిపించలేదు. ఆయన కవి మామూలుగానే వున్నాయి.

ఒకానొక వస్తువు మానవుడికి రుచించడంగానీ, రుచించకపోవడం గానీ వస్తుధర్మంపైన ఆధారపడి వుండదు. ఆ వస్తువుయొక్క ఆవశ్యకత పైన ఆధారపడి వుంటుంది. పాపం, తన చిన్నతనంలో తిండికోసం ముఖం వాచిపోయి వుండేవాడేమో సత్తిరాజు! ఏ మాత్రం ఖాద్యపదార్థంలాంటి వస్తువు కనుపించినా ఆవురావురంటూ తినేసేవాడేమో!

వీలయినంత సున్నితంగానే నేనీ అభిప్రాయాన్ని ప్రకటించేవాణ్ణి.

"ఆ మాటెందుకు లేవయ్యా రామంబాబూ!" అనేసేవాడు సత్తిరాజు. అంటూ అంటూ పెండోరాస్ బాక్స్‌లాంటి తన జ్ఞాపకాల భోషాణాన్ని తెరిచేసేవాడు.

పిలవకపోయినా కరువులు. కాటకాలు వలికేచోట పుట్టి పెరిగాడు సత్తిరాజు. ఎండాకాల మొచ్చేసరికి అక్కడ బావుల్లో త్రాగుడునీరు సైతం అడుగంటుక పోతుండేది. ఊరికంతా మోతుబరి అయిన పెద్దరెడ్డి గారింట్లో పనీపాటా చేసుకుంటూ వుండేది సత్తిరాజు తల్లి. వాళ్ళు మిగిలితే అన్నం పెట్టేవాళ్లు. ఒకపూట తింటే, యింకొకపూట తినగలమన్న నమ్మకానికి ఆస్కారంలేని అనిశ్చిత పరిస్థితుల్లో గడచిపోయింది సత్తిరాజు బాల్యం.

"రామంబాబూ! ఆకులలములు మేసి బ్రతకడమంటే ఏమిటో ఎరుగుదువా?" అనేవాడు సత్తిరాజు.

"అదెలాగయ్యా?" అనేవాణ్ణి.

"మావూరికవతల మల్లేశ్వరుడి గుట్టలున్నాయి. ఆ గుట్టలు దాటుకుంటే దేవదారు కోన. చిక్కం భుజాన తగిలించుకొని, తెల్లవారుజామున్నే లేచివెళ్ళి పోయేవాళ్ళం. మధ్యాహ్నానికల్లా దేవదారాకుతో చిక్కంనిండి పోయేది. చిక్కం నిండడమంటే ఏమిటనుకున్నావ్! అది మాకు వారం పదిరోజుల మేత. ఏం లేదు. ఆకును బాగా ఎండతు వెయ్యాలి. ఉడక బెట్టాలి.

ఉప్పురాళ్ళు వెయ్యాలి. కమ్మగా వుండేటందుకు వేయశవగ గింజలు చిలి మిడిగానూరి అందులో కలిపెయ్యాలి. పచ్చిడాకుతిని. ఒక లోటాపీళ్ళు త్రాగేస్తే మళ్ళీ ఒకజాము పేపటిదాకా ఆకలి పీ దగ్గరికి రాదు....''

ఉండివుండీ యిలాగే తన అనుభవాల్లో ఒక్కొక్కటి నా చెవిలో వేస్తుండే వాడు సత్తిరాజు.

''రామంబాబూ! ఈతగడ్డలుతిన్నావా ఎప్పుడైనా?''

''అవెక్కడ దొరుకుతాయి!'' అనేవాణ్ణి.

''మార్కెట్టులో దొరకవులే! గెలవేస్తున్న ఈతచెట్టును చూచి లోపిగా మట్టలన్నీ కొట్టేయాలి. గునపంతో త్రవ్వి బోదెలోనుంచి గడ్డలు పైకి తియ్యాలి. ఈతగడ్డంటే ఏమిటనుకున్నావో రామంబాబూ! ఆకలిగావున్న ప్రాణానికి అది కలకండ పెళ్ళేననుకో!''

ఎన్నో సిద్ధౌషధాలను గురించి వినివున్నాను. సిద్ధులు కొందరు తమకు చేతనైన మహిమలద్వారా ఏవేవో అద్భుతకార్యాలు నిర్వహిస్తుంటారని గూడా నాకు తెలుసు. అయినా మందులుగానీ, మహిమలుగానీ ఆకలి బాధను శాశ్వతంగా నివారించలేక పోయాయి. ఆ కాడికి సత్తిరాజెంతో నయం. దేవదారాకు, ఈతగడ్డలు మొదలైన వాటిద్వారా క్షుద్బాధను తాత్కాలికంగానైనా జయించే ఉపశమన క్రియలను కనిపెట్టిన ఘనత నాకు తెలిసినంతలో సత్తిరాజుకే దక్కుతుంది.

చేతిపనులు కో ఆపరేటివ్ సొసైటీ వాళ్లు బజారువీధిలో ఒక సేల్స్ ఎంపోరియం ఏర్పాటుచేశారు. ఎసెసెల్సీలో ఫెయిలై, కడుపు చేతబట్టుకొని తిరుగుతున్న సత్తిరాజు వాళ్ళు కోరిన హిరణ్యాక్షవరాల కన్నిటికీ సమ్మతించి అందులో సేల్స్‌మాన్ వుద్యోగం సంపాదించాడు. నెలజీతం దెబ్బయి అయిదు రూపాయలు. ఎంత నాలీసుభోజనానికైనా పూటకు రూపాయ పెట్టవలసివచ్చేది. రెండు వేళలా టిఫిను చేయాలంటే యింకొక ముప్పై రూపాయలుండాలి. ప్రాణావసరమైన తిండికన్నా ముఖ్యంగా మరికొన్ని

బాదరబందీలు సృష్టించినందుకు మనం నాగరికతను కసిదీరా తిట్టుకోవాలి. ఆదిమయుగాల్లో మనిషి ఒక ఆటవిక జంతువుగా బ్రతికిన బంగారుకాలాన్ని గురించి తలపోస్తూ తన ఆక్రోశాన్నంతా వెలిబుచ్చేవాడు సత్తిరాజు. "చూడవయ్యా రామంబాబూ! అప్పట్లో మానవులు పచ్చిమాంసమే తిన్నారో, కాయగసురులే తిన్నారో మన కనవసరం. ఒకటిమట్టుకు నిజం. ఆనాటి మానవుడు వస్తువులతో మాడి మాత్రం చావలేదు. ఆకులో, బెరళ్ళో మొలకు చుట్టుకునేవాడు గనక బట్టలుకొనే తాపత్రయం అసలే లేదులే. ఆలే లేక పోతే చూలేమిటన్నట్టు యిక చాకళ్ళను గురించి. మంగళ్ళను గురించి వాడికి కాబట్టైవుండదు. నువ్వూ నేనూ అలా బ్రతగ్గలమా? ఎంతటి వాళ్ళకు లభించేదయ్యా అంతటి భాగ్యం!"

వాస్తుశాస్త్రంలో మయుణ్ణి చంపిపుట్టిన మహాశిల్పి ఒకాయన వుండేవాడు. ఆయన పేరు పెరుమాళ్ళు మేస్త్రి. తన సుదీర్ఘ జీవితంలో అనుభవపూర్వకంగా సంపాదించిన విజ్ఞానాన్నంతా వినియోగించి ఆయన పట్టణం పొలిమేరలో ఒక మూడంతస్తుల భవనరాజాన్ని నిర్మించాడు. వానలు కురిస్తే చుట్టూరా నీళ్ళు నిలిచి ఒక తటాకం ఏర్పడిపోతుంది. అప్పుడు చూడాలి దాని రామణీయకం! సముద్రంలో తెరచాపలేని పడవనైనా అనుకోవచ్చు. లేదా దాల్ సరస్సులో తేలియాడే గృహమనైనా అనుకోవచ్చు. షుమారుపాటి బలవంతుడొకడు ఈడ్చి ఒక తన్ను దన్నితే గోడలు. తలుపులు. పైకప్పు విరికి, పూడి, కూలి, అక్కడొక మట్టిదిబ్బ మాత్రం మిగిలిపోయే పరిస్థితి! ఆ కట్టడంలో పావురాళ్ళ గూళ్ళలాంటి గదుల్లో దిక్కుమాలిన పావురం సత్తిరాజు. ఈ పావురాల మీద విషూ పెట్టి ఆకాశంలో ప్రదక్షిణాలు తిరిగే డేగలాంటి వాడు పెరుమాళ్ళు మేస్త్రీ. సకాలంలో అద్దె చెల్లించలేక ఆ పావురం ఈ డేగచేత చిక్కి బిక్కిరించినప్పుడు సత్తిరాజును అడపా దడపా ఆదుకున్న వాళ్ళల్లో నేనూ ఒక్కణ్ణి. సత్తిరాజుకు అప్పుల్ని తిరిగి చెల్లించే సదుపాయాలు చాలా తక్కువ. అతడికి కాళ్లున్నాయి, చేతులున్నాయి ఎవరేపని చెప్పినా మారుమాట లేకుండా చేసిపెట్టేవాడు. కానీ మానవుడి శరీరశ్రమకు గూడా ఒక మూల్యం వుందన్న స్పృహలేని

సమాజంలో సత్తిరాజులాంటి వాళ్ళు ఋణ విముక్తులు గావడం ఎలా సాధ్యం? వాళ్ళు కొండంత కృతజ్ఞతను తలపైన మోస్తారు. ఆ బరువు క్రిందనే కృంగి పోతారు.

పెరుమాళ్లమేస్త్రీ గృహసామ్రాజ్యంలో నేనూ ఒక పౌరుడినే అయి నప్పటికీ హోదాలో సత్తిరాజుకూ నాకూ కొంత తేడా వుండేది. బిల్లుకలెక్ట ర్నిగా మునిసిపాలిటీ వాళ్లు నా కిచ్చే నూటపాతిక రూపాయలు చాలకపోతే యింటికి వ్రాసి పదో పరకో తెప్పించుకునే వెసులుబాటు వుండేది గనుక గుడ్డిలో మెల్లగా నేను కాస్తా దిక్కున్న సావురాన్ని. సత్తిరాజు గదికీ, నా గదికీ గట్టిఅట్టలాంటి గోడ ఒకటే అడ్డం. రాత్రివేళల్లో నా గదిలోకి వచ్చి కూర్చుని ఏవో కబుర్లతో కాలక్షేపం గావించే వాడు సత్తిరాజు. హైస్కూల్లో చదువుకున్న కాలంలో వారాల పిల్లాడుగా సత్తిరాజు గడించిన అనుభవాలు అన్నీ యిన్నీ కావు. పదిపన్నెండు కుటుంబాల మంచి చెడ్డల్ని అతడు క్షుణ్ణంగా బేరీజువేసి పెట్టుకున్నాడు. పెట్టిన తల్లికి నమస్కారాలు! పెట్టని పుణ్యాత్ము రాలిపైకి శాపబాణాలు! 'ఇంత ఆలస్యమైందేం బాబూ! రా కాళ్ల కడుక్కో'. అంటూ ఆదరించిన గృహిణికి అభినందనలు, 'వచ్చావూ! నువ్వొకడవి మాకు శనిగాడిలా దాపురించావు. ఈరోజు బంధువులొచ్చారుగానీ వెళ్లు వెళ్లు' అంటూ చీదరించుకున్న యింటావిడకు అభిశంసలు. ఇలా ఎంత సేపైనా సాగిపోతుండేది సత్తిరాజు ప్రసంగం. ఏ పన్నెండు గంటలప్పుడో నేను చిరాకుపడుతూ 'వెళ్ళి పడుకోరాదా సత్తిరాజూ!' అంటే 'పడుకుంటే' నిద్రపడుతుంది గనకనా! ఎనిమిది గంటలప్పుడు తిన్నతిండి పదింటికే జీర్ణ మైపోయింది, ఇప్పుడిక నాలుగరటి పళ్లుతిని అరసడి పాలు త్రాగితేగాని నిద్ర పడుతుందనే ఆశలేదు' అనేవాడు. "చాలించవయ్యా బాబూ! మనలాంటి సామాన్యుల కడుపుల్లో యింతింతలావు జఠరాగ్ని వుండటం ప్రమాదకరం అనే వాణ్ణి. "నన్నేం చేయమంటావయ్యా రామంబాబూ! నా కింత ఆకలిగా వుండడం ఎందుకని! దీనికంతకూ కారకురాలు మా అమ్మ. చచ్చి ఏ లోకంలో వుందోగానీ, బ్రతికి గనక వుంటే ఆమెపైన నేను కోర్టులో కేసువేసినా తప్పులేదు" అంటూ చివరి కతడు గాడిదపాలు వృత్తాంతాన్ని ఏకరువు పెట్టేవాడు.

"అసలేం జరిగిందంటే రామంబాబూ! నేను పుట్టేటప్పటికి మా కుటుంబ స్థితిగతులు కొంచెం మెరుగ్గానే వుండేవట! మాకొక రెండెకరాల కొంద్రగూడా వుండేదట! మా నాన్న చీట్లాటలో పడి ఆయనకాడికి అప్పులు చేస్తూ వచ్చాడట! వడ్డీలు పెరిగి. పెరిగి ఆ అసలుఫాయిదాల వరదలో ఆ ఆస్తికొట్టుకపోయింది. ఆ బెంగతోనే మానాన్న కాయలాపడి, కడకు కళ్ళు మూశాడనుకో! అదంతా వేరే కథ. ఇప్పుడు చెప్పొచ్చింది గాడిద పాలను గురించి. నేను పురిట్లో బిడ్డనుగా వుండగా మా అమ్మ వరుసగా మూడు రోజులు నాచేత గాడిదపాలు త్రాగించిందట! గాడిదపాలు త్రాగడమంటే ఏమిటనుకున్నావు? జీవితాంతం యిక జఠరాగ్ని నిద్రపోదన్నమాటే! కడుపులో రాళ్ళువేసినా జీర్ణమైపోవలసిందే! నిద్రపట్టని రాత్రుల్లో నాకిదే ఆలోచననుకో! అరణ్యవాసంలో వుండగా పాండవులకు సూర్యుడొక అక్షయ పాత్రను ప్రసాదించాడట! నా కలాంటి దొకటి దొరికినా బాగుండి పోవును! తెల్లవారేసరికి డజను యిడ్లీలు, పదిగంటలకు చక్కగా ఒక లోటా టొమాటో జ్యూసు, ప్రొద్దు నడిమింటికొచ్చేసరికి ఒక ప్లేటు బిర్యానీ. రెండో మూడో ఆమ్లెట్లు...."

"బాగుందిలే వరస! అయినా మానవుడికి అత్యాశ పనికిరాదు. ఇసుకలో పడుకుని పసిడిమేడలు కట్టుకోడమంటే ఏమిటో యిప్పుడు నీ మాటలద్వారా తెలిసొచ్చింది" అనేవాణ్ణి.

"పోపీ, జన్మకంతా శివరాత్రిగా ఒక్కటంటే ఒక్కరోజు, కనీసం ఒక్కపూటయినా తృప్తిగా అలాంటి భోజనం దొరికే అవకాశం మనకు దొరకున్నాడదా రామం బాబూ?" అంటూ నావైపు జాలిగా చూచేవాడు సత్తిరాజు.

తిండి తినడం, నిద్రపోవడం మొదలైనవి ప్రాణుల సహజధర్మాలు. ఆధునిక రాజ్యాంగాలు కర్మసిద్ధాంతాన్ని ఖాతరు చెయ్యవు గనుక మానవుడు కడుపునిండా తినాలనుకోడం చట్టరీత్యా నేరంగాదు. కాపీ హక్కుండడంతో ఏమయింది? అవకాశముండాలి గదా! అనేవాణ్ణి, 'అవకాశం తేరగా దొరుకుతుందా? దానికోసం వెతకాలి' అనేవాడు సత్తిరాజు.

"ప్రయత్నించు బాబు! నీ ప్రయత్నం ఫలిస్తే సంతోషిస్తాను" అన్నాను.

'యురేకా, యురేకా' అంటూ పరుగెత్తు కొచ్చిన ఆర్కిమెడీస్‌లా ఓ రోజు సాయంకాలం ఆనందం తృళ్లింతలాడుతున్న ముఖంతో వూడి పడ్డాడు సత్తిరాజు. "రామంబాబూ! దొరికిందయ్యా దారి కనిపెట్టేశానయ్యా ఉపాయం" అన్నాడు.

"అదేమిటో చెప్పవయ్యా బాబూ!" అన్నాను ఆశ్చర్యపడిపోతూ.

సత్తిరాజు చెప్పాడు.

అతడి ఉపాయమేమిటో విని నే నాదిలో పెదివి విరిచినమాట నిజమే! కానీ నింపాదిగా ఆలోచించినమీదట అదీ అమోఘమైన ఉపాయం గానే తోచింది. నీ కోరికల్ని నువ్వు నెరవేర్చుకోలేనప్పుడు, వాటిని నెర వేర్చగల వ్యక్తి చేతికిగాని, సంస్థ చేతికిగాని నీ జీవితాన్ని తీసుకెళ్లి అప్ప గించటంలో తప్పులేదు. కాస్త రిస్కుతో కూడిన వ్యవహారమే కావచ్చుగాక! ఆ మాత్రం రిస్కు తీసుకోకపోతే జీవితం ఒకచోట పడవేసిన గొంగడిలా జడప్రాయంగా వుండిపోతుంది.

మరునాటి వుదయం పదిగంటలకు మేము రిక్రూట్‌మెంటు ఆఫీసు ఎదుట తచ్చాడుతున్నాము. అందుకని వచ్చిన ఆఫీసరు ఎత్తు, బరువు, ఛాతీ మొదలైన వివరాలు నమోదు చేశాడు. ఒక డాక్టరుగారు ఆరోగ్య పరీక్షలు ముగించాడు. సాయంకాలం లిస్టువేస్తామన్నారు. ఆలోగా మిత్రుల నందరినీ ఒకసారి కలుసుకుని గుడ్‌బై చెప్పిరావాలనిపించింది. వెళ్లొద్దాం రమ్మని సత్తిరాజును పిలిచాను. అతడెందుకో ఉత్సాహంగా లేడు.

"ఏం చెప్పమంటావు రామంబాబూ! ఎక్కడికి వెళ్ళినా నా దుర దృష్టం నన్ను వెంటాడుతూనే వుంది. చిన్నప్పుడు మల్లేశ్వరి గుట్టపైన కాలుజారి పడ్డాను. మోకాటి క్రింద ఎముక విరిగింది. పుత్తూరు తీసుకెళ్ళి మా అమ్మ కట్టు గట్టించుకొచ్చింది. నేను కాలుకాస్త ఎగరేస్తూ నడుస్తుం

దడం అందుకే! డాక్టరుగారి విషయం పసిగట్టేశారు. కాలూ, చెయ్యీ సరిగ్గా లేనివాడు మిలిటరీకేం పనికొస్తాడు చెప్పు!"

అనుకున్నంతా అయింది. ఎన్నికైన వ్యక్తుల జాబితాలో సత్తిరాజు పేరు కనిపించలేదు.

మిలిటరీ ఉద్యోగుల వెంట బయల్దేరిన నాకు ప్లాట్‌ఫారంపైన నిలబడి సత్తిరాజు వీడ్కోలిచ్చిన సంఘటన అదొక విషాదోదంతంగా మనసులో నిలిచిపోయింది. "చూడావా సత్తిరాజూ! ఒకరు చేసిపెట్టిన ప్రయోగాన్ని అంది పుచ్చుకుని, యింకొకరు ప్రయోజనం పొందడమంటే యిదే! నువ్వు గనుక చొరవతీసుకోకుంటే నా బ్రతుకుబాట మారివుండేదేగాదు. జీవితంలో నిన్నెప్పటికీ మరచిపోలేను. సెలవుల్లో వచ్చినప్పుడు నిన్ను కలుసుకుంటాను. కులాసాగా ఒకటి రెండురోజులు కలిసి కాలక్షేపం చేద్దాం! వెళ్ళగానే అడ్రస్సు తెలియజేస్తాను. తరచుగా ఉత్తరాలు వ్రాస్తూ వుండు...."



"అలాగలాగే" అన్నాడు సత్తిరాజు.

ఆయితే అతడి దగ్గరనుంచి నాకు వచ్చినవల్లా రెండు మూడు ఉత్తరాలే! ఆరుమాసాల అనంతరం నేను మిలిటరీ క్యాంపునుంచీ అతడికి వ్రాసిన ఉత్తరం 'పేల్సెంపోరియం మూసివేశారన్న' రిమార్కుతో నాకు తిరిగి వచ్చింది.



* * *

పదేళ్ళ అనంతరం మళ్ళీ ఒకసారి ఆ పట్టణంలో కాలుమోపాను. నాటికీ నేటికీ నగరం బాగా పెరిగింది. అరణ్యంలో ఒక వనమూలికను కనిపెట్టినట్టుగా యింత పెద్దపట్టణంలో ఒక చిరునామా తెలియని వ్యక్తిని వెదికి పట్టుకోవడం చాలా కష్టమే! గడచిన పదేళ్ళలో, నేను దేశమంతటా కలియ తిరిగాను. రకరకాల వ్యక్తులను కలుసుకున్నాను. క్షేత్రాలు సందర్శించాను. ఎన్నో జీవితానుభవాలు గడించాను. ఇన్నింటికీ మూల కారకుడైన వ్యక్తిని కలుసుకోవాలన్న బలీయమైన కోరిక నన్నీనగరంలో దింపింది. అతడికి నేనెంతటి ప్రత్యుపకారం చేసినా చేయవచ్చు. సత్తిరాజు

అల్పసంతోషి. అతడికి సంతృప్తి కలిగించడం చాలా సులువు. తాను కోరుకున్న భక్ష్యభోజ్యాలతో ఒకపూట భోజన సుఖం చేకూర్చినా చాలు.

ఇంత దూరం వచ్చాక మళ్ళీ ఒక అనుమానం ఇంతకూ సత్తిరాజు యింకా ఈ పట్టణంలోనే వున్నాడా అని!

ఈ అసినాప్తి విచికిత్సతో ఒరిగేదేమీలేదని, ఆలోచన కట్టిపెట్టి, అన్వేషణలోకి జొరబడ్డాను. మొదట 'పేల్స్ఎంపోరియం వుండిన చోటికి వెళ్ళిచూచాను. ఇప్పుడక్కడొక చెప్పులషాపు తెరిచారు. పూర్వపరిచితులైన మిత్రులెవరైనా కనిపిస్తారేమోనని రోడ్లవెంట పడ్డాను. సందుల్లో గొందుల్లో తిరిగాను. అంతలో మిట్టమధ్యాహ్నం కావచ్చింది. వేళకాగానే పరుగెత్తుకుంటూ వెళ్ళి డైనింగు టేబిలు దగ్గర కూచోడానికి అలవాటు పడిన ప్రాణం! ఈ వూళ్ళో 'ఎల్లోరా' అన్న హోటలొకటి వుండాలి. అప్పట్లో రుచికరమైన వంటకాలకది పెట్టింది పేరు. ఆ తినుబండారాలపట్ల ప్రలోభపడి సత్తిరాజు 'ఎల్లోరా'లో సర్వరు వుద్యోగం దొరికినా బాగుండు నంటుండేవాడు.

ఓ రిక్షాను ఆపి 'హోటలెల్లోరా' అన్నాను.

కొద్దినిమిషాల్లో రిక్షా హోటలు ముందర ఆగింది.

హోటల్లో ప్రవేశించాను.

కౌంటరు దగ్గర కూర్చున్న వ్యక్తి నా వైపు ఎగాదిగా చూచినట్టే గుర్తు. కొత్త కస్టమర్లవైపు హోటలు ప్రొప్రయిటర్లు పరకాయించి చూడడం సహజమే! నేనా విషయాన్ని అంతగా పట్టించుకోలేదు. కౌంటరు దగ్గరకువెళ్ళి నిలబడి "ఇక్కడెంతండీ భోజనం రేటు!" అంటూ పర్సులోంచి డబ్బు పైకి తీయబోయాను.

ఆ పని చేయడానికి వీల్లేకుండా కౌంటరులో కూర్చున్న వ్యక్తి నా చేతిని గట్టిగా బంధించేశాడు—"ఎన్నాళ్ళకెన్నాళ్ళకయ్యా రామంబాబూ! నేనే నయ్యా సత్తిరాజుని! తలపైకెత్తి నా ముఖంలోకి చూడవయ్యా బాబూ!" అన్నాడు.

ఏం చెప్పాలో తోచక, ఆశ్చర్యం ఎలా ప్రకటించాలో స్ఫురించక చేష్టలుడిగి. గ్రుడ్లు తేలవేసి నిట్టనిలువునా స్తంభీభూతుడినై పోయాను.

"ఒరే చిట్టీ! అయ్యగారి కొక కుర్చీ తెచ్చి వెయ్యరా" అన్నాడు సత్తిరాజు. పైకిలేచి నన్నాకుర్చీలో కూచోబెట్టాడు. ఇంకా అక్కడే నిల్చున్న కుర్రాడితో "అయ్యగారికొక బాదాంఘీరు" అన్నాడు.

గ్లాసు ఖాళీచేసి వాపసుచేస్తూ "ఆశ్చర్యంతో ఎంతగా బుర్రకు వేడెక్కించినా మవ్విప్పించిన బాదాంఘీరు మట్టుకూ చల్లగానే వుంది" అన్నాను.

సత్తిరాజు నవ్వాడు.

ఆ నవ్వు అతడు నా పైన కుప్పించబోతున్న ప్రశ్నలకన్నింటికీ ఉపక్రమణిక లాంటిదని తరువాత తెలిసింది.

సాంతంగా నాకు సంబంధించిన విశేషాలన్నీ నేను చెప్పడమయింది. ఇక చెప్పడానికి మిగిలింది తన వంతే! తన దాకా వచ్చేసరికి సత్తిరాజు హోటల్లోవున్న అంతరంగికాగారానికి నన్ను తరలించాడు.

"ఇక్కడ గోడలకు చెవులుండవా?" అన్నాను.

సత్తిరాజు మరింత బిగ్గరగా నవ్వేశాడు.

"ఫరవా లేదులే! నా విషయం యిక్కడందరికీ తెలిసిన బహిరంగ రహస్యమే! కానీ నన్నుగురించి నేనే చెప్పుకోవలసి వచ్చేసరికి రహస్యం పటించడం అవసరమైంది. అసలేం జరిగిందంటే...."

టూకీగానే చెప్పి ముగించాడు. సత్తిరాజు చెప్పిన విషయంకన్నా, అతడా విషయం చెప్పినతీరే నా ఆశ్చర్యాన్ని ద్విగుణీకృతం చేసింది. ఉన్న వాస్తవానికి ఏ మాత్రం అదర్శాల కోటింగు వేయకుండా తనను గురించిన నిజాన్ని కుండబద్దలు కొట్టినట్టుగా వెల్లడించిన అతని నిష్కాపట్యం ఎదుట నేను దిగ్భ్రాంతికి లోనుగావలసి వచ్చింది. సేల్స్ ఎంపోరియమ్ మూసి వేశాక తాను నిరుద్యోగి అయిపోయాడు. ఉద్యోగం వూడిందని తెలియగానే

పెరుమాళ్ళుమేస్త్రీ గది ఖాళీ చేయించాడు. తిండికి ఠికాణా లేకుండా, నిల్చో డానికి నీడలేకుండా అతను నానాయాతనలకు గురి అయ్యాడు. ఆ సమయా నికి సరిగ్గా చెప్పకుండా పెట్టకుండా ఓ సర్వరు మహాశయుడు వుడాయించటం వల్ల ఎల్లోరాహోటల్లో ఓ ఖాళీ ఏర్పడి వుంది. ఆ ఖాళీని భర్తీ చెయ్యడానికి సిద్ధపడ్డాడు సత్తిరాజు. ప్రొప్రయిటరు సుబ్బయ్య శాస్త్రి జంకుగొంకుల తోనే సత్తిరాజును తన కొలువులోకి తీసుకున్నాడు. బజారుకు వెళ్ళి అంగడి సామాన్లు కొనితెస్తూ, మార్కెట్టుకు వెళ్ళి కూరగాయలు పట్టుకొస్తూ, సాయంకాలాల్లో జమాఖర్చు లెక్కలు వ్రాసిపెడుతూ సత్తిరాజు తన హోదాను పెంచుకున్నాడు. క్రమక్రమంగా సుబ్బయ్యకు అభిమానపాత్రు డయ్యాడు. వేర్వేరు పట్టణాల్లో సుబ్బయ్య కిలాంటివే మూడు హోట ళ్ళున్నాయి. డబ్బు కూడా దండిగానే వుంది. పగటిపూట చూస్తే, రాత్రి వేళ కలలోకివచ్చే రూపరేఖావిలాసాలతో భగవంతుడు సుబ్బయ్యకొక కుమార్తెను ప్రసాదించి వున్నాడనీ, ఆవిడ వెలపోవడానికి అవసరమైతే ఒక హోటలును త్యాగం చెయ్యడానికైనా అతడు సిద్ధమేనని సత్తిరాజు గ్రహిం చాడు. అలోగా ఈ కుర్రవాడు స్వయంగా హోటలు వ్యాపారాన్ని నడిపించుక పోగలడని సుబ్బయ్యకు కూడా నమ్మకం చిక్కింది.

"రూపవతి అయిన భార్య మొగుడికి శత్రువట! అయినా అందం ఎందుకు రామంబాబూ! అదేమైనా కొరుక్కుతినడానికి పనికొస్తుందా?"

అంతటితో ఈ ప్రసంగానికి స్వస్తి అన్నట్టుగా సత్తిరాజు పైకిలేచి పొడుగాటి తాళంచెవితో బిలువెత్తు రెఫ్రిజరేటరు తెరిచాడు. దాన్నిండా కొరుక్కుతినడానికి పనికొచ్చే వస్తువులే వున్నాయి.

కాలింగ్‌బెల్ నొక్కి హెడ్ వెయిటరుని పిలిపించాడు. "అరిటాకు తీసుకరా! అయ్యగారికి స్పెషల్ మీల్స్ వడ్డించు" అన్నాడు.

"మరి నీ సంగతి?" అన్నాడు.

"మొదట అతిథికి చెల్లించాల్సిన మర్యాద చెల్లించనివ్వు! గృహ స్థుడి సంగతి తర్వాత...."

ఆకు చుట్టూ కొలువైన వంటకాలవైపు చూస్తూ "మొత్తానికి మన బ్రతుకుల్లో ఏదో సామ్యమున్నట్టే వుందిలే సత్తిరాజూ నేను మిలిటరీలో చేరాను. నువ్వు మిలిటరీ హోటలు నడుపుతున్నావు" అన్నాను.

"నీ మిలిటరీ ప్రతాపాన్ని భోజనం పైన చూపించు మరి...."

ఖాళీ అయిపోయిన ప్లేట్లను మళ్ళీ మళ్ళీ అదే పదార్థాలతో నింపిస్తూ "ఏదీ, దీన్ని తిను! దాన్ని నంజుకో! అదింకా ముట్టుకోలేదే నువ్వు! ముందుగా దీన్ని ఖాళీ చేసెయ్" అంటూ తీవ్రంగా పర్యవేక్షణ కొనసాగించాడు.

"బాబూ, నీకొక నమస్కారం! నేనింక నీ పరీక్షకు తట్టుకోలేను" అంటూ వేడుకోటం మినహాగా గత్యంతరం లేకపోయింది.

చేయి కడుక్కుని తిరిగొచ్చేసరికి టేబిలు శుభ్రమై పోయింది. సత్తిరాజు ముందరమాత్రం ఒక ప్లేటు అందులో ఓ చిన్న కాగితం పార్శెలు.

ఓ గిన్నెలో సాంబారు తీసుకొచ్చి బల్లపైన పెట్టి వెళ్ళాడు వెయిటరు.

ఆ పాటికి సత్తిరాజు పార్శెల్ విప్పేశాడు. అందులోనుంచి ఓ రొట్టెముక్క బయటపడింది.

"ప్రస్తుతం యిదేనయ్యా నా ఆహారం. అనుపానంగా ఉప్పూ కారం తగ్గించిన సాంబారు మాత్రమే వాడుకోవాలి. ఇంతకుమించి మరేది తిన్నా మొదటికే మోసమని డాక్టర్ల సలహా! వెరసీ సారాంశ మేమిటంటే తినేవాళ్ళవైపు చూడ్డమే యిప్పుడు నాకు మిగిలిన ఆనందం...."

ద్వారబంధానికి కాగితం పువ్వుల తోరణం కట్టినట్టుగా వెలవెలపోతున్న నవ్వొకటి సత్తిరాజు పెదవులపైన విరిసింది!



# కామదహనం

ప్రతి మానవుడి బీరువాలోనూ ఒక అస్తిపంజరం దాగివుంటుందట! వినడమేగాని నేనెప్పుడూ కళ్ళతో చూడలేదు. పుస్తకాలు, బట్టలు, నగలు మరేదైనా విలువైన వస్తువు బీరువాల్లో వుండడం నేనెరుగుదును. ఐనా బీరువాదాకా వెళ్ళడం ఎందుకు! అస్తిపంజరం మానవుడి శరీరంలో వుంటుందని నాకు వికరంగా తెలుసు.

కానీ మనిషితో వ్యవహరిస్తున్నప్పుడు ఆ వ్యక్తి శరీరంలో ఒక అస్తి పంజరం వుందన్న భావం మనలో లేశమాత్రంగానైనా వుండదు. చెవుల్ని శ్రీకారాలంటాం. కళ్ళు కమలాలంటాం. నాసికను నువ్వు పువ్వంటాం. పెదవులు దొండపండంటాం. కంఠం శంఖమంటాం. కాని అస్తిపంజరం జోలికి వెళ్ళము. నేను బల్లగుద్ది చెప్పగలను? ఏ ఎక్స్‌రే ద్వారానయినా ప్రియురాలి అస్తిపంజరాన్ని ఫోటోతీసి చూపిస్తే, అసహ్యించుకోకుండా వుండగలిగే ప్రేమికుడుండడు!

రహస్యాలు అస్తిపంజరాలలాంటివేమోనని నా అనుమానం.

వికృతమైన అస్తిపంజరాన్ని స్నిగ్ధసుందరమైన శరీరంలో దాచు కున్నట్టుగా, ప్రతి మానవుడు తన నాగరిక ప్రవర్తనకు, సభ్యతాయుత మైన సంస్కారానికి వెనుక కొన్ని వ్యక్తిగత రహస్యాలు దాచుకుని వుంటా డనా నా ఊహా (కాకపోతే అపోహ)

రహస్యాలు పెద్దవీకావచ్చు, చిన్నవీ కావచ్చు లోకంలో ఖూనీలు జరుగుతున్నాయి. దొంగతనాలు దోపిడీలు జరుగుతున్నాయి. చటవిరుద్ధమైన వెయ్యిదురాగతాల్లో శిక్షాస్మృతికి దొరికే వెన్ని? తప్పించుకునేవెన్ని? ఇలా తప్పించుకున్న దుర్భయాలన్నీ స్వంత బీరువాలాంటి మనసులోపలి మూల గదిలో రహస్యాలుగా నిక్షిప్తమై వుండిపోతున్నాయి. అగ్నిసాక్షిగా పెళ్లాడిన ధర్మపత్ని సైతం ఆ మూల గదిలోనికి తొంగిచూడ్డానికి వీలులేని కేసు లున్నాయి. పోనీ పెద్ద రహస్యాల సంగతి వదిలేద్దాం. కొన్ని చిన్న

రహస్యాలుంటాయి. ఇవి బహిర్గతం కావడం అంత అపాయకరమేమీకాదు. కాని యిదొక ప్రతిష్ఠకు సంబంధించిన వ్యవహారంలాగా యిలాంటి రహస్యాలను వదిలపరచుకోవడం రివాజు. ఒక పెద్ద మనిషి వున్నాడు. అతడు గుట్టు చప్పుడుగా మట్టిబెడ్డలు మింగేస్తుంటాడు. ఆ పని చేయకుండా వుండనూలేడు. తనలా చేస్తున్న విషయం లోకానికి తెలిస్తే ఆ నామోషీతనాన్ని భరించనూ లేడు. మట్టి బెడ్డలు ఖాద్య పదార్థాల కోవకుచెందినవి కావు. వాటిని మెసవడం లోకుల దృష్టిలో అసహ్య కారణం. అందువల్ల యిదొక రహస్యక్రియగా నిర్వహించవలసి రావడం సబబే! కానీ ఉత్తపుణ్యానికి కొందరు బుద్ధిమంతులు చాలా మామూలు విషయాలకు కూడా రహస్యపు బురఖాలు తగిలించేస్తుంటారు. ఒక సిగరెట్లు కాల్చడమే తీసుకుందాం. సంఘంలో ఫ్రమ్ టాప్ టు బాటం—ఈ పని చాలామంది చేస్తున్నదే! కాని ఒక్కొక్క వ్యక్తి సిగరెట్లతోనూ అగ్గిపెట్టెతోనూ పురబాహ్య ప్రదేశానికి చిత్తగించి, అక్కడ వరుసగా పది సిగరెట్లు మసిచేసి దారిలో రెండుకిళ్ళీలు సేవించి యింటికి తిరిగివస్తూ ఈ ధూమసేవా వినోదాన్ని దొంగనోట్లు అచ్చువేసేటంత రహస్యగా కొనసాగిస్తుంటాడు. మరికొందరికి యింగ్లీషు సినిమాలకు వెళ్ళడంకూడా రహస్యమే. అంతెందుకూ. ఇలస్ట్రేటెడ్ వీక్లీలో "చందమామ" నుంచుకుని రహస్యంగా చదువుకునే వయోధికుల్ని నే నెరుగుదును.

కానీ మా చలపతి జీవితంలో రహస్యాలు దాగివుండవచ్చునని నేనెన్నడూ అనుకోలేదు. చలపతి నాకు బంధువుకాడు. మిత్రుడు. బాగా కలిగిన కుటుంబం. స్వస్థలంలోనే మంచి ఉద్యోగం. వయస్సులో, నాకన్నా ఏడెనిమిదేళ్ళు చిన్నవాడు. మాకిద్దరికీ లంకెకలిపిన విచిత్రవస్తువు సాహిత్యం. నేను మంచి పుస్తకాల చిరునామాలు మాత్రమే సేకరించేవాణ్ణి! వాటిని కొనగలిగే అర్థబలమూ. ఆసక్తీ రెండూ వున్నాయి చలపతికి. చదివిన పుస్తకం పైన అభిప్రాయాలు చెప్పుకోడానికొక శ్రోత కావాలి. నాలాంటి వాళ్ళు కనిపిస్తే చలపతికి జన్మ జన్మాల బంధువులే కనిపించినట్లు: కావలిస్తే ఆఫీసుకు సెలవుచీటీ అయినా పంపి తాను సాహిత్య ప్రసంగాల్లో మునిగి

పోవడానికి తయారు. చలపతి ఊహలో సాహిత్య గోష్ఠి ఒక్కటే సత్కార్యం.

పాపం, అలాంటి చలపతికి ఒక్కొక్కప్పుడు సెలవుచీటీ పంపినా సెలవు దొరికేది కాదు. వీల్లేదు, పలానా అర్జంటు పనుంది. తప్పకుండా ఆఫీసుకు హాజరు కావలసిందే నంటూ జవాను కబురు తెచ్చేవాడు. అలాంటి పరిస్థితిలో చూచి తీరవలసిందే చలపతి ముఖం నెల జీతానికి పాలుమాలి, ఒడలవి కుర్చీకమ్ముకునే దురవస్థ శత్రువుకైనా వద్దుబాబూ అన్నదే ఆ ముఖ భంగిమకు వ్యాఖ్యానం. కాని ఉద్యోగం పురుష లక్షణంగాదా! వదలుకుంటే మళ్ళీ దొరికేది గనుకనా! అందువల్ల భుక్తిమీద వలపు. బ్రాహ్యంబుతో పొత్తు అన్నట్లుగా యిటు సాహిత్యమూ, అటు ఉద్యోగమూ రెండూ వదలకుండా పట్టేసుకున్నాయి చలపతిని. నువ్వు గదిలో కూచుని హాయిగా చదువుకుంటూ వుండు, గోపాలం. నేనా ఆఫీసు పైళ్ళ అరణ్యంలోనుంచీ అయిదింటికే వచ్చేస్తానులే...." అంటూ వెళ్ళిపోయేవాడు.

చలపతి అంతరంగికాగారంలో ఏకాంతంగా గడిపే అవకాశం నాకా విధంగా లభించింది.

"కాదంబరి కావాలన్నావుగదూ. ఆ పెట్టెలో వుంది తీసుకో. మొన్న తెప్పించిన పుస్తకాలు ఆ అలమరాల్లో వున్నాయి చూడు...." వ్యవధి లేక పోవడంవల్ల పుస్తకాల ఆ చూకీ మాత్రంచెప్పి ఆదరా బాదరా వెళ్ళిపోతుండే వాడు చలపతి.

ఆ గదిలో పెట్టెలున్నాయి. అలమరాలున్నాయి. వాటి నిండుకూ పుస్తకాలే వున్నాయి. ఆ పుస్తకాలకూ, నాకూ తలుపులూ, తాళాలూ అడ్డుగా లేవు. అందువల్ల కావడానికది చిన్నగదే అయినా నాకొక సామ్రాజ్యంలా వుండేది.

కానీ, ఎంతటి సామ్రాజ్యంలోనైనా జన జీవనానికి ఉపయుక్తంగాని ఎడారులు, శుష్క పర్వతాలు కొన్ని వుండకపోవు. సరిగ్గా నా పాలిటి కలాం టిదే ఒక బీరువా ఆ గదిలో వుంది. అది చలపతి స్వంత బీరువా. విధిగా

దానికొక తాళం వ్రేలాడుతుంటుంది. తాళంతీసి బీరువాలోనుంచి చలపతి దుస్తులుతీసుకోడం నే నొకటి రెండుసార్లు చూచాను. పుస్తకాలు గాకపో యిన తర్వాత అందులో ఎలాంటి విధి విశేషాలున్నా ఆ సంగతి నా కనవ సరం. ఆ బీరువా నాకెందుకూ కొరగాని ఒక వస్తు విశేషం.

కానీ ఉన్నట్లుండి ఒకనాడు నేనా బీరువాను గురించిన ఊహను మార్చు కోవలసి వచ్చింది. ఆఫీసుకు వెళ్లే తొందరలో చలపతి దానికి చిలుకువేసి తాళం తగిలించడం మరిచిపోయాడు. పైన ఫాన్ కూడా ఆన్‌చేశానేమో, బీరువా తలుపులు మెల్లగా ఒకటి రెండంగుళాల మేరకు తెరుచుకున్నాయి. ఎలాంటి రహస్య ప్రదేశంలో దాచిపెట్టినా పుస్తకాలను పసిగట్టే అతీంద్రియ శక్తి ఒకటి నాకుందని నాకో నమ్మకంవుంది. ఆ విశ్వాసాన్ని వమ్ముచేసిన ఘనత మా చలపతి కొక్కడికే దక్కింది. తలుపుతెరచి చూద్దును పరిగదా, బీరువాలో ఒక అరవిందుకు నన్ను వెక్కిరిస్తున్నట్లుగా పుస్తకాలే కనిపిం చాయి. వార, పక్ష, మాస పత్రికలు పుస్తకాలన్న వర్గీకరణం క్రిందికి వస్తాయోరావో నాకు తెలియదు. ఆ పుస్తకాల్లో ముప్పాతికా మువ్వీసంవంతు పత్రికలే. ఓ పత్రికను పైకితీశాను. ముఖచిత్రంకేసి చూచాను. ఎవతో పాపంలే జవ్వని! నేను జాలిపడడం ఆవిడ సరైన తిండిలేక చిక్కిపోయి వుందనికాదు, ఆ యాస్పెట్‌లో ఆమె సర్వాంగసుందరంగా వుంది. నూటికి నూరు మార్కులు నిలబెట్టి వసూలు చేయగల అంగసౌష్ఠవం ఆమెది! కాని తిండి తర్వాత మనిషికి బలం ప్రధానం గదా! ముఖచిత్ర సుందరి ఒంటిపైన మూరెడు బట్టయినా లేకపోవడమే విధివైపరీత్యం! పెంచి, పెద్దచేసిన కన్న బిడ్డను దిసమొలగా వీధులవెంట పడడానికి సమ్మతించే తండ్రి లోకంలో ఉంటాడా? ఉన్నాడు. ఈ ముఖచిత్ర సుందరిని సృష్టించిన చిత్రకారుడు చేసిన పనే అది! కన్నుదోయికి అన్యకాంతలడ్డమైతే మాతృభావం చేసి మర లడం ఎవరికో మానవోత్తములకే సాధ్యమనుకుందాం. కానీ ఎంత మానవ మాత్రులకైనా దిశమొలగా ఒక ఆడదిగాని, లేదా మగవాడుగానీ ఎదురైతే కళ్ళు మూసుకోవాలనే అనిపిస్తుంది. కాని నేనొకటి రెండు నిముషాలు అని మిష నేత్రాలతో ఆ బొమ్మవైపు చూచాను. అంతసేపలా చూడగలిగానంటే

అందుకు కారణం నా చుట్టుపక్ల ఎవ్వరూ లేకపోవడం! హఠాత్తుగా నాకో సత్యం తెలిసింది. పదిమందితో కలిసి వున్నప్పుడు చేయలేని పనులు కొన్నింటిని మనం ఏకాంతంలో చేయగలమన్న మాట! ఆ ముఖచిత్రంలోని జవ్వనికూడా ఎక్కడో ఏ బాత్ రూంలోనో, పడకగదిలోనో యిలా వుండి వుంటుంది. అందుకని ఆమెను పట్టితెచ్చి యిలా ముఖపత్రం పైకెక్కించి బజారుపాలు చేయడం ఏం న్యాయం? ఐనా ఈ ముఖచిత్ర మీమాంసలోనే కొట్టుమిట్టాడుతూ కూచుంటే ఈ పత్రికను ఆద్యంతంగా చదివి చూడడ మెప్పుడు?”

గబగబా పుటలు తిరగవేశాను. ఆ పత్రికలో కథలకన్నా బొమ్మలే ఎక్కువ. పేజీకొక బొమ్మ. ప్రతి బొమ్మలోనూ ఒక కొమ్మ. ఆ కొమ్మకొక పురుష వృషభుడు అంటిపెట్టుకుని వుండడం తప్పనిసరి. ఏ దేశ చరిత్ర చూచినా ఏమున్నది గర్వకారణం అంటాడు అభ్యుదయ కవి. ఇందులో ఏ బొమ్మను, ఏ కొమ్మను చూచినా కళ్ళకు కొట్టవచ్చినట్లుగా కనిపించేది బట్టల కొరత భయానక స్వరూపమే! మానవులు దిగంబరంగా సంచరించడం పది వేల సంవత్సరాల క్రిందటి మాట. ఇప్పుడలా అంత ధైర్యంగా దిగంబరులుగా తిరిగేవాళ్ళు లేకపోయినా, ఆ వాంఛమాత్రం ఏ కొందరిలోనో వున్నట్టే వుంది-ఈ బొమ్మల తీరుతెన్నుల్నిబట్టి చూస్తే! ఈ హావభావవిలాసాలు, ఈ ఆలింగ చుంబనాదులు ఈ శృంగార క్రీడలు లోకంలో లేనివికావు కాని పట్టెమంచం పడక గదిలోనే వుండాలి. స్త్రీ పురుషులు లోపలికి వెళ్ళగానే తలుపులు మూసి వేయబడాలి. ఎవరి శృంగార జగత్తు వారిదిగా ఆ రహఃకేళీ రహస్యాలు వాళ్లకు, వాళ్ల పడక గోడలకే పరిమితంకావాలి. అలా కాకుండా పట్టెమంచాన్ని తీసుకొచ్చి యిలా పబ్లిగ్గా నాలుగు రోడ్ల కూడలిలో వేసుకుంటారా ఎవరైనా? అందునా నాగరికత అత్యున్నత శిఖరాలను అందుకుంటున్నట్లుగా భావింపబడుతున్న ఆధునిక సమాజంలో జరగవలసిన పనేనా యిది?

ఎందుకైనా మంచిదని నేనా పత్రికలోని కథల్నికూడా చదవదలచుకున్నాను. శ్రద్ధగా ఐదారు కథల్ని చదివి ముగించిన తర్వాతనే ఊపిరి త్రిప్పుకున్నాను. ఈ రచనల్లో లేనిదీ, వున్నదీ కూడా ఒక్కటే! లేనిది వైవిధ్యం

ఉన్నది సంభోగ శృంగారం. నదులన్నీ సముద్రాని కభిముఖంగా పరుగెత్తి నట్లుగా ఈ కథలోని సంఘటనలకన్నింటికీ చరమలక్ష్యం సంభోగ శృంగారం. ఇందులోనూ ఒక తమాషా. ఈ కథలనుబట్టి చూస్తే భార్యాభర్తల మధ్య శృంగారం తన విశ్వరూపాన్ని ధరించే వీలేలేదు. విటీవిటుల మధ్యనే అది సాధ్యం. ఈ విటీవిటులలో కూడా ఎంత వయో తారతమ్యముంటే అంత మంచిది. సహజ పరిణామాలకన్నా ఆకస్మిక, యాదృచ్ఛిక సంఘటనలకే ప్రాధాన్యం. భార్యాభర్తలు పడకగదిలోనే కలుసుకుంటే అది వట్టి చప్పుకథ. స్త్రీ పురుషులు (ఇంతకుమునుపు ముఖమెరుగని వాళ్ళయితే ప్రశస్తం) ఏ సినిమా థియేటరులోనో, రైల్వేస్టేషనులోనో కలుసుకుంటే ఆ కథ అక్కడితో రసకందాయంలో పడినట్లు. ఈ కథలోని మగవాడి నిఘంటువులో కులాంగన, సౌశీల్యం, పాతివ్రత్యంలాంటి పదాలు మచ్చుకైనా కనిపించవు (అతగాడు సాధారణంగా ఒంటరిగా ఓ గదిలో వుంటాడు. చుట్టుపట్ల గాలాలు వేస్తాడు) లోకం లోకమంతా వేశ్యావాటికగానే భావిస్తాడు. అందుకు తగ్గ వాళ్లే ఆడమనుషులు కూడా! వాళ్లు శరీరాన్ని గుడి అనుకోరు. సత్రమను కుంటారు. ఊర్వశిలా వాని వరుసల్ని లెక్కపెట్టరు. శూర్పణఖలా పరాయి మగవాణ్ణి ప్రథమ వీక్షణంలోనే కామిస్తారు. వరూధినిలా ఆ యింపే పర బ్రహ్మమనీ, అంతకంటే కావలసిందేమీ లేదనీ అనేస్తారు. కానీ పైన పేర్కొన్న పురాణాంగనలకు తమ ప్రయత్నంలో కృతకృత్యత లభించినట్టు మనం వినలేదు. కానీ యిక్కడి ఊర్వశులకు, వరూధినులకు, శూర్పణఖలకు ఆ లోటు లేనేలేదు. అలాంటి మగవాళ్లు, ఇలాంటి ఆడవాళ్లే యిక్కడ హీరో, హీరోయిన్లు.

బస్సుల్లోను రైళ్ళలోను కొందరు యువకులు యితరుల కంటపడ కుండా జాగ్రత్తపడుతూ ఎంతో దీక్షగా పుస్తక పఠనంలో నిమగ్నులై కనిపిం చడం నా కప్పుడు జ్ఞప్తికి వచ్చింది. బస్సుల్లోకి రైళ్ళల్లోకి రాగలిగినవి యిండ్లలోకి దారిచేసుకోక పోతాయా? చదివినా అర్థంగాక పోవడానికి అవేమైనా ప్రబంధాలా? అక్షరం తెలిసిన ప్రతి వ్యక్తికీ యిది అందుబాటులో వున్న సాహిత్యమే!

తరచుగా యిలాంటి అవకాశాలు లభించవు గనుక పనిలో పనిగా మరి

కొన్ని పత్రికలు చూచిగానీ నేను బీరువా మూసివేసే వుద్దేశంలో లేను. పాన కంలో పుడకలా ఓ పత్రిక తిరగవేస్తుండగా అందులో ఒక ఉత్తరం కని పించింది. కవరుపైన టైప్ చేయబడివున్న చిరునామా చూడగానే ఏదో అను మానం కలిగింది. అప్రయత్నంగానే కవరులోనుంచి కాగితం తీశాను. అది ఆ పత్రికవాళ్లు చలపతికి వ్రాసిన ఉత్తరం-"మీరు కోరినట్టు మీ రచనలన్నిం టినీ "కామవర్ధన్" అన్న మారు పేరుతోనే ప్రచురించగలము. పోయిన నెల ప్రచురింపబడిన మీ కథ. "జవ్వని నవ్వింది" చాలా బాగుందని మా కార్యా లయానికి వందలకొలది జాబులు వచ్చాయి. మా అభినందనలు స్వీకరిం చండి"-ఇలా పూర్తయింది ఉత్తరం. నా ఆలోచనకు మాత్రం ఆనకట్టపడి నట్లే అయింది.

"బాల్యక్రీడలు కొన్నినాళ్ళు. భామా కుచాలింగనో పరిరభ్యున్నతి కొన్నిన్నాళ్ళు" అన్నారు. చలపతికి బాల్యక్రీడల వయస్సు దాటిపోయింది.

"మారుడు మనవాడుకాడు, అతడు
తన మామతో జతచేరినాడు"

అన్న విరహ వర్ణనలోని చందమామ కాలానికి చిహ్నం; ఈ న్యాయాన్నిబట్టి ఇది చలపతిలో కాముడుపుట్టి ప్రవర్ధమానం కావడానికి తగిన అదనే కానీ అమాయకుడిలా కనిపించే చలపతిలో కాముడింత భయానకంగా పుట్టాడా? ఇంత భీభత్సంగా వర్థిల్లుతున్నాడా? కామం పొగరుబట్టిన గుర్రం. మంచి పగ్గం బిగించి అదుపులో పెట్టుకోకపోతే ఈ గుర్రం రథాన్ని ఏ గోతిలోనైనా తోసివేస్తుంది. పగ్గం తగిలించటంలో విలంబనం జరిగినకొద్దీ ప్రమాదమే!

పైకితీసిన పత్రికలన్నింటిని బీరువాలో భద్రపరిచి తలుపులు మూసే శాను.

పుస్తకంపైన నిలవడానికి బుద్ధి మొరాయించింది. గదిలో పచార్లు ప్రారంభించాను. మనసు పరిపరి విధాల పరుగిడుతోంది. శవిగ్రహం పట్టు కుంటే ఏడేళ్ళు వదలదట. ఇదివరకు చూసిన బొమ్మలు, కథలో వచ్చిన పాత్రలు, దృశ్యాలు ఎంతగా వద్దనుకున్నా మళ్ళీ మళ్ళీ మనసులోకి వస్తు

న్నాయి. అమ్మో, అందులో ఏదో మాదకద్రవ్యం వున్నట్టే వుంది. ఈ విషానికి విరుగుడేమో తెలియడంలేదు. కాసేపు వెలుపలికి వెళ్ళి వద్దామను కున్నాను. హాల్లో వేంకటరామయ్యగారు కనిపించారు.

"రావయ్యా శేఖరం! ఐనా ఆ పుస్తకాల్లో ఏముందిగానీ కాసేపు పిచ్చాపాటి మాట్లాడుకుందాం కూర్చో. నా కిన్నేళ్ళొచ్చాయి గదా, పట్టుమని ఒక పుస్తకం చదివి ఎరగను, న్యూస్ పేపరు మాత్రం ఎడిటర్ అండ్ ప్రింటర్ దాకా చదివేస్తుంటాను. తీరిగ్గా వున్నప్పుడల్లా పడుకొని నిద్రపోవ టమే నా పని. అంతగా నిద్రపట్టలేదనుకో. మాట్లాడుతూ కూర్చుంటాను. మాటాడ్డానికి మనుషులే వుండాలన్న పట్టింపులేదు. కుక్క, పిల్లి, ఎలుక ఏది కనిపిస్తే దానితో మాట్లాడేస్తుంటాను. ఈ పుస్తకాలు చదివే దుర్గుణం ఎలాగో మా చలపతికి ఒంటబట్టింది...."

దొరికిన అవకాశాన్ని జారవిడువకుండా "మరయితే తొందరగా పెళ్ళి చేసేస్తే దుర్గుణం తగ్గుముఖం పట్టవచ్చును గదండీ!" అన్నాను.

"అయ్యో రాత! వాడికా ధ్యాస ఎక్కడిది నాయనా!" వంటగదిలో నుంచీ హాల్లోకివస్తూ అందుకుంది శాంతమ్మ. "పెళ్ళి మాట ఎత్తితే చాలు తుర్రున పారిపోతాడు. మొన్నటికి మొన్న మా మాలతి వచ్చి పదిరోజులుండి పోయింది గదా? మాలతంటే మా అన్నయ్య కూతురు. వీడికి దాన్నే చేసుకో బోతున్నాములే! అది పెరట్లోవుంటే వీడు వీధిలో! అది వీధిలోవుంటే వీడు పెరట్లో!...."

ఆడగాలి తాకిడికి అంతగా చెదిరిపోయే చలపతిలో బూతుకథలు వ్రాసే "కామవర్ధన్" దాగివుండడం విచిత్రమే!

* * * *

మారుపేరుతో చలపతి శృంగార సాహిత్యం సృష్టిస్తున్నాడని లోకా నికి తెలియదు. తన ఊహాలోకపు యిష్టభోగ విహారాలను ప్రచ్ఛన్నంగా ఒక అజ్ఞాత పాఠకుడు గమనిస్తున్నాడని చలపతికి తెలియదు. తనలోని కామవర్ధనుడు యథేచ్ఛాప్రణయలీలల్లో తేలిపోవడంలో పరమానందం పొందుతుం

డగా నిజజీవితంలో చలపతి ఆ ఆనందానుభవాన్ని చూరగొనడానికి వీలుగా ఒక సంఘటన జరిగింది.

ముసుగులో గుద్దులాట లెందుకు—ఆ సంఘటన పేరే పెళ్ళి!

పెళ్ళికోసం చలపతి రెండుమాసాలు సెలవు పెట్టాడు.

చలపతికి నలుగురు అక్కచెల్లెళ్ళున్నారు. మాలతీ దంపతులు తమ హనీమూన్ కాలంలో ఒక్కొక్క ఆడపడుచు యింట్లో ఒక్కొక్క వారం గడపవలసివచ్చింది. మిగిలిన పది పదిహేను రోజుల్లోనూ వాళ్ళ శ్రీరంగం, శివసముద్రం, బెంగుళూరు, బృందావన్‌లాంటి రమణీయ ప్రదేశాలు సందర్శిస్తూ ముచ్చటగా చక్కర్లు కొట్టివచ్చారు.

హనీమూన్ ఆనందంగా గడిచినట్లు, తాను మళ్ళీ ఉద్యోగంలో జాయినైనట్టుగా వ్రాశాడు చలపతి.

పత్రికలో ఒకటి రెండు మాసాలుగా కామవర్ధన్ కథ లేవందుకు ఒక పాఠకుడు విచారాన్ని వెలిబుచ్చుతూ వ్రాసిన ఉత్తరాన్ని "లేఖావళి" శీర్షికలో చూచాను. కామవర్ధన్ సెలవులో వున్నాడని ఆ పాఠకుడికి తెలియదు. నేనైనా అతడు కాస్త లాంగ్ లీవు పెట్టివుంటాడని మాత్రమే అనుకున్నాను.

ఆ పాఠకుడూ, నేనూ కూడా పొరబడ్డామని తెలుసుకోడానికి కొంత కాలం పట్టింది. నిజం నిలకడమీదనే గదా తెలిసేది!

చలపతికి పెళ్ళి జరిగి ఒక ఏడాది గడచిన తర్వాత నేనొక పర్యాయం ఆ వూరు వెళ్ళాను. ఆలోగా వాలుగైదుసార్లు వెళ్ళి రాకపోలేదు. కానీ ఆ వెళ్ళడం సంగతి వేరు! అప్పట్లో నేను నిక్కి నీలిగి హాల్లోకి మాత్రం వెళ్ళగలిగాను. స్వాగతం, సత్కారం, విందూ విశ్రాంతి అన్నీ హాల్లోనే స్వీకరించాను. మిత్రుడి అంతరంగికాగారం భార్యాభర్తల శయనాగారంగా మారిపోవమే యిందుకు కారణం. కానీ ఏడాది గడిచేసరికి పరిస్థితుల్లో కాస్త మార్పువచ్చిందనే చెప్పాలి. కానుపుకోసం చలపతి భార్య పుట్టింటికి వెళ్ళిపోయిందిద.

"హాల్లో కూర్చుంటే నిన్ను నేను చదువుకోనిస్తానా శేఖరం! వద్దున

బాబూ! నువ్వు గదిలోనే కూర్చో" అన్నారు వెంకటరామయ్యగారు

ప్రస్తుత విశేషం! చలపతి జంకుగొంకులు లేకుండా బీరువా తెరిచేస్తున్నాడు. బెరుకు బెరుకుగానే నేనా బీరువా లోపల అరలన్నీ పరకాయించి చూచాను. ఆడవాళ్ళ బట్టలు, స్నో సీసాలు, పౌడరు డబ్బాలు మొదలైన వస్తువులు కొన్ని కొత్తగా చోటు చేసుకున్నమాట నిజమేగానీ ఆ బీరువాలో యిప్పుడు మచ్చుకొక అచ్చు కాగితమైనా కానరావడం లేదు!

సాయంకాలపు చల్లటి గాలికోసం ఊరిబయటకు షికారువెళ్ళి అక్కడొక చెరువుగట్టున కూర్చున్నాము. చలపతిని ఆశ్చర్యంలో ముంచి లేవనెత్తడానికి అదే తగిన సమయమనిపించింది. "చూడు చలపతీ ఒక మాట అడుగుతాను. తటపటాయించకుండా జవాబు చెబుతావు గదూ" అన్నాను.

"ఏమిటో అడుగు...." మరింత వింపాదిగానే అన్నాడు చలపతి.

"మరేం లేదు "కామవర్ధన్" అంటూ ఓ రచయిత వుండేవాడు. ఒక ఏడాదినుంచీ అయిపులేకుండా మాయమయ్యాడు. అతడి ఆచూకీ నీకు తెలిసి వుండాలి .. "

ఒక క్షణంపాటు నా ముఖంలోకి తీక్షణంగా చూచి ఆ తరువాత విరగబడి నవ్వసాగాడు చలపతి. "ఆచూకీ తెలియకపోతే పోలీసులకు రిపోర్టివ్వలేక పోయావా రాజశేఖరం! ఎలా తెలిసింది బాబూ నీకు కామవర్ధన్‌ని గురించి? వాడికి దేవిడీమన్నా అయిందిలే. ఇక తిరిగిరాడు...."

నా కొక విషయం తెలిసింది. రహస్యం తెలిసింది గదా అని చలపతిని లోకువపరచడానికి వీల్లేదు. కొండంత ఆశ్చర్యాన్ని దిగమ్రింగి, తిరగబడినవాడితో మరింత సున్నితంగానే వ్యవహరించాలి. అందుకని అప్పటి కప్పుడు ఒక అబద్ధాన్ని ఆసరాగా తీసుకున్నాను.

"అబ్బే, యిందులో పెద్ద ఇన్‌వెస్టిగేష నేముందోయ్ చలపతీ! కాళ్ళూ చేతులూ ముక్కూ మొగమూలాంటి అవయవాలన్నీ ఒక్కటే అయినా వాటి కలయికవల్ల ఏర్పడే ఆకృతుల్లో అనంతమైన వైవిధ్యాం కనిపించడం లేదా. లోకంలో లక్షమంది రచయిత లున్నారు. కానీ ఎవరిశైలి వాడిది. నా దగ్గర

నువ్వు వ్రాసిన ఉత్తరాలు డజన్లకొద్దీ వున్నాయి. కాటావేసి చూచుకున్నానేమో, చప్పున గుర్తుపట్టేశాను....''

చలపతి ముఖం విప్పారింది-''అసలేం జరిగిందంటే శేఖరం-వద్దులే! ఇదేమైనా రామాయణమా ఆదినుంచీ చెప్పడానికి సంగ్రహంగానే ముగిస్తాను. అందుబాటులోకి రాని అనుభవం మనిషిని తహతహ లాడిస్తుంది. వివశుణ్ణి జేసి వెర్రెక్కిస్తుంది. అందుబాటులోకి వచ్చిన తరువాత అదెంతటి అసామాన్యమైన అనుభవమైనా చప్పున చల్లారిపోయి వూరుకుంటుంది. అందుబాటులో లేని అనుభవానికి సంబంధించిన ఊహలోనుంచీ పుట్టినవాడు కామవర్ధన్! అనుభవం అందుబాటులోకి రాగానే వాడు తారున మరణించాడు! పూర్ ఫెలో! పుబ్బలో పుట్టి మఖలో పోయాడు పాపం. పోతేపోయాడేగానీ వాడు పోవడముందే శేఖరం, అదొక విషాదగాథ! పెళ్ళయిన కొత్తలో మేము బంధువుల వూళ్ళన్నిటికీ వెళ్ళామని వ్రాశాను గదూ! ఆ తరువాత సుప్రసిద్ధ టూరింగ్ కేంద్రాలు కొన్నింటికి వెళ్ళాము. వెళ్ళిన ప్రతిచోట ఒక గది తీసుకుని బస చేశాము. రెండు మాసాల సెలవు రెండు క్షణాల్లా గడచిపోయింది. త్రిప్పటవల్ల ఒళ్ళు దప్పిపోయిన మాట వాస్తవం! మా ఊరికి తిరిగివచ్చాము, ఎంతగా బద్ధకంగావున్నా ఆఫీసుకు వెళ్ళక తప్పదు. ఆ రోజే డ్యూటీలో జాయినుకావాలి మరి! సాయంకాలం ఆరు గంటలకుగానీ యింటికి తిరిగి రాలేకపోయాను. ఇంట్లో అడుగుపెట్టేసరికి కమురువాసన సోకింది. ''ఏమిటమ్మా! కాగితాలు కాలుతున్నట్టున్నా యెందుకూ?'' అని మా అమ్మనడిగాను. ''అదేం శోద్యమోరా బాబూ! కాయితాలైతే బాయిలర్ బాగా కాగుతుందట! తట్టెడు కాగితాలతో ఈ పని మొదలెట్టింది అమ్మాయి. ''అదేం పని మాలతీ! బొగ్గులు లేవా ఏమిటి!'' అంటూ స్నానాలగదివైపు వెళ్ళాను. మాలతి మాట్లాడలేదు. తట్టలో ఒక పట్టెడు కాగితాలు మాత్రం మిగిలి వున్నాయి. చరచరా నా గదిలోకి వెళ్ళి బీరువా తెరిచాను. మాలతిపైన నాకా క్షణాన కోపం వచ్చిన మాట నిజం. కానీ కోపాన్ని వెళ్ళగక్కడాని కది తగిన సమయం కాదు. నా వెనువెంటనే లోపలికి వచ్చిన మాలతి అదే బీరువాలోనుంచీ టవల్ తీసుకుంటూ ''నీళ్ళు బాగా కాగాయి స్నానం చేద్దురుగాని రండి'' అంటూ ఉపచార వాక్యం పలికింది. నీళ్ళ కాగటం కాదు. మనసు

తున్నాయి. చన్నీళ్ళు తోడుకునేసరికి పెద్ద చెవుల అండా వీండిపోయింది. ఒళ్ళలిసిపోయేలా స్నానం చేశాను. మాలతి తన చేతిమీదుగా వంటచేసి పెట్టిడానికదే తొలిరోజు, వంట దివ్యంగా కుదిరింది. సుష్టుగా భోజనం చేశాను. మంచంపై మేను వాల్చడమొక్కటే తెలుసు. కళ్లు తెరిచేసరికి భళ్ళున తెల్లవారింది. ఎప్పుడు లేచిందోగానీ మాలతి, ఆపాటికే ముఖం కడుక్కునివచ్చి నిలువుటద్దం ఎదుట తిలకం దిద్దుకుంటోంది. హఠాత్తుగా నా నోటివెంట ఒక ప్రశ్న వెలువడింది. "రాత్రి నేను నిద్రలేచామగానా మాలతీ" అన్నాను. మాలతి బదులు చెప్పలేదు. మునిపంటితో పెదవిని నొక్కిపట్టడం ద్వారా ఉబికివస్తున్న నవ్వాపుకుంటూ ఆమె "కాఫీ చల్లారిపోతోంది. తొందరగా ముఖం కడుక్కోండి" అంటూ తుర్రున బయటికి జారిపోయింది."

చెప్పడం ముగించి జరిగిన దానితో తనకేమీ సంబంధంలేనట్లు నిశ్శబ్దంగా కూర్చున్నాడు చలపతి. ఎవరు ముందుగా నవ్వుతారోనని పందెం వేసుకున్నట్టుగా వుంది పరిస్థితి. చివరకు నేనే ఓడిపోయాను. ★

# సవతిబిడ్డలు

మా ఊరిపేరు రంగాపురం. ఈ పేరు రావడానికి కారకుడైన మూలపురుషుడిపేరు రంగభూపతి. రంగాపురం క్రిందటి భూముల్లో ఎక్కువభాగం రంగభూపతిగారివే గనుక ఆయన కది సార్థక నామధేయం. సన్నకారు రైతులపట్ల రంగభూపతిగారి గుండెల్లో ఎనలేని జాలి గూడు కట్టుకుని వుండేదట! వాళ్ళ లోతుబావులు, వాళ్ళ బక్కగొడ్లు, పండని పొలాలు, ఎండిన పైర్లు, మండే డొక్కలు, ఈ పీడను ఆయన తన రెండుకళ్ళతోనూ చూడలేక పోయారట! ఆలోచించగా ఈ సమస్యను చీల్చిపారేయడానికి చిన్న కమతాలను రద్దుచేయడ మొక్కటే ఆయనకు గత్యంతరంగా తోచిందట! అందుకు వీలుగా బక్క రైతులందరూ ఆ పాటికే రంగభూపతిగారి దగ్గర అప్పులూ సప్పులూ చేసే వున్నారు. ఆ అప్పులు వడ్డీలతో కలిసి ఏపుగా పెరిగి వున్నాయి. అదనంగా ఆయన దగ్గర నయమూ, భయమూ అన్న సాధనాలు రెండూ సర్వసిద్ధంగా వున్నాయి. చిటికెలో చిన్న కమతాలన్నీ అంతరించగా ఒకే ఒక పెద్ద కమతం ఏర్పడింది. అలాగని చిన్నరైతులందరూ పొట్ట చేతబట్టుకుని పెళ్ళాం బిడ్డలను వెంటబెట్టుకుని దేశాలపాలై పోవాలన్న దురుద్దేశం రంగభూపతిగారికి ఏకోశానా లేదు. పెట్టుబడి నాది. లాభనష్టాలు నావి మీకేబాధ్యత అక్కర్లేదు. మనిషన్న తర్వాత ఎంతటివాడైనా తనకు తగ్గపని తాను చేయందే బ్రతుకు గడవదు. ఆ పని యిక్కడే చేయండి. మీక్కావలసిందల్లా తిండీ, బట్టా. ఆ రెంటికీ పూచీ నాది అని ఆయన చిలక్కి చెప్పినట్టుగా చెప్పి చూశారు. విన్న బుద్ధిమంతులున్నారు. తల్లి రెక్కల క్రింద అణిగి మణిగి వుండే పిల్లల్లా వాళ్ళు బుద్ధిగా రంగభూపతిగారి పాలన క్రిందనే వుండిపోయారు. మిగిలినవాళ్ళు దురభిమాన మొక్కటి మాత్రమే ఆస్తిగా దేశంపైన వూరేగడం కోసం రంగాపురం విడిచిపెట్టి వెళ్ళిపోయారు.

గ్రంథస్థం చేయకపోవడం చరిత్రకారుల పొరబాటేగానీ, రంగభూపతి

గారు అర్థశాస్త్రంలో అందెవేసిన చేయి. స్వయంగా సృష్టించి, ఆయన స్వగ్రామంలో అమల్లో పెట్టిన ఆర్థిక సిద్ధాంతం విస్తృత ప్రచారానికి నోచుకోక పోవడం సమకాలీనుల దురదృష్టం. తాను నమ్మిన సిద్ధాంతాన్ని ఆచరణలో పెట్టడంలో ఆయనకు మమకారాలు అడ్డు తగలలేదు. వాత్సల్యాలు ప్రతిబంధకం కాలేదు. రంగభూపతిగారికి ముగ్గురు కొడుకులు. సగటు లెక్కన ఆ ముగ్గురికి ముగ్గురేసి కొడుకులు పుడితే మూడో తరానికల్లా రంగాపురం ఎస్టేటుకు తొమ్మిదిమంది వారసులు తయారౌతారు. ఇంకొక మూడు తరాలు ఆలాగే గడిస్తే వారసుల సంఖ్య వందకుపైగా పెరిగి బంగారంలాంటి రంగాపురం ఎస్టేటు మళ్ళీ చిన్నచిన్న చెక్కలుగా విడిపోయే ప్రమాదం తప్పకుండా ఏర్పడి తీరుతుంది. ఈ అనర్థం వాటిల్లకుండా వుండడంకోసం ఆయన రాగిరేకుపైన వ్రాయించి ఇనప్పెట్టెలో పెట్టిపోయిన తన మరణశాసనంలో సుస్పష్టంగా ఒక కట్టడి చేసిపోయారు. అదేమిటంటే ఈ ఎస్టేటు ఎల్లప్పటికీన్నీ కుటుంబంలో జ్యేష్ఠపుత్రుడికి మాత్రమే సంక్రమిస్తూ రావాలి. మిగిలిన వాళ్ళగతేమిటన్న ప్రశ్న యిక్కడ ఎదురుగావచ్చు. సృష్టిపుట్టిన నాటినుంచి ఈ 'మిగిలినవాళ్ళ'తో గొడవగొడవగానే వుంది. వీళ్ళ కేదో ఒకదారి. చివరికి గోదారైనా సరే చూపించకపోతే వీళ్ళు తలారిరాముడిబిడ్డల్లా పీక్కుతింటారని రంగభూపతిగారికి తెలుసు. అందుకనే ఆయన తన మరణశాసనంలో ఒక సబ్‌క్లాసు రూపొందించారు. జ్యేష్ఠపుత్రుడు మినహా మిగినవాళ్ళకందరికీ నష్టపరిహారం క్రిందనైతేనేమి జీవిత భరణంగానైతేనేమి, కొంత నికరమైన మొత్తం యిచ్చి వేయబడుతుంది. ఆ మొత్తాన్ని చేతబట్టుకొని వాళ్ళు రంగాపురం వెళ్ళిపోయినా వెళ్ళిపోవచ్చు. ఇలా వుండిపోయేవాళ్ళకోసం రంగభూపతిగారు ఒకటి రెండు సదుపాయాలు చేకూరే వెరవు కల్పించారు. ఒకటి గృహవసతి, తన మేడకు ఊరిగుడిసెలకు మధ్యగా వున్న ఖాళీ జాగాలో ఆయన కొన్ని పెంకుటిళ్లు కట్టించి పెట్టారు. వీళ్ళల్లో అర్హులైనవాళ్ళకు చిన్న ఉద్యోగంలాంటి దేదైనా యివ్వబడవచ్చునని సిఫారసు చేశారు.

మామిడి తోపుపైన కాపలా, మిరప తోటపైన పర్యవేక్షణ, అరటి తోటపైన అజమాయిషీ, వడ్ల దంపకం మిల్లులో మిషను నడిపేవాడు.

పంతలకు వెళ్ళి కూరగాయలమ్ముకొచ్చేవాడు. పట్టణంలోని మిల్కు డిపోకు పాలూ, పెరుగు చేరవేసేవాడు- యిలా ఆవశ్యకతను బట్టి ఉద్యోగాలకు రూపకల్పన జరుగుతూ వచ్చింది.

రైల్లో కంపార్టుమెంటులకన్నా విశదంగానూ, ఆదర్శవంతంగా రంగాపురంలో తరగతుల విభజన జరిగిన తర్వాత ఎన్నోతరాలు గడచిపోయాయి. ఎవరి ధర్మాలు వాళ్ళు తూచా తప్పకుండా ఆచరించడంతో రంగభూపతిగారు సంకల్పించిన ఆదర్శసమాజం మూడు పువ్వులతో ఆరు కాయలతో విలసిల్లింది. కానీ ధర్మానికి ఎప్పుడెప్పుడు ఏయే విధంగా పేగి వాటిల్లుతుందో చెప్పలేంగదా! ఇటీవల హద్దుల్ని అతిక్రమించే చర్యలు ప్రబలంగా కొనసాగాయి. క్రింది తరగతుల పెట్టెల్లోనుంచీ పై తరగతుల పెట్టెల్లోకి దాటుకోవడం ఒక గొప్ప సామాజిక విద్రోహమన్న నీతి స్ఫురణ మానవుల్లో పూర్తిగా నశించినట్టే కానవచ్చింది.

స్వపరభేదం ఎంచకుండా నిజం చెప్పవలసివస్తే అలాంటి సామాజిక విద్రోహుల జాబితాలో మా నాన్నగారి పేరునుగూడా చేర్చవలసి వుంటుంది. ఆయన నన్ను తీసుకెళ్ళి మొదటి తరగతి పెట్టెలో కూచోబెట్టాలని కొన్ని మొండి ప్రయత్నాలు చేసి చూశాడు. ఫలించలేదనుకోండి! ఎలా ఫలిస్తుంది? అందుకు తగ్గ టిక్కెట్టుండొద్దూ? అది లేకుండా అంతపనీ చేస్తే టికెట్టు కలెక్టరు పట్టుకోడా? చెవులు పిండి 'ఎక్సెస్' వసూలు చెయ్యడా? ఇదంత మా నాన్నకేం తెలియకకాదు. కానీ అదేం గ్రహచారమో నా జేబులో వున్న టికెట్టు ఆయన కళ్ళకు ఆదినుంచి మొదటి తరగతి టికెట్టుగానే కనిపిస్తూ వచ్చింది!

చెవిలో యిల్లు కట్టుకుని పదేపదే చెబుతూ రావడంవల్లనే గావచ్చు నేను గూడా నాది మొదటి తరగతి టిక్కెట్టు కాబోలననే భ్రమలో పడిపోయాను. నా బ్రతుకు బ్రతుకంతా ఆ భ్రమా ప్రమాదానికి లోనైపోయి వుండవలసింది. ఏ జన్మలో చేసుకున్న పుణ్యమోమరి, ఈ మధ్యనే నాకు జ్ఞానోదయమయింది. క్షంతవ్యుణ్ణి. అసలిక్కడ కొంచెం వెనక్కి వెళ్ళి మళ్ళీ ముందుకురావాలి.

* * * *

'నువ్వు యోగ జాతకుడివిరా బాబూ!' అంటుండేవాడు మా నాన్న. మాటల కర్థమేమిటో తెలియని చిన్ననాటినుంచీ నేనీమాట వినడానికి అలవాటు పడ్డాను.

పేరుకు పెంకుటిల్లేగానీ మా యింటిలోపలి పరిస్థితి పూరిగుడిసె కన్నా విప్పచ్చరంగా వుండేది. దండెంపైన వ్రేళ్ళతో ఎంచుకోదగినన్ని బట్టలు, వంట గదిలో పది పన్నెండు కుండలు, మరికొన్ని సత్తుబోకులు, ఒక కొయ్య పెట్టె, రెండు నులక మంచాలు ఇంతే మా సౌభాగ్యం. మా నాన్న చేసే ఉద్యోగానికి నిర్దిష్టంగా ఒక పేరంటూ లేదు. ప్రొద్దస్తమానం, ఒక్కొక్కప్పుడు రాత్రుల్లోగూడ పెదబాబుగారి యింటిదగ్గర హాజరై వుండాలి. వాళ్ళ గృహావసరాలు గమనించాలి. ఇందుకు ప్రతిఫలంగా ఆయనకు ముప్పై రూపాయల వేతనం ముడుతుండేది. ఉన్నంతలో సరిపుచ్చుకుంటూ మా అమ్మ సంసారసాగరంలో నెగ్గుకొస్తుండేది. తాత్పర్యమేమిటంటే నేను పుట్టడమే దారిద్ర్యదేవత గారాలు పట్టిగా పుట్టాను. నా జీవిత గృహానికి సంబంధించిన తలుపులు, కిటికీలు పకడ్బందీగా మూయబట్టి వెలుపలినుంచీ బిగించబడి వున్నాయి. అదృష్టదేవత ఏ సందునుంచీ నావైపుకి తొంగి చూడగలదో నాకు తెలిపేదిగాదు.

బహుశా మా అమ్మకు గూడా యిదే సందేహం కలిగివుంటుందని నా వూహ. ఆవిడ ఒకనాడు మా నాన్నగారిని పట్టుకుని నాలుగు దులిపేసింది. "మీది మరీ చాదస్తమైపోయింది. యింట్లో చెబుతున్నారు గనుక సరిపోయింది. వీధిలోగనుక చెబితే నలుగురూ నవ్విపోతారు. జాతకం మంచిదైతే వీడు మన యింట్లో ఎందుకు పుడతాడండీ?" అంటూ ఆయన వాదాన్ని ఒక మాటలో కొట్టిపారేసింది.

మా నాన్న నవ్వేశాడు.

"ఒసే పిచ్చిమొగమా! సరైన దాఖలా లేనిదే నేనామాట ఎందుకంటాను? నాకు తెలుసు. వీడు యోగ జాతకుడు కావాలి. అయితీరాలి. వీడు పుట్టిన లగ్నం అలాంటిది" అన్నాడు.

"ఏమిట్లోలెండి! ఎప్పుడడిగినా మీ రిలాగే చెబుతారు...."

అమ్మ ధోరణిలో తీవ్రత తగ్గింది కదా! నాన్న విజృంభించాడు. "ఆ రోజు వుదయం నేను పెదబాబుగారి యింటికి వెళ్ళబోతుండగా నువ్వే మన్నావు? కడుపులో ఏమిటో నలతగా వుందన్నావు. ప్రక్కింటి తులసమ్మను చూచుకోమని చెప్పి నా పనికి నేను వెళ్ళిపోయాను. అక్కడికి వెళ్ళేసరికి అమ్మగారికి సరిగ్గా నీలాగే కడుపులో నలతగావున్నట్టు తెలిసింది. మధ్యాహ్నం యింటికొచ్చేటప్పటికి నువ్విక్కడ కడుపునొప్పితో గింగుర్లు తిరిగిపోతున్నావు. అక్కడ అమ్మగారి పరిస్థితీ అలాగేవుంది...."

"సర్లెండి! కడుపునొప్పి అన్న తర్వాత అది అందరికీ ఒకటే? అది కలిగిన వాళ్ళ కొకరకంగా, లేనివాళ్ళ కొకరకంగా వొస్తుందా? ఐతే ఒకటి. అమ్మగారికి కడుపు నొప్పనగానే పట్టణానికి మనుషులు వెళ్లారు. డాక్టరొచ్చాడు. నర్సొచ్చింది. వాళ్లు మందులిచ్చారు, సూదులు వేశారు. నాదేముంది? ఆఖరుకు మీరయినా బిడ్డ పుట్టాకగానీ నన్ను చూడ్డానికి రాలేదు. తులసమ్మ గనుక లేకపోతే నా బిడ్డకు బొడ్డుగోసే దిక్కయినా వుండేదిగాదు...."

"నీ గొడవ నీది! నీకు దిక్కులేకపోవడమేమిటి? నీ పాలిట దేవుడే లేకపోతే అంత సుఖంగా ప్రసవమయ్యే వుండదు. ఇంతకూ నీ కసలు సంగతి తెలుసుకోవానే లేదు...."

"చెప్పండి" అంది అమ్మ రాజీకి దిగివచ్చి.

"సాయంకాలం ఆరుగంటలై వుంటుంది. ఆ రోజంతా ఒక్క బిర్రున ఎండలుకాసి ప్రొద్దువాటారిపోయాక ఆకాశంలో మబ్బులెక్కాయి. హోరు మంటూ గాలి ప్రారంభమైంది. ఉండి వుండీ బైర్లు క్రమ్ముకపోయేట్టుగా మెరుపులు పుడుతున్నాయి. అప్పుడున్నట్టుండి, యిళ్లు, వూళ్ళూ అదిరిపోయే టట్టు బ్రహ్మాండంగా ఓ వురుము వినిపించింది."

"అవున్నిజమేనండీ! ఆ వురుము ఆగిపోయేసరికి నాకు బిడ్డ కెవ్వు మంటూ ఏడవడం వినిపించింది."

"చూశావా సుబ్బులూ! అక్కడేమయిందంటే, ఆ వురుము కాస్తా నేలపైకి దిగివచ్చి తన వెంటబడి తరుముకొస్తున్నట్టుగా నర్సమ్మ బయటికి

పరుగెత్తుకొచ్చి 'మగబిడ్డ, మగబిడ్డ' అంటూ బాకా వూదేసింది.''

''ఆఁహో, అలాగా!'' అమ్మ ముఖంలో ఒక వింత చైతన్యం పుట్టుక రావడం నేను చూచాను.

''నేనీ సంగతి ఎవరికీ చెప్పలేదనుకో! కానీ నా జాగ్రత్తలో నేనున్నాను. అక్కడ వాళ్లు అయిదారుగురు శాస్త్రుల్ని రప్పించారు. పది రకాల పంచాంగాలు చూశారు. పుట్టిన వేళావిశేషాన్నిబట్టి బిడ్డకు చదువు, డబ్బు, హోదా ఎందులోనూ లోటుండదనుకున్నారు. వాళ్ళబిడ్డ కక్కడ లోటుండకపోతే యిక్కడ మన బిడ్డకు లోటుండవలసిన పనిలేదు. అదీ నా లెక్క!''

అమ్మ యింకా ఆశ్చర్యంనుంచీ తేరుకోలేదు.

''నామ నక్షత్రకాన్నిబట్టి వాళ్లు బిడ్డకు రామారావని పేరుపెట్టారు గదా సుబ్బులూ! నామకరణమన్న పేరుతో కట్టి కోలాహలం గూడా చేశారు. నేను కానీ ఖర్చులేకుండా మన అబ్బాయికి అదే పేరు పెట్టేశాను....'' అప్పటికి తనేదో ఘనకార్యం చేసినట్టు నాన్న బిగ్గరగా నవ్వసాగాడు.

''మీరేమో మంచి పనే చేశారు. కాని ఏం లాభం? మన అబ్బాయిని రామన్నా అని పిలవడమే అబ్బురం. ఎక్కువమంది 'రామిగా' అనే అఘోరిస్తున్నారు.''

''పిలుచుకోనీలే సుబ్బులూ! నవ్వీన నాపచేనే పండుతుంది. నీకెందుకు, నువ్వు చూస్తూవుండు.''

నా బుద్ధి నాకు తెలిసొచ్చేటప్పటికి చినబాబుగారు పట్నంలోవుండి కాన్వెంటులో చదువుకుంటున్నాడు. నేనేమో పల్లెలో ముక్కుపొడి మేష్టారుగారి దగ్గర మూడోక్లాసు చదువుకుంటున్నాను.

జన్మకాలానికి సంబంధించిన రహస్యం తెలిశాక నాకు పల్లెటూరి బడిలో చదువుకోడం అవమానకరంగా తోచింది. ''నన్ను గూడా కాన్వెంటులో చేర్పించరాదా నాన్నా?'' అన్నాను.

"చదువెక్కడికీ ఒక్కటేరా రామూ! ఇక్కడున్న అ ఆ లు క ఖ లే అక్కడ వున్నాయి. నాలుగు నాలుగుల యిక్కడా పదహారే. అక్కడా పదహారే! చదువుకోడానికెక్కడైతేనేమిరా?" అన్నాడు నాన్న.

ఆ జవాబులో సబబు లేదని నేనెలా అనగలను? ఐనా ఒక ప్రశ్న నిరంతరంగా నన్ను వెంటాడటం ప్రారంభించింది. మరైతే నాకు అదృష్టం పట్టడం ఎప్పుడు?

ఓర్చుకో, ఓర్చుకో అంటూ తాళజెబుతూ వుంది నా అంతరాత్మ.

అయిదో తరగతి పాసుకాగానే నాన్న నన్ను పట్టణానికి తీసుకెళ్ళి హైస్కూల్లో చేర్పించాడు. హోటల్లో అన్నం తింటూ మూడు నెలలపాటు నిశ్చింతగా చదువుకున్నాను. ఇంటి భోజనంకన్నా హోటలు భోజనం రుచిగా వుంటుందని గ్రహించాను. అదృష్టమంటే యిదే కాబోలు ననిపించింది. కానీ నాలుగో నెల పూర్తయి పదిహేనురోజులు గడచిపోయినా మనియార్డరు రాకపోయేసరికి నా అంచనా తల్లక్రిందులైపోయింది. హోటల్లో అన్నం పెట్టడం కుదరదు పొమ్మన్నారు. నిజంగా నా జన్మ నక్షత్రంలో గొప్ప అదృష్టరేఖ గనుక వున్నట్టయితే అది బయటపడడానికి యింతకంటే మించిన సమయం వుండదు. వారాలకోసం ప్రయత్నిస్తూ వుండగా ఒక పెద్ద మనిషి చెప్పిన సలహా నాకు నచ్చింది. "వారానికొకపూట అన్నం పెట్టడ మేమిట్రా అబ్బీ? అన్నిపూటలూ నేనే పెట్టగలను ఐతే నువ్వు నేను చెప్పి నట్టు వినాలి. మరేంలేదు నువ్వు మా సోడాకొట్టులో వుండిపో అన్నం పెట్టడమేగాదు, ఆరునెలలకోసారి నీకు జత చొక్కాలు, నిక్కర్లుగూడా కుట్టిపెడతాను. అంతగా చదువుకోవాలనివుంటే ఇస్కూల్లోనే చదువుకోవా లని ఎక్కడుంది? లైబ్రరీనుంచి పుస్తకాలు తెచ్చుకునేదీ, తీరికున్నప్పుడు కొట్టులోనే చదువుకునేదీ" అన్నారాయన.

హోటల్లో భోజనంచేస్తూ హైస్కూల్లో చదువుకోవలసిందిపోయి సోడాకొట్టులో పనిచేసి అన్నం సంపాదించుకోవలసివచ్చేసరికి నాకు చదువు పైన పట్టరానంత కోపం వచ్చింది. ఆకలిగొన్న తోడేలులా దొరికిన ప్రతి పుస్తకాన్ని చదివి పారేశాను. పట్టుబట్టి యింగ్లీషుముక్కలు చదవడంగూడా

నేర్చుకున్నాను. 'సోడాకొట్టులో పనిచేసేకుర్రాడు యింగ్లీషు బాగా చదవగల
డ'న్న కితాబొక్కటే నాకుదక్కింది. మిగిలిన నా చదువంతా పరిగణనకు
రాకుండాపోయింది

జీవిత గ్రంథంలో కొత్తకొత్త సత్యాలను ఆరాతీసేకాలం. లోకంలో
పైకి రావడానికిన్నీ చదువుకున్నా అంతపెద్ద లంకె ఏమీలేదని కొన్నికొన్ని
దృష్టాంతాలద్వారా నాకు తెలిసింది. సోడాకొట్టులో నా బ్రతుకు సోడా బుడ్డి
గొంతుకలో తగులుకున్న గోలీకాయలా గ్రుక్కిళ్ళు మ్రింగడంగానే వుండి
పోయింది. 'ఇది పని కాదురా నాన్నా! మంచి చేతిపని ఏదైనా నేర్చుకో'మని
మా నాన్న అప్పుడప్పుడూ పదో, యిరవయ్యో పంపిస్తూ వుండేవాడు.
చిన్నప్పటినుంచీ పరుగెత్తుతున్న కారునుచూస్తే నాలోని ఆత్మారాముడెందుకో
ఉప్పొంగిపోతూవుండేవాడు. గొప్పస్థితికి రావడమంటే కార్లల్లో తిరగడమే
నని భావించేవాణ్ణి. ఎందుకైనా మంచిదని కారునడపడం నేర్చుకోవాలన్న
బుద్ధిపుట్టింది. ఓ లారీలో క్లీనరుగా పనికి కుదిరాను. లారీకి శుశ్రూష, లారీ
డ్రయివరు పాపాసాహేబుకు శిష్యరికం రెండూ ఏకకాలంలో చేస్తూవచ్చాను.
సారామత్తులో జోగుతున్నప్పుడల్లా పాపాసాహేబు స్టీరింగుచక్రం నా కప్ప
గించేవాడు. ఒక ఏడాది కాలంలో లారీని ఆఘమేఘాలపైన తోలడం నేర్చు
కున్నాను. కానీ లారీని పరిగెత్తించి ఏం లాభం? నేను నా జీవితాన్ని అందులో
మారింట ఒక్కపాలు వేగంతోనైనా పరుగెత్తించలేకపోయాను. అది
ఒకచోట పడవేసిన తరువాత కదిలీ మెదలని గొంగడిలా వుండిపోయింది.
ముసలితనంలో నిస్సహాయులయిపోతున్న కన్నతల్లిదండ్రులకు నేను ఊత
కర్రగాగానీ, పట్టుగొమ్మగాగానీ ఉపకరించలేకపోయాను.

లారీక్లీనరు ఉద్యోగం నుంచి డ్రయివరుగా ప్రమోషనుకోసం నేను
కాంక్షిస్తుండగా పాపాసాహెబు నాకు పగవాడైపోయాడు. తన ఉద్యోగానికి
నేను ఎసరు పెడుతున్నానేమో అన్న అనుమానం అతణ్ణి పట్టుకుంది. యజ
మానికి లేనిపోని పితూరీలు చెప్పి అతడు నన్ను లారీ నుంచి దించేశాడు.

అప్పుడిక చేయడానికి పనేదీలేక నేనొకనాడు నాలుగురోడ్ల కూడలిలో

నిలబడి దిక్కులుచూస్తూ బిక్కరిస్తూ వుండగా తేమనేలపైన జారిపోయే జెర్రిపోతులా ఓకారు సర్రునవచ్చి నా ముందు నిలిచింది.

"ఒరేయ్, నువ్వు రామన్నవి గదూ! ఏం చేస్తున్నా విక్కడ?" అన్నాడు కారులోనుంచి చినబాబు.

"అబ్బే, ఏం లేదండీ! ఉన్న ఉద్యోగం వూడిపోయింది. మళ్లీ ఏదైనా దొరుకుతుందేమోనని...." అంటూ నీళ్లు నమిలాను.

"డ్రయివింగు తెలుసునటగా! మీ నాన్న చెప్పాడులే! ఎక్కుకారు. కారీ మధ్యనే కొన్నానులే" అన్నాడు చినబాబు.

చినబాబు కారుకొనడం, అపాటికి నేను డ్రయివింగు నేర్చుకొని ఉద్యోగంకోసం వెదుకుతూవుండడం చినబాబు కారులో వచ్చి వచ్చి నాముందే ఆగడం, నన్ను కారెక్కమనడం యిదంతా ఆద్యంతమూ నాకు అత్యంత సహజ సుందరమైన విషయంగానే తోచింది.

నేను కారులో కెక్కడమూ చినబాబు ప్రక్కకు తప్పుకోవడమూ ఒక్కసారే జరిగాయి.

కారు స్టార్టయింది.

చినబాబు సిగరెట్టు ముట్టించుకుని పొగ వదలుతూ అన్నాడు-"నువ్వు ఉద్యోగంకోసం అక్కడా యిక్కడా వెంపర్లాడడ మెందుకూ? నా దగ్గరే వుండిపో!"

నిజం నిజం! అలా చేయడంవల్ల జన్మ జన్మల అనుబంధంలో నే నింకొక అడుగు ముందుకు వేసినట్టవుతుంది. ప్రపంచ నాటకంలో ఒక పాత్ర ధారినిగా నేను పాత్రౌచిత్యాన్ని పోషించుకున్నట్టవుతుంది.

కారు పట్టణం సరిహద్దులు దాటి పరుగిడుతోంది. గుట్టలెక్కుతోంది. పల్లాలు దిగుతోంది, మలుపులు తిరుగుతోంది, గాలిని కోసుకుంటూ రంయి మని దూసుకపోతోంది. కానీ ఎంతచేసినా తానెక్కడికి వెళ్తున్నదీ కారుకు తెలియదు. ఈ విషయంలో నా పరిజ్ఞానం గూడా కారుకు డిటోగానే వుంది.

"పద్మక్క చెప్పింది లెండి; కాస్త పచ్చగావున్న వాళ్లను చూస్తే లోకులకు మనసొప్పుతుందా? అలాంటి వాళ్లెవరో లేనివి పోనివన్నీ జతచేసి చలపతిగారి పైన పిటీషన్లు పెట్టేశారట; అక్కడెక్కడో హైద్రాబాదులో కూర్చున్న వాళ్లకేం తెలుస్తుంది? ఇక్కడొక ఖాళీ ఏర్పడితే తమవాళ్ల నెవళ్లనైనా అందులో పడెయ్యవచ్చునని వాళ్ల ప్లానట; అందుకని వాళ్ళు గూడా ఈయనపైన పగబట్టి "వుంటావా, వూడతావా" అని బెదిరిస్తున్నారట; కానీ చలపతిగారు కూడా ఏమంత చేతగానివాడు కాదు లెండి."

"ఏం చేస్తాడట శారదా?"

"ఏం చేస్తాడు; రాజీనామా రాసి వాళ్ల ముఖాన కొడతాడు ...."

"కొట్టి?"

"ఏదైనా బిజినెస్ పెట్టుకుంటాడు. అప్పుడే నలుగురు రైదుగురు పెద్దమనుషులు పార్ట్‌నర్స్‌గా వుండడానికి మేమంటే మేమని ముందుకొస్తున్నారుట...."

పైనుంచి వూస్టింగు ఆర్డరే వచ్చిందో, లేకపోతే యితడే రాజీనామా వ్రాసి పడేశాడో నాకు తెలియదు. మొత్తానికి వుద్యోగం వూడింది. ఆ విషయం ముందుగానే తెలిసి, అందుకు చలపతి సిద్ధమై వున్నాడనేందుకు నిదర్శనంగా కొద్ది నెలల్లో పట్టణంలో ఒక కొత్త హోటలు వెలసింది. ప్రారంభోత్సవం నాడు నేనూ వెళ్ళి చూచాను. చిరునవ్వులు వెలుగుతున్న ముఖంతో గల్లాపెట్టె దగ్గర కూర్చున్న చలపతి నాకు సుస్వాగతం పలికాడు.

"రండి రండి కృష్ణమూర్తిగారూ; అనుభవం చాలనివాణ్ణి. ఇందులో దిగేశాను. దీనికైనా నా దగ్గర డబ్బెక్కడిది? పెట్టుబడి పెట్టిన మహారాజులు వేరే వున్నారు. వాళ్ళకు నా పైన ఎంత విశ్వాసం, ఏం కథ; ఈ బిజినెస్సులో బుడుంగున మునిగిపోకుండా మేము పైకి తేలడం మీలాంటి వాళ్ళ పైన ఆధారపడి వుంటుంది. మీరు తరచుగా వచ్చిపోతుండాలి. ఇంకా మీ స్నేహితులతో గూడా చెప్పండి. జేబులో డబ్బుండి తీరాలన్నదేం లేదు. అకౌంట్‌లు పెట్టించుకోవచ్చు...."

ముచ్చటగొలిపే చలపతి ఆతిథ్య మర్యాదల్ని స్వీకరించడాని కైనా తరచుగా ఆ హోటలుకు వెళ్తూ వుండాలనిపించింది. రేట్లు కాస్త ఎక్కువే ననుకోండి. కానీ వదుపాయాలు దివ్యంగా వుండేవి. హాల్లో వేడివేడిగా కాఫీ, తేనీరులాంటి పానీయాలు. లోపలి గదుల్లో శరీరాన్ని కంతకంటే వేడియిచ్చే పానీయాలు దొరుకుతుండేవి. ఇరవై నాలు గ్గంటలూ పేకాట కొనసాగే రహస్యాగారం ఒకటి ఆ హోటల్లోవుందని గూడా విన్నాను. ఐనా ఆ హోటలు గొడవలన్నీ మన కెందుకు? దానివల్ల చలపతికి ఏ మాత్రం లాభించిందన్నదే ప్రధానం. ఇంతకు మునుపు చలపతి చేసిన గవర్నమెంటు ఉద్యోగంలాగే ఈ హోటలు గూడా అదృష్టవంతు డెక్కడికి వెళ్లినా బాగుపడకుండా వుండడనే విరూపించింది. కాఫీ పైకం మినహాయించుకుని చిల్లర డబ్బు లివ్వడంకోసం చలపతి పెట్టె తెరచినప్పు డల్లా నాకా గల్లాపెట్టె వొక చిన్న సైజు ధనలక్ష్మి కొలువుకూటంలా కనిపించేది.

ఆ హోటలు వ్యాపారం రెండుమూడేళ్ళపాటు దేదీప్యమానంగా సాగి పోయింది.

ఆ మధ్య ఒకసారి శారద "ఏమండీ! మీ కొక రహస్యం చెప్పనా?" అంది.

శారదకు రహస్యం చెప్పేవాళ్ళెవరైతే వున్నారో వాళ్ల బుద్ధ తెలివి తక్కువ వాళ్ళని నా వుద్దేశం. ఏమంటే ఆమె నోటిలో నువ్వుగింజ నానదు. కనీసం నాకైనా ఆ రహస్యం చెప్పేస్తుంది.

"పద్మక్క మీక్కూడా చెప్పొద్దందిలెండి! మరేం లేదు. చలపతిగారు అయిదువేలుపెట్టి ఓ రవ్వల నెక్లెసు చేయించాడు. ఎంత బావుందనుకున్నారు!"

"ఎందుకు బాగుండదూ? అయిదువేలా, మజాకానా? తప్పకుండా బాగుంటుంది" అన్నాను.

"మరి....హోటలుకు పెట్టుబడిపెట్టిన వాళ్లున్నారే, వాళ్ళు చాలా మంచి వాళ్ళని మనమనుకున్నాం. ఎంతపోరబాటో చూచారా! తెల్లనివన్నీ పాలనుకో

గూడదు. వాళ్ళవన్నీ కుళ్ళుబుద్ధులట! వాళ్లో. వాళ్ళ పెళ్లాలో చీటికి మాటికి వచ్చి కూర్చుని "ఈ దుద్దులెక్కడివి? ఈ గాజు లెప్పుడు చేయించారు? ఈలోగా ఎన్నిచీరలు కొన్నారు?" అంటూ ఒకటే పూదర పెట్టేస్తారట! ఏం చెయ్యాలి చెప్పండి. స్వర్గానికివెళ్ళినా సవతిపోరు తప్పదే! అందుకని ఎప్పు డైనా మెడలో నెక్లెసు పెట్టుకోవాలనిపిస్తే పద్మక్క యెకాయెకిన పుట్టింటికి వెళ్ళిపోయి వారం పదిరోజులుండి వస్తుందట!"

కానీ నెక్లెసు వేసుకునే మోజు తీరడంకోసం పద్మక్క అలా ఎంతో కాలం పుట్టింటికి యాత్రలు సల్పే అవసరంలేక పోయింది. ఆ పాటికే హోటలు వ్యాపారం స్తంభించిపోయే స్థితికి వచ్చింది. ఒక్కొక్కరుగా భాగస్వాములందరూ తెగతెంపులు చేసుకున్నారు. చివరికొక్క చలపతిమాత్రం మిగిలాడు. ఆతడుగూడా మిగిలివున్న బెంచీలు, కుర్చీలు, బల్లలు, పాత్ర సామగ్రి అయినకాడికీ తెగనమ్మి శనగలు తిని చేయి కడుక్కున్నట్టుగా హోటలుకు తగిలించిన నేమ్‌బోర్డు తీసి రిక్షాలో వేయించుకుని చక్కా యింటి కొచ్చేశాడు.

నాలుగైదువేల రూపాయల కిమ్మత్తుచేసే స్కూటరుపైన బలాదూర్లు తిరుగుతూ చలపతి ఎప్పుడైనా నా కెదురయ్యేవాడు. ఎదురైనప్పుడల్లా 'నెక్స్‌ట్ అయిటం ఆఫ్ ది ప్రోగ్రాం ఏమిటి బాబూ?' అని అడగాలనిపిం చేది.

అడగని పాపం నాది. తనంతట తానే చెప్పేవాడు చలపతి.

చూడ్డానికి చాలా సాధారణమైన విషయం. వెనుక ఎంతో అసాధారణ మైన వ్యూహం. మనుషులపైన సూదంటు రాయిలాంటి ఆకర్షణ. ఈ శుభ లక్షణాలన్నీ చలపతి పథకానికి అన్వయించేవే.

ప్రతి మెంబరూ చెల్లించవలసిన మొత్తం రెండు వందలే! అంతా వొకటేసారిగా ప్రారంభంలో చెల్లించాలి. మొత్తం మెంబర్ల సంఖ్య వెయ్యన్నీ ఏడువందలయాభై. నెలవొకటికి పదింటిచొప్పున ఆరు సంవత్స రాల పొడుగునా బహుమతులుంటాయి. మొదటినెల మొదటి బహుమతి అంబాసిడర్ కారు. చివరినెల చివరి బహుమతి గూడా ఆరువందలకు తగ్గదు.

ఈ దెబ్బయిరెండునెలల్లోనూ ప్రయిజానోచుకోనివాళ్ళకు ప్రణాళికాంతంలో అయిదువందల రూపాయలు నగదుగా యివ్వబడుతుంది. అందువల్ల వొకటి ఝుమ్మహ్నాతికవేలమంది మెంబర్లలో వొక్కడికైనా నష్టమన్నమాటేలేదు!

"ఎలా వుందండీ కృష్ణమూర్తిగారూ!" అన్నాడు చలపతి.

చాలా బాగున్నట్టు వొప్పుకొన్నాను.

"మాట చెబితే చాలదు. మీరూ మెంబరుగా చేరాలి. మీ ఆఫీసువాళ్ళను చేర్పించాలి. ఇప్పటికే వెయ్యిమందిని చేర్పించేశాను. అసలీ స్కూటరు కొనడంలోని వుద్దేశం అదే!"

ఒక రూపాయ పెట్టుబడితో లక్షలువచ్చి జేబులో పడిపోవడంతథ్యమే నని కలలుగనే వాళ్ళు లోకంలో బోలెడుమంది వున్నారు. లాటరీలు, చిట్ ఫండులు, ఫైనాన్స్ కార్పోరేషనులు, మనీసర్క్యులేషను మొదలైనవాటితో చక్కిలిగింతలు పెట్టగా, పెట్టగా ధనలక్ష్మి శరీరం మొద్దుబారిపోయే వుం టుంది. ఈ పరిస్థితిలో చలపతి తలపెట్టిన పథకం దిగ్విజయంగా కొనసాగ గలదనడానికి ఎలాంటి అభ్యంతరము కనిపించదు.

ఆరేండ్ల బృహత్ప్రణాళిక ప్రారంభమైంది. ఇంకా పూర్తికాలేదు.

రెండేళ్ళక్రిందట చలపతి చావడివీధిలో ఒక యింటి జాగా కొన్నట్టు తెలిసింది. ఇల్లు నిర్మాణదశలో వుండగా ఒకసారి మా శారద పద్మక్కతో బాటు వెళ్ళి చూచి వచ్చిందిగూడా!

పద్మక్క ఇంగ్లీషు చదువులు చదువుకోలేదట. పట్టణవాసంవల్ల ఆమె నేర్వగలిగిన కొద్దిపాటి యింగ్లీషు పకాల్లరీకి ఖర్చు కడుతున్న యిల్లుపుణ్యమా అని బాల్కానీ, పోర్టికో, బాత్‌రూము, వెయిటింగురూము, కిచెను డైనింగు హాలు అంటూ కొత్త కొత్త పదజాలం చేరిందట! మురిసిపోతూ చెప్పింది శారద.

"ఎన్నిసార్లు పిలిచినా మనమిద్దరం కలిసి వెళ్ళనేలేదు. గృహప్రవేశాని కైనా తప్పకుండా మిమ్మల్ని తీసుకరమ్మంది. అప్పటికేదైనా అడ్డుమాట

చెప్పారో, ముఖం చిన్నబుచ్చుకుంటుంది. అవిడసలే మెతకమనిషి!

కానీ దేనికైనా ప్రాప్తం వుండొద్దూ? మా దురదృష్టాని కొకర్ని నిందించి ఏం లాభం? గృహప్రవేశానికి మేము జంటగా వెళ్ళలేకనే పోయాము.

కొండనాలికకు పెడితే అసలు నాలికగూడా వూడిపోయిన చందంగా గృహప్రవేశ మహోత్సవానికి శారద ఒంటరిగానైనా హాజరు కాలేకపోయింది.

వెళ్ళడానికి వీల్లేకుండా ఈలోగా ఒక... ఒక... ఏమనాలో తోచడం లేదు దాన్ని! సంఘటన అంటే చప్పగా వుంటుంది. తమాషా అంటే వ్యతిరేకార్థం వస్తుంది. వైపరీత్య మంటే చలపతికి కోపం రావచ్చు.

జరిగింది జరిగినట్టుగా చెప్పేయడం మంచిది.

ఎప్పుడో అయిదారు నెలలకొకసారిగానీ నాకు చావడి వీధిగుండా వెళ్ళవలసిన పని తగలదు. నిర్మాణం పూర్తయిన క్రొత్తలో నే నొకసారి ఆ వీధిగుండావెళ్తూ చలపతి యింటివైపు చూచాను. అది అక్కడికక్కడ పునాదులుతీసి, యిటుకలతో గోడలు కట్టి, పైకప్పువేసి, సిమెంటుతో పూత పనిచేసి, రంగులుకొట్టి, యిలా వివిధ దశలద్వారా రూపొందిన కట్టడంలా తోచడంలేదు. హఠాత్తుగా చూచినట్టయితే ఏమాంబళంనుంచో, ఏపంజగుట్ట నుంచో అలాగే పెళ్లగించుకొచ్చి యిక్కడ పెట్టేసిన బంగళాలా కానవస్తోంది.

చలపతి యిల్లుకట్టిచూచాడు. చాలా బాగా కుదిరింది కొత్తయింట్లో తన జీవితమంతా ఒక కొత్త తరహాలోనే నడవాలని ఆశించాడు. అందువల్ల కొత్తయింట్లోకిగూడా పాత పెళ్ళాన్నే తెచ్చుకోవడం అతడికి చాలా అసంగతమైన విషయంగా తోచింది. ఏనాటి అనుబంధమో తెలియదు. డ్రామాల్లో చలాకిపాత్రలు ధరించే ఓ అమ్మాయి మెడలో అతడు పుస్తెకట్టేశాడు. ఆమెను తీసుకొచ్చి నూతన గృహంలో ప్రతిష్ఠించి, కొత్త కాపురమనే నావకు జోరుగా తెరచాప ఎత్తేశాడు!

తిట్టినతిట్టు చర్వితచరణంగాకుండా తిట్టిపోసింది శారద. రోజుల తరబడీ తిట్టింది. గ్రహచారంచాలక చలపతి గనుక మా వీధిలో కనిపించి వుంటే చేరెడు దుమ్మెత్తి అతడి తలపైన దిమ్మరించివుండేదిగూడా!

భార్యాభర్తల్లో ఒకరి అభిప్రాయాలను యింకొకరు విధిగా సమర్థించి తీరవలసిందే నంటూ చట్టమేమీ లేనట్టయితే నేనిక్కడొక మనవి చేసుకో వలసివుంది. చలపతి పై అధికారులను మోసగించాడు. ప్రభుత్వాన్ని దగా చేశాడు. వ్యాపారంలో వాటాదారుల్ని వంచించాడు. ప్రజల్ని దోచాడు. ఐతే యిదంతా మా శారదకు సజావైన వ్యవహార సరళిగానేతోస్తూ వచ్చింది. మరైతే యిప్పుడతడు రెండోపెళ్ళి చేసుకున్నందువల్ల ధర్మానికి కొత్తగా కలిగిన హాని ఏముందో నాకు తెలియడంలేదు. శారదకు చలపతిపైన యిలా ఆగ్రహం కలగడంలో ఔచిత్యమేమిటో నాటికీ, నేటికీ నాకు బోధనేపడలేదు!



# సంస్కారం

ఇది చాలా మంచివూరు- అనుకున్నాడు రమాపతి. అంతటితో వూరుకోకుండా ఆ అభిప్రాయాన్ని బాహాటంగా పదిమందితోనూ చెప్పేశాడు.

"అలాగా" అంటూ ఆశ్చర్యాన్ని ప్రకటించారు కొందరు. "నిజం, నిజమే" అంటూ ఏకీభవించారు కొందరు. 'రీసెర్చిచేసి గొప్ప విషయమే కనిపెట్టాడయ్యా ఈ ప్రబుద్ధుడు' అనుకున్నారు కొందరు.

తలా ఒక విధంగా అనుకుని తలలు పంకించుకుని ఎవరిదారిని వాళ్ళు వెళ్ళిపోయారు లోకులు. వాళ్ళల్లో మచ్చుకొక్కడైనా రమాపతి అభిప్రాయానికి ప్రాధాన్యమిచ్చిన పాపాన పోలేదు.

కానీ యిది చాలా మంచివూరని అన్నాడో లేదో యింతలేసి కళ్ళతో అతడివైపు ఆశ్చర్యంగా చూసి "ఐనా ఈ వూరిని గురించి మీ కప్పుడే ఏం తెలిసిందండీ! అసలు మనమీ వూరికి వచ్చి ఎంతకాలమైంది?" అంటూ భర్తను నిలదీసి అడిగింది రాజేశ్వరి.

చొప్పదంటు సందేహాన్ని వ్యక్తపరచినందుకు చిరచిరలాడిపోతూ, తన విజ్ఞతను శంకిస్తున్న భార్యకేసి చురచుర చూశాడు రమాపతి.

ఆ మాత్రానికే వెనుకంజవేసే తత్వంగాదు రాజేశ్వరిది! "అదేమిటండీ! అలా చూస్తారు? చూపులకే గ్రుడ్లు తేలవేసి క్రిందపడిపోవడానికి నేనేమీ కొంగనుకాను లెండి!" అంటూ ఓ పురాణగాధను జ్ఞప్తికి తెచ్చింది రాజేశ్వరి.

ఆడవాళ్ళతో గొప్ప విషయాలు చెప్పనే గూడదనుకున్నాడు రమాపతి. చెప్పి అవహేళన పాలైనందుకు కించపడ్డాడు. తనీ విషయాన్ని ఎందరితో చెప్పాడు! అందరూ తన అభిప్రాయాన్ని యధాతథంగా ఆమోదించేశారు. రాజేశ్వరికేం తెలుస్తుంది? ఈవిడకు వితండవాదం తప్పా మరొకటి చేతగాదు.

—ఐనా నాలుగుగోడల మధ్య జీవితాన్ని గడుపుకుపోవడానికి అల వాటుపడిన ఆడవాళ్ళకే వూరైతేనేమీ? వాళ్ళకావూరెంతో, ఈవూరూ అంతే! ఇక్కడి హెడ్మాస్టరుగారు మంచివారనీ, సహోపాధ్యాయులు స్నేహితులంటే ప్రాణాలు విడిచిపెట్టేస్తారనీ, విద్యార్థులు ఉపాధ్యాయుల కనుసన్నల్లో మసల కుంటారనీ, చివరికిక్కడి హోటలు సర్వర్లు, చిల్లరంగడి వర్తకులు, జట్కా బళ్ల సాహేబులు సైతం ఎంతో మర్యాదస్తులనీ విశదంగా వివరాలు ఏకరువు పెడితే మాత్రం ఈవిడకు వాస్తవం అవగతమౌతుందన్న నమ్మకమేమిటి?

తీరా తానింతగా కంఠశోష పెట్టుకున్న తరువాత రాజేశ్వరికి పరి క్రొత్త సందేహాలు స్ఫురించవని మాత్రం రమాపతి ఎలా అనుకోగలడు?

రమాపతికి మౌనమే శరణ్యమైంది.

కానీ ఎలాంటి దురభిప్రాయాలనైనా సమూలంగా తుడిచిపెట్టగలిగినది కాలం? కాలం గడిచినకొద్దీ రాజేశ్వరికి వాస్తవం తనంతటదే తెలిసివస్తుంది లెమ్మనుకున్నాడు రమాపతి.

కాలం దొర్లిపోతోంది.

నిన్నగాక మొన్ననే జరిగినట్టున్నా రమాపతి సతీసమేతుడై ఆ వూరిలో కాపురం పెట్టి, అప్పుడే నెలరోజులు గడిచిపోయాయి.

ఓరోజు ఉదయం లాబొరేటరీలో ఏదో ప్రయోగం కోసం రమాపతి ఉపకరణాలను ఎన్నుకుంటూ ఉండగా ఓ విద్యార్థి సుడిగాలిలా వచ్చిపడ్డాడు. ఎవరో ఒకరు ఆగంతకుడు ఆఫీసురూం వరండాలో తనకోసం వేచి ఉన్నా డట! 'రమాపతిగారెక్కడ, రమాపతిగారెక్కడ' అంటూ అతడు కనుపిం చిన వారినల్లా వాకబుచేసి పారేస్తుంటే వసారాలో కూర్చోమని చెప్పి, ఈ విద్యార్థి తనకోసం యిలా పరుగెత్తి వచ్చాడట!

ఎవరో బంధుసత్తముడు కాబోలు ననుకున్నాడు రమాపతి. ఇల్లు దూరకముమపే ఎలుకల రాకడని చెప్పనే చెప్పారు మరి!

బంధువైనా బాగుందేది! ఓ కుర్రాడిని తోడిచ్చి ఇంటికి పంపగలిగి

ఉండేవాడు రమాపతి. ఆగంతకుడు బంధువు కాదు. ఒక మానాన వదలి
పెట్టడు. తుమ్మబంకలా అంటుకున్నాడు. "సన్నగా, తుంగకాడలా ఉండే
వాడివి, ఇప్పుడు బాగా కండబట్టి పోయావురా రమాపతీ! రైటో రైటో!
మనిషన్నతర్వాత ఈ మాత్రం పుష్టిగానైనా ఉండాలి. నాకేం తెలుసు—
నువ్వీవూళ్లో ఉన్నావని! నా పనేమిటో, నా లోకమేమిటో! ఈరోజెవరో
కుర్రాళ్లు మాట్లాకుంటూ ఉండగా విన్నాను. 'మా సైన్సు మాష్టారు రమా
పతిరావుగారు ఎంత బాగా పాఠం చెబుతావనుకున్నావురా' అంటూ ఓ కుర్రా
తెగ మురిసిపోతున్నాడు. పేరు వినగానే నా బుర్రలో ఓ మెరుపు మెరిసింది!
దగ్గరికి పిలచి విచారిద్దును గదా, నా అనుమానం కాస్తా నిజమైపోయింది.
ఎలాగైతేనేం నిన్ను కనిపెట్టేశాను. అన్నట్టు ఎప్పుడొచ్చావు? ఏం కథ?
ఈవూరు నీకెలా ఉంది? ఎక్కడుంటున్నావు?...." మాటల ధోరణి సంగ
తలా ఉండగా ఆగంతకుడి వేషం కూడా చూపరులను ఆకర్షించ గలిగిందనే
చెప్పాలి. అతడు కాకీ ట్రౌజరు తొడుక్కున్నాడు. రంగు అరచొక్కా వేసు
కున్నాడు. ఆ దుస్తులపైన మసి మరకలకు కొదువలేదు. క్రాపింగు బుట్టలా
పైకిలేచింది. చెంపలపైన చెమట ధారలు ధారలుగా ప్రవిస్తోంది.

పది పదిహేనుగురు విద్యార్థు లక్కడ ప్రోగైపోయారు. టీచరుల
రూములోనుంచీ నలుగురైదుగురు ఉపాధ్యాయులుగూడా బయటికివచ్చేశారు.
జవాను రాఘవులైతే స్తంభంచాటున నిల్చుని ముసి ముసి నవ్వులు నవ్వు
కుంటున్నాడు.

ఉదయం తాను నిద్రలేచిన వేళ మంచిది కాదేమో ననుకున్నాడు
రమాపతి. లేకుంటే తనకిలా తలవంపులు కలిగేవికావు. ఎదుటి వ్యక్తి
ఒకానొక హైస్కూలు టీచరన్న పరిజ్ఞానం ఆగంతకుడికి బొత్తిగా ఉన్నట్టు
లేదు. అతని ధోరణి అతనిది. అతనివే ప్రశ్నలు! అతనివే సమాధానాలు.
కనుబొమలు పైకెత్తి ముక్కును క్రిందికి దించి ప్రసంగం మధ్య మధ్యలో
ఆశ్చర్యార్థకపు గుర్తులు!

అరగంటసేపు గాలివానలా పీడించిన తరువాత అతడు సెలవు తీసు
కున్నాడు. ధర తగ్గుట హెచ్చు కొరకే నన్నట్టుగా ఆ సెలవు తీసుకోడం

గూడా మళ్ళీ కలుసుకోడానికే! ఒకటీ, రెండు రోజుల్లో అతడు రమాపతిని ఇంటిదగ్గరే సంధిస్తా నన్నాడు. గృహిణితో పరిచయం చేసుకుని ఆలూమగల దాంపత్యం తాలూకు ముద్దూ ముచ్చటలు గమనిస్తా నన్నాడు.

"ఎవరోగానీ 'జూ'లో ఉండవలసిన వాడండీ రమాపతి గారూ!" అన్నాడు డ్రాయింగు మేష్టారు కోదండం.

"ఎందుకైనా మంచిది! ఎవడైనా పేషంటు పిచ్చి ఆసుపత్రి నుంచీ పారిపోయి వచ్చాడేమో తెలుసుకుంటావా రమాపతీ!" అన్నాడు లెఖ్ఖల టీచరు రామకృష్ణ.

"ఇంతకూ ఇత డెవరో, ఏవిధంగా మీకు పరిచితుడో చెప్పవయాలి రమాపతీ! అతగాడి ఉదంత మేమిటో ఆకర్ణింపగా కుతూహలం జయ్యేడివి" అన్నారు తెలుగు పండితులు అవధానిగారు.

"అబ్బే. పెద్దగా పరిచయ మేముందండీ! జీవితం కదా! ఎందరినో కలుసుకుంటాము. విడిపోతాము. అందరినీ జ్ఞప్తిలో ఉంచుకో గలమా!" అంటూ పొసగీ పొసగని మాటలతో తప్పించుకున్నాడు రమాపతి.

కానీ, అప్పటికప్పుడు తప్పించుకోడంతో ఏమైంది? ఇదేదో అప్రకృతిలా తనను వెన్నంటే సూచన లున్నాయి. వీడిపేరు కామేశం. చిన్ననాటి స్నేహితుడు. ఆ వీధిలోని కుర్రాళ్ళ కందరికి రింగ్ లీడరు వంటివాడు. మిత్ర బృందంలో వారిమాట కెదురుండేది గాదు. ఎటొచ్చీ వాడి నాన్న మిగిలిన వాళ్ళకు మల్లే కలిగినవాడు కాదు. అందుకు తోడుగా చదువుపైన వాడి శ్రద్ధ అంతంత మాత్రం! ఫోర్తుఫారంతో వాడి చదువు ఆగిపోయింది. ఆ తరువాత అత డొకటి రెండు పర్యాయాలు మాత్రం కనిపించాడు. ఒకసారి రైల్వేలో తాత్కాలికోద్యోగం ఒకటి చేస్తున్నట్టు చెప్పాడు. మరొకసారి కిళ్ళీకొట్టు వ్యాపారం లాభదాయకంగా ఉందన్నాడు.

ఆరోజు ఉదయం స్కూల్లోకి గాలివానలా వచ్చిపడిన కామేశం తానిప్పుడు స్థానిక బస్సుల కంపెనీకి సంబంధించిన మరమ్మత్తుల కార్ఖానాలో

పనిచేస్తున్నా నన్నాడు. అలాగైతే యిది వీడి సరిక్రొత్త అవతార మన్న మాట!

మధ్యాహ్నం ఇంటికి రాగానే రమాపతి భార్యను పిలిచి "మాదు రాజే శ్వరీ! మనపాలిటి కీవూళ్ళో ఒక తోకచుక్క మొలిచింది" అన్నాడు.

"తోకచుక్కా!" విస్తుపోయింది రాజేశ్వరి.

"అవును మరి! నిజమే! ఆ తోకచుక్క పేరు కామేశం. రేపో మాపో వాడు మనపైన విరుచుక పడిపోగల ప్రమాదం ఉంది. మనం జాగ్రత్తగా ఉండడం ఎంతైనా అవసరం! ఎందు కంటావా? ఆ కామేశంగా డున్నాడే. వాడు పొమ్మని మెడబట్టి గెంటినా చూరుపట్టుకుని వ్రేలాడే రకం!"

"అలాగా! అయితే మీ కెందుకూ, మీ రూరుకోండి. పొమ్మనకుండా పొగబెట్ట నాచేత నౌను" అంది రాజేశ్వరి.

కానీ, తీరా కామేశం వచ్చిన తరువాత పొగ బెట్టలేక పోయింది. రాజేశ్వరి. పళ్ళతో, పూలతో, ప్రసన్న వదనంతో మూర్తీభవించిన బంధు ప్రేమలా వచ్చాడు కామేశం! వచ్చినవాడు తెచ్చిన పళ్ళన్నీ భార్యా భర్తలకు పొలిచిపెట్టి తాను మాత్రం బాల్యస్మృతులు నెమరు వేసుకో సాగాడు. "అలాంటి రోజులిక రావురా రమాపతీ! తాటిముంజలు తిని, కడుపునిండా ఏటి చలమలో నీళ్ల త్రాగి యిసుక తిన్నెలపైన ఆటలాడుకుని ప్రొద్దుగ్రుంకు చీకటి పడ్డాక యింటిదారి పట్టి తల్లిదండ్రుల దగ్గర మెత్తగా నాలుగు చీవాట్లు తిని ఒళ్లెరుగకుండా పడి నిద్రపోయే రోజులు మళ్ళీ ఎప్పుడొస్తాయి? వయసు పైబడినకొద్దీ బరువులు, బాధ్యతలూ మనిషిని కృంగదీసేస్తాయి. తోడునీడగా ఉండే అర్ధాంగి, నవ్వుతూ ఎదురయ్యే బిడ్డలు, మనసిచ్చే స్నేహితులు లేక పోతే ఈ జీవితం పక్కా ఎడారే ననుకో!....అన్నట్టు మీ రిద్దరూ ఒకసారి మా యింటికి రావాలమ్మా రాజేశ్వరీ! ఎప్పుడో కాదు! నాలుగు వీధులు దాటి రావడానికి వాయిదాలు కూడా ఎందుకు?...."

"అలాగే అన్నయ్యా! తప్పకుండా వస్తాముగానీ మీరీపూట భోజనం చేయందే వెళ్ళగూడదు" అంది రాజేశ్వరి.

ఆచరణలోకి వచ్చేసరికి తన హెచ్చరిక బూడిదలో పోసిన పన్నీరయి పోయినందుకు లోలోపల అగ్గి మీద గుగ్గిలమై పోయాడు రమాపతి. కానీ పైకి మాత్రం "జానొనురా కామేశం! భోజనం చేసే వెళ్లు" .... అన్నాడు.

కానీ రమాపతి ఊహించినట్టు తిండికోసం అంతగా కక్కుర్తి పడేవాడిలా కనిపించలేదు కామేశం! "భోజనాని కేమమ్మా! ఎప్పుడో ఒకప్పుడు నా అంతట నేనే వూడిపడగలను. ఇంటిదగ్గర భోజనంచేసి వచ్చాను. గనుక యిప్పుడు మళ్ళీ రెండో విడత భోజనానికి సిద్ధమయితే మీకు పెట్టిన తృప్తీ ఉండదు. నాకు తిన్న తృప్తీ ఉండదు" అన్నాడు కామేశం.

ఉండి ఉండీ ప్రాణాంతకమయిన సందేహాలను బయటపెట్టే రాజేశ్వరి కామేశం వెళ్ళిపోగానే "అదేమిటండీ! ఇలాంటి మంచివాణ్ణి పట్టుకుని తోకచుక్క అనేశారూ!" అంటూ సాగదీసింది.

తాను నిల్చున్నచోట భూకంపం వాటిల్లినట్లు తలక్రిందులై పోయాడు రమాపతి. "అహఁ, అది, కాదు రాజేశ్వరీ! మరి....ముఖాన్ని చూచి గానీ మాటల్నిబట్టి గానీ మంచితనాన్ని నిర్ణయించగూడదు. నీ వనుకున్నాదే కామేశం —పైకి కనిపించేటంత మంచివాడు కాదు...."

తన సంజాయిషీ తన చెవులకే కృత్రిమంగా ధ్వనించడం వల్లనైతేనేమి, సంజాయిషీ పూర్తిగాక మునుపే రాజేశ్వరి వంట గదిలోకి వెళ్ళిపోవడంవల్లనైతేనేమి రమాపతికి మళ్ళీ మౌనమే శరణ్యమయింది.

* * *

మానవుడు దేనినుంచి దూరంగా ఉండాలనుకుంటాడో అది వాడికి మరింత సన్నిహితం గావడం విధి లీలకు సంబంధించిన విచిత్రాల్లో ఒకటి. కామేశం పట్ల తన కెందుకు వైముఖ్యం కలిగిందో రమాపతికీ తెలియదు. ఆ మాత్రం ఆత్మ పరిశీలనకు అతడు పూనుకోలేదు. బహుశా కామేశం సంస్కారము లేనివాడని రమాపతి భావించి ఉండవచ్చు. అతనితో కలిసి మెలిసి తిరగడం తన అంతస్థుకు తగని పనిగా అతనికి తోచి ఉండవచ్చు. వింతలలోకల్లా వింత మానవుడి మనస్సు. వెయ్యి ధాతువుల రసాయనిక సమ్మేళనం

లాంటిదది. ఎవడి మనస్సులో ఏముందో వాడికే తెలియనప్పుడు, ఇక రెండోవాడి మానసిక ప్రవృత్తుల్ని సూక్ష్మ వివరాలతో సహా విశ్లేషించి చెప్పడం ఎవడి తరం?

వీధిలో ఎక్కడైనా కామేశం తారసిల్లితే రమాపతి యిరకాటంలో తగులుకున్నట్టు గింజుకునేవాడు. ఆ తారసిల్లడం గనుక హైస్కూలు మిత్రుల సమక్షంలో నయితే రమాపతి ముంత పొగలో వూపిరాడనివాడిలా విలవిలలాడిపోయేవాడు. ఒకప్పుడు గత్యంతరం లేక కామేశం పలకరింపుల్ని పరామర్శల్నీ సహిస్తూ. ముభావంగా ఉండిపోయేవాడు. మరొకప్పుడు మొగ మాటానికి స్వస్తి చెప్పి దులపరించుకునేవాడు. కామేశం గాకుండా మరొక డెవడైనా అయితే అంతటితో రమాపతి అంతరంగంలోని యింగితాన్ని అవగతం చేసుకో గలిగి ఉండేవాడు. సంస్కారాన్ని గణించి చెప్పడానికి నిర్ణీతమైన కొలబద్దలు లేవు. కనుక కామేశం సంస్కారహీను డౌనా కాదా అన్నది వివాదాస్పదమైన విషయం. కానీ కామేశాన్ని గురించి నిస్సంశ యంగా ఒకమాట చెప్పుకోవచ్చు. పరేంగితాన్ని పసిగట్టే తెలివితేటలకూ ఆతడికి చాలా దూరం. కామేశం కందుకంలాంటి వాడు. గోడకు వేసిన మోదినకొద్దీ, మళ్ళీ కొట్టినవాడి వైపుకే తిరిగి రావడం కందుకం స్వభావం!

భార్యాసహితంగా వచ్చి రమాపతి తన యింట ఆతిథ్యం స్వీకరించ గలదన్న ఆశ అదొక ఎండ మావిలా నాలుగైదు మాసాలపాటు కామేశంతో దాగుడుమూత లాడుకుంది. "పిలుస్తూనే ఉన్నావుగా! ఎప్పుడో వస్తాములే!" అనేవాడు రమాపతి. నిజమే కాబోలు ననుకున్నాడు కామేశం. ఆఖరు కొక నాడు రమాపతి "రావాలని నిర్బంధ మేముంది! వస్తే వస్తాం. లేకుంటే లేదు" అనేశాడు.

అప్పటికీ మిత్రుడు తనతో పరిహాస మాడుతున్నాడేమో ననుకున్నాడు కామేశం.

మళ్లీ కొంతకాలం గడిచిపోయింది.

ఓ రోజు రాత్రి తొమ్మిది గంటలవేళ పాలార బోసినట్టు కాస్తోంది

వెన్నెల. పగటిపూట ఎండ దెబ్బలకు శోషిల్లిపోయిన ప్రాణాలకు హాయిగా చల్లటి గాలి వీస్తోంది. ఇంటికి వెనుక ఆరు బయట చాప వేసుకొని పడుకున్నాడు రమాపతి. దగ్గరగా లాంతరు వెలుగులో పత్రిక చదువుకుంటోంది రాజేశ్వరి. కామేశం అన్నీ అవకతవక పనులు చేయడానికే పుట్టాడనుకునే రమాపతి గూడా అలాంటి ప్రశాంత సమయంలో ఆతడు వూడి పడవచ్చు ననుకోలేదు. అనుకోకపోతేనేమ్, అంతపనీ జరిగింది. తలుపు దబదబా బాది, రాజేశ్వరి గడియ తీయగానే ముఖం లోపలికి చూపించి "మరేం భయపడొద్దు లేవమ్మా రాజేశ్వరీ! భోజనం చేసే వచ్చాను. కానీ కాపిన్ని మంచినీళ్ళు మాత్రం త్రాగలేకపోను" అంటూ రమాపతిని సమీపించాడు కామేశం!

మిత్రుణ్ణి కూర్చోమనైనా చెప్పలేదు రమాపతి. కామేశం చాప పైన కూలబడ్డాడు. కూర్చున్న కాసేపటికి "ఏమిటోరా రమాపతీ! ఇప్పుడే ఇంటికి వెళ్ళి స్నానంచేసి భోజనం చేశాను. ఎందుకో బుద్ధి నీపైకి మళ్ళింది. చక్కా వచ్చేశాను." అంటూ తలగడ పైకి ఒరిగిపోయాడు.

వచ్చినవాడు దూరంగా కూర్చోకుండా తాను పడుకున్న చాపపైన్నే కూర్చోడ మేమిటి? కూర్చున్నాడులె, అంతటితో ఆగకుండా తన శరీరాన్ని చిత్తు చిత్తు చేస్తూ తలగడపై వ్రాలి పోవడ మేమిటి? కామేశం ప్రవర్తన రమాపతి కేమాత్రము నచ్చలేదు. కానీ, ఆగ్రహాన్ని ఎలా వ్యక్తం చేయాలో అతనికి తోచడం గూడా లేదు.

"అన్నయ్యా! మంచినీళ్లు!" అంటూ పళ్లెరంలో ఉపాహారంతో సహా ప్రత్యక్షమైంది రాజేశ్వరి.

కామేశం ఫలహారం స్వాహా చేసి ఒక గ్రుక్కలో గ్లాసు ఖాళీ చేసేశాడు. గొంతుక సవరించుకుంటూ అసలు విషయానికి మెల్లిగా ఉపోద్ఘాతం ప్రారంభించాడు.

"మా ఆవిడ దగ్గర నేను తలెత్తుకుని తిరగలేక పోతున్నానురా రమాపతీ!"

"పోపో, తల దించుకునే తిరుగు!" ఎండుపుల్లను విరిచినట్లు పెళుసుగా బదులు చెప్పేశాడు రమాపతి.

వెన్నెల్లో కామేశం ముఖం వెలవెల పోవటం గమనించింది రాజేశ్వరి.

కామేశం నోటికి తాళం పడిన మాట నిజం. అత డెంతగానో ప్రయత్నించాడు. వూహుఁ. మాట పెకిలిందిగాదు. పది పదిహేను నిముషాలు మౌనంగానే గడిచిపోయాయి. కామేశం ఓ నిర్ణయానికి వచ్చినవాడిలా తటాలునలేచి కూర్చున్నాడు. కూర్చుంటూ" నీతో ఒక మాట చెప్పాలి రమాపతీ!" అన్నాడు.

"రహస్యమా!" అన్నాడు రమాపతి కామేశం ముఖంలోకి విచిత్రంగా చూస్తూ.

"వడ్లగింజలో బియ్యపు గింజ! రహస్య మేముంది నా తలకాయ! మిత్రుడివి. ఆంతరంగికంగా నా మనసులోని విషయాలు బయటపెట్టుకుందామని...."

"ఐతే పద" అంటూ రమాపతి లేచి విల్చుని చరచరా వీధిలోకి వచ్చేశాడు.

వీధిలోకి వచ్చిన రమాపతి ఒక్క విసురుతో ముందుకు తిరిగేసరికి, వెనువెంటనే వచ్చిన కామేశం ఓ అడుగు వెనక్కి వేసి "మరేం లేదురా రమాపతీ! నీకొక కొరత వుంటే వుండవచ్చు. మాటి మాటికి మిమ్మల్ని పిలవడమే గానీ, మేము యింటికి వచ్చి ఒకటి రెండు పూటలుండి పోవడం నీ మనసుకు బాధాకరంగానే ఉంటుంది. కానీ ఒక విషయం గమనించాలి నువ్వు. మీరైతే భార్యాభర్త లిద్దరు' మేము పిల్లా జల్లా కలిపి అర డజను మందికి తక్కువగా లేము. పైగా అమ్మాయిని చూద్దామంటే వట్టి మనిషిగా కూడా లేదు. ఇలాంటప్పుడు బంధువుల ఇళ్ళకు వెళ్లాలనీ, విందులు తినాలనీ, వినోదంగా కాలం గడపాలనీ ఆడవాళ్ళ కెన్నయినా కోరిక లుంటాయి...."

"ఇదిగో కామేశం!" కటువుగా అడ్డు తగిలాడు రమాపతి. "ఎవరి కోరికలు వాళ్ళకుంటాయి, ఎవరి హద్దులు వాళ్లకుంటాయి. నువ్వేమో పిలి

చావు. రావడమో, రాకపోవడమో నిర్ణయించుకునేవంతు మాది. మా పాటుకు మమ్మల్ని బ్రతకనివ్వకుండా నువ్వెందుకిలా తొందర పెడతావో తెలియకుండా వుంది....''

అలాంటి జవాబు వస్తుందని కలలోనైనా అనుకోని కామేశం కృంగిపోయాడు.

* * *

కాల మొక్క రీతిగా గడవదని చెబుతారు లోకజ్ఞానులు. సన్నగా పూలరెమ్మలా యింటిలో ఆ మూల నుంచి ఈ మూలకు చకచకా తిరుగుతూ వుండిన రాజేశ్వరి పండ్ల బరువుతో వంగిపోయిన రసాల వృక్షంలా బుట్టబొమ్మలా తయారైంది. కాపీ నవమాసాల కింకా వ్యవధి లేకపోలేదు. ప్రతి రోజూ మామగారి రాక కోసం ఎదురు చూస్తున్నాడు రమాపతి. మామగారు రాగానే రాజేశ్వరి పుట్టింటికి వెళ్ళిపోయింది. ఆ తరువాత తన బ్రతుకు 'సత్రంలో భోజనం, మఠంలో నిద్ర'కు డిటో అయిపోతుంది. గత్యంతరమేముంది? ఈ వియోగము తప్పనిసరి. ఆ మాటకొస్తే వియోగానంతరం సంయోగం నిర్భరానందహేతువు. ఇందుకు తోడుగా పొత్తిళ్ళలో చిన్నారి పాపతో సహా తరలి వస్తుంది రాజేశ్వరి. అప్పుడప్పుడూ ఆ సన్నివేశాన్ని తలచుకుని పులకితు డవుతున్నాడు రమాపతి.

ఓ రోజు ఉదయం నిద్రలేచి, కాలకృత్యాలు తీర్చుకుని పత్రికా పఠనం కోసం రీడింగు రూముదాకా వెళ్ళొచ్చాడు రమాపతి. గంట ఎనిమిదిన్నర కావస్తున్నా రాజేశ్వరి యింకా పడక పైనుంచి లేవలేదు. ''అదేమిటి రాజేశ్వరీ! ఇంకా తెల్లవారలేదా నీకు?'' అన్నాడు రమాపతి.

''ఏమిటోనండీ! ఒళ్లు ఒక మాదిరిగా ఉంది'' అంది రాజేశ్వరి.

అంతకు ముందు దినపత్రికలో పడవ మునకను గురించి విమాన ప్రమాదాలను గురించి, చదివిన రమాపతి, అవన్నీ తన వెనుకనే వచ్చి ఒక్కుమ్మడిగా ఇంటిలోపలికి జొరబడినంతగా గగ్గోలు పడిపోయాడు. నిల్చున్న చోట నిల్చోలేక, కూర్చున్న చోట కూర్చోలేక ఏవేవో సందేహా

లతో, భయాలతో కలవరపడిపోయాడు. శలవు చీటి వ్రాసి హెడ్మాస్టరుగారికి పంపించాడు. ఆ తరువాత ఏం చేయడానికి పాలుపోక "వెళ్లి డాక్టరమ్మ గారిని పిలుచుకు రమ్మంటావా రాజేశ్వరీ!" అన్నాడు.

"డాక్టరమ్మగారెందుకుగాని, ఒకసారి ఎదురింటి బామ్మగారిని వచ్చి వెళ్ళమని చెప్పండి" అంది రాజేశ్వరి.

తన విధానానుభవాల పరిజ్ఞానంతో రాజేశ్వరిని పరీక్షించి చూచిన బామ్మగారు "చూడు నాయనా ఇదేమిటో విడ్డూరంగా ఉంది. అమ్మాయి నెలలు పూర్తికాలేదంటుంది. కానీ, చెబుతున్న లక్షణాలనుబట్టి ఆమాట నమ్మ డానికిలేదు. ఎందుకైనా మంచిది. మీవాళ్ల కెవరికైనా కబురుపెట్టు"అంది.

మధ్యాహ్నం హోటల్లోనుంచీ కారియర్‌లో భోజనం తెప్పించాడు రమాపతి. తింటేగానీ ఒప్పుకోనని మొండికెత్తి కూర్చున్న రమాపతి సంతృప్తికోసం రాజేశ్వరి పట్టెడన్నంతిని, తిన్నదంతా వమనం చేసుకుంది.

మామూలు ప్రకారం సాయంకాలపు వాహ్యాళికి బయల్దేరిన హైస్కూలు మిత్రులు వీధిలో నిల్చుని ఎలుగెత్తి రమాపతిని పిలిచారు. తెరలు తెరలుగా దిగులు పారాడుతున్న ముఖంతో రమాపతి ఈవలికి వచ్చి హఠాత్తుగా తానెదుర్కోవలసి వచ్చిన పరిస్థితిని గురించి స్నేహితులతో చెప్పుకున్నాడు. మిత్రులందరూ ఏకకంఠంతో సానుభూతి ప్రకటించారు. "ఈ వూళ్ళో మంచి వైద్య సహాయం లభిస్తుందా రమాపతీ!" పట్నానికి తీసుకెళ్లి ఉంటే బాగుండేది" అన్నారొకరు. "ఎందుకూ! డబ్బివ్వగలిగితే రాణీపేటమండి నర్సు పరుగెత్తుకుంటూ రాదూ" అన్నారు వేరొకరు. "ఐనా డాక్టర్లు, నర్సులు చేయగలిగింది మాత్రం ఏముంది? ఎవరైనా ఆత్మీయులు అండగా వుండటం అవసరం" అన్నారింకొకరు. ఎవరికి తోచిన అభిప్రాయాన్ని వారు సెలవిచ్చి, నవ్వులతో, కేరింతలతో దూరంగా వెళ్ళిపోతున్న మిత్రుల్ని చూస్తూ వేడిగా నిట్టూర్చాడు రమాపతి.

అర్థరాత్రివరకూ ఉండి ఉండి నొప్పులు కనిపించాయి. ఆ పైన రాజేశ్వరికి కాస్తా కునుకు పట్టింది. కానీ, రమాపతి మాత్రం నిద్రపోగలిగిన

స్థితిలో లేదు. ఇలాంటి సందర్భాల్లో ఏ సమయానికి ఎలా ఉంటుందో వూహించడం కష్టం. దేవుడి దయవల్ల ప్రస్తుతానికేమీ తొందరలేకపోతే రేపు సాయంకాలానికల్లా అత్తగారిని తీసుకురావచ్చు ననుకున్నాడు.

మిగిలిన రాత్రి ప్రశాంతంగానే గడిచింది. ఉదయం మొదటి బస్సుకే అత్తగారి వూరికి బయల్దేరాడు రమాపతి. బస్సు పాతికమైళ్ళవేగంతో పరుగెడితే మూడుగంటల్లో ఆవూరు చేరుకోవచ్చుకానీ, వాయువేగాన్ని మించి పయనించే మనోవేగంముందు బస్సువేగం ఏ పాటిది? పోగా మార్గమధ్యంలో ఎదురైన ప్రతి నాష్టా అంగడి దగ్గరా బస్సు ఆగిపోతూ వచ్చింది. అయినటీ నీళ్లన్నీ త్రాగి ఆపసోసాలు పడిపోతున్న మహోదరుడైన బస్సు డ్రయివరు తన కాయాన్ని కదలిస్తున్నంత మెల్లగానే బస్సునుకూడా తరలిస్తున్నాడు. మధ్యాహ్నం పన్నెండు గంటలకుగానీ బస్సు గమ్యస్థానం చేరలేకపోయింది. రిక్షాచేసుకుని అత్తగారింట వ్రాలాడు రమాపతి. వ్రాలగానే ఏమైంది? మూసిన కిటికీలతో, వేసిన తలుపులతో బిగించిన తాళాలతో ప్రత్యక్షమైన అత్తగారింటి ఎదుట చేష్టలు దక్కి విగ్రహంలా నిల్చుండిపోయాడు రమాపతి.

కోలుకున్న తర్వాత వాకబు చేయగా తెలిసింది—అత్తమామ లిద్దరూ యాత్రా స్పెషల్లో బయల్దేరి పూరీ, కలకత్తా మీదుగా ఉత్తరదేశ యాత్రలకు వెళ్ళిపోయారని!

ఆ క్షణాన బంధువర్గం మీద రమాపతికి పట్టరానంత కోపం వచ్చినమాట వాస్తవం! ప్రసవాని కింకా ఒకటి రెండు మాసాల వ్యవధి ఉండవచ్చునని తాను సూచనగా జాబు వ్రాసిన మాట నిజమే! ఐతే మాత్రం? తీర్థయాత్రల కిదా సమయం? అసలీ అత్తారింటి వారికి ఆదినుంచీ తనపట్ల చిన్న చూపు కద్దు! మొదటి అల్లుడేదో ఇంజనీరు. రెండో అల్లుడు బాగా ఆర్జిస్తున్న లాయరు. ఎటొచ్చీ మూడో అల్లుడైన తాను మాత్రమే బడి పంతులు.

'ఛా ఛా, ఏం మనుషులు!' అనుకున్నాడు రమాపతి.

అత్తగారి వూరునించి రమాపతి సరాసరి స్వగ్రామానికి బయల్దేరాడు. రాత్రి పది గంటలప్పుడు గ్రామంలో బస్సు దిగాడు. వసారాలో మంచం పైన పడుకున్న నరసింహంగారు, ఓ కార్డు ముక్కయినా లేకుండా హఠాత్తుగా వూడిపడిన కుమారుణ్ణి చూచి కంగారు పడిపోయారు? "ఏ మిట్రా రమాపతీ! ఏమైంది? అమ్మాయి కులాసాగా ఉంది కదూ?" అంటూ పరామర్శించారు.

"కులాసాగానే ఉంది నాన్నా! నొప్పులు ప్రారంభమౌతున్నట్లున్నాయని చెబితే అమ్మను పిలుచుక పోదామని వచ్చాను" అన్నాడు రమాపతి.

"మీ అమ్మను పిలుచుకపోదామనా! అందుకోసం వచ్చావా?అదెక్కడుందిరా రమాపతీ! మీ అక్కయ్యకు ప్రసవం చేయడానికి అని మొన్ననే హిందూపురం వెళ్ళిపోయిందిగా! ఐనా అమ్మాయికి ఇది మొదటి ప్రసవం గదా? రమాపతీ! ఆవిడ పుట్టింటివాళ్లేమయిపోయారు?" విస్తుపోతూ అడిగారు నరసింహంగారు.

రమాపతి హతాశుడై అరుగుపైన చతికిలబడి పోయాడు.

* * *

మరునాటి ఉదయం తొమ్మిది గంటలకు భూమి గుండ్రంగానే ఉందని ఋజావు చేస్తూ క్రితం రోజు ఉదయం ఎక్కడైతే బయల్దేరాడో అక్కడే బస్సు దిగాడు రమాపతి. సుడిగాలిలో నూలు తెగిన గాలిపటంలా కొట్టుకుపోతూ అతడు సందు మలుపు తిరగగానే తల పైకెత్తి ఇంటి వైపు చూచాడు. చూచిన క్షణంలో అతడి శరీరంలోని రక్తం నరాల వెంట శరవేగంతో పరుగులు తీసింది. ఎందుకోగానీ ఇంటి ఎదుట జనసందోహం క్రోగైంది. రమాపతి యిప్పుడు నడవడం లేదు. పరుగెడుతున్నాడు.

"శుభవార్తరా రమాపతీ! నోటి నిండుకూ చక్కెర పోసిన తర్వాత గాని చెప్పను. తెరువు. నోరు తెరువు"—చక్కెర కోసం చేతులు చాస్తున్న కుర్రాళ్ళ నందరిని తొలగ ద్రోసుకుని రమాపతి ఎదుటకు వచ్చేస్తున్నాడు కామేశం.

"బలేవారండి మీరు! లేకపోతే లోపలికైనా రానివ్వకుండా వీధిలోనే నిలబెట్టేస్తారా! నాన్నగారు కనిపించలేదనేమో, కుర్ర కుంక అదేపనిగా గొంతు చించుకుంటున్నాడు" అంది తలుపు చాటున నిల్చున్న కామేశం భార్య.

మిత్రుడి యెదుట ముఖాముఖిగా నిల్చోలేక ముఖం అవతలికి త్రిప్పు కున్నాడు రమాపతి. పుత్రోదయం మాటకేమి గాని రమాపతికి జ్ఞానోదయం కూడా అయింది. జ్ఞానోదయానికి చిహ్నాలే ఆతడి కళ్లల్లో నిలిచిన ఆనంద బాష్పాలు!



# రుచుల జాడ వేరు

ఒకటే పండుకు రెండు రుచులా!

అదెలా సంభవం?

ఇదిగో, ఇలాగే!

*　　　　*　　　　*

గంట పదకొండున్నర.

జరుగుతున్నది మండు వేసంగి.

చెప్పులులేని పాదాల్ని ముప్పతిప్పలు పెట్టి, గొడుగుల్లేని తలల్ని మాడ్చి, వాతావరణంలో సెగల్ని రగిలించి, భూమిని పొయిమీది పెనంలా తయారుచేసి, మిట్టమధ్యాహ్నం దగ్గిర పడుతున్నకొద్దీ నిప్పుల్ని చెరిగిపోస్తున్న ఎండలు!

ఆ ఎండల సముద్రంలో చల్లటి దీవిలాంటి పిమెంటు కట్టడం. అసలే నిమ్మ, దానికి నీరెత్తడంలా ఆ భవనం చుట్టూరా క్రోటన్ మొక్కలు, మల్లె పాదులు, సీమభాగిచెట్లు. పైగా, ఆ రోజు శనివారం కూడా నేమో, తలంటుకుని స్నానంచేసి, వరాండాలో వాలుకుర్చీలో విశ్రమించిన అనంతరామయ్యగారికి ఆ పరిసరాల్లో, ఆ పరిస్థితుల్లో హాయిగా నిద్రే రావలిసింది. అబ్బే, ఎక్కడి నిద్ర! రెప్పపాటులేని ఆ కళ్ళలోనించే వెలువడుతున్న చూపులన్నీ రోడ్డు పైనే తారట్లాడుతున్నాయి. బయటకాస్తున్న ఎండలకు సమాంతరంగా ఇక్కడ ఆయన మనసు ఎడతెగకుండా కారాలు, మిరియాలు నూరుతూనే ఉంది....

"ఓరి భడవా! గడిచిన మూడురోజులనించీ, నీ అదృష్టం బాగుండిపోయింది! ఎల్లకాలం ఇలాగే జరుగుతుందని అనుకున్నట్టయితే నువ్వు వట్టి బుద్ధిహీనుడివి! నీ కాళ్ళూ, చేతులూ నీ దగ్గిర పదిలంగా ఉండే యోగమే

కనక నీకుంటే, నువ్వీరోజు ఈ ఇంటి గుమ్మం తొక్కావు. తొక్కావో నీకు కీడు మూడిందన్నమాటే! దుబ్బు జుత్తు- లోతుకుపోయిన కళ్లు. బవిరి గడ్డము చింపిరిగుడ్డలు ఈ హంగులతో కూడిన పిచ్చివాలకమే నీకు ఏకైక క్వాలిఫికేషనట్రా ఇడియట్! ఆ క్వాలిఫికేషన్ చూచుకొన్నట్టిదై. మారు మాట లేకుండా నీకు ముప్పూటలా తిండి పెట్టడానికి పూచీపడిందిట్రా లోకం! ఇంగ్లీషువాడి హయాంలో పంక్చువాలిటీ తప్పని ఐ. పి. యస్. ఆఫీసరులా టంచనుగా గంట పన్నెండు కొట్టేసరికి నాకు ప్రత్యక్ష మౌతావట్రా నువ్వు! ఈ వీధి నీ కెవరిచ్చిన రాజమాన్యంరా ఫూల్! ఈ రోజు నువ్వు రానే రావాలి? ఈ గుమ్మంలో కాలు మోపనే మోపాలి! మోపుతూ గొంతెత్తి "అమ్మా! పట్టెడన్నం" అంటూ అరవనే అరవాలి! ఇప్పుడు మాట లెందుకు? అప్పుడు నీ కేమవుతుందన్న విషయం నీకే తెలుస్తుంది. అహాఁ, అది కాదు. అనంతరామయ్యగారి మాటంటే అంత ఖాతరా లేకుండా పోయిందుట్రా నీకు!

అనంతరామయ్యగారి నుదుట ఇంటు గుర్తులాంటి గీత లేర్పడ్డాయి. పెదవులు బిగుసుక పోయాయి. కళ్ళు కుంచించుకున్నాయి. పన్నెండు కొట్టే సరికి అక్కడ హాజరయ్యే యాచకాధముడికి అనంతరామయ్యగారి ఈ ముఖ భంగిమ ఎంతటి అపాయకరమయినదో తెలియదు. అదే విధివైపరీత్యం! ఆ మాట కొస్తే ఆ వెధవ కొకటి తెలిసింది గనకనా, ఇంకొకటి తెలియదనుకో డానికి! మూడురోజుల కిందటివరకూ అనంతరామయ్య గారొక గొప్ప ఆఫీసరుగా పనిచేస్తుండేవారని వాడికి తెలియదు. అప్పట్లో ఆయన కాలింగ్ బెల్ నొక్కితే బంట్రోతులు మరమనుషుల్లా బరాబరులు పలుకుతుండేవారనీ, కన్నెత్తిచూస్తే గుమాస్తాలు గడగడలాడిపోయేవారనీ, బడా బడా ఆసాములు ఆయన దర్శనంకోసం వరాండాల్లో పడిగాపులు పడుతూండేవారనీ వాడికి తెలియదు!

"అవునండీ, నిజం! అనంతరామయ్యగారలా అప్రతిహతంగా ఆఫీసును ఏలుకుంటూ వుండగా విధికి కన్నుకుట్టింది. అంతే మరేమీలేదు. యాభై అయిదేళ్ళు పూర్తి అయ్యాయి. ఉగాది వెళ్ళిన తరవాత నెలరోజులకు ఆయన పదవీ విరమణ చేశారు. ఆ పండుగ నొక నెలరోజులు వాయిదావేసి,

ఆఫీసు సిబ్బంది అయ్యగారి పదవీ విరమణోత్సవాన్ని తమ జీవితాలకే నవ యుగాదిలా వైభవంగా జరుపుకున్నారు!

అనంతరామయ్యగారు శాశ్వతంగా ఇంటికి వచ్చేశారు.

ఇప్పు డొక మాట చెప్పాలి.

"స్థానబలిమిగాని తన బలిమి గాదయా" అన్న వేమన్నగారి సూక్తిని ఆధునిక కాలానికి అన్వయిస్తూ ఓ కవిగారు "అగ్గి బుగ్గి రాము డాఫీసులో. యింట, యింతిగారి మాట కెదురులేదు" అన్నారు. అనంతరామయ్యగారి ఆచరణలో ఆ మాటకు ఉప్పు పుట్టింది గాదు. ఆయన ఆఫీసులో అగ్గిరాము డైతే, ఇంట్లో ఆ అగ్గిపైన గుగ్గిలం రాముడు! అనంతరామయ్యగారికి ఇద్దరు కూతుళ్ళు. ముగ్గురు కొడుకులు. ఆ కూతుళ్ళు పెళ్ళిళ్ళు కాగానే తండ్రిని గురించి తలపెట్టడం మానేశారు. కొడుకులు రెక్కలు రాగానే రివ్వున పై కెగిరిపోయారు! అయ్యగారి పదవీ విరమణతో ఆఫీసు సిబ్బందికి నవజీవనా నందం లభించింది. ఎటొచ్చీ అనంతరామయ్యగారి జీవితాన్ని అంటిపెట్టుకుని ఉండవలసిన అవసరం ఒక్క పార్వతమ్మకు మాత్రం తప్పలేదు.

అవును, మరి! పార్వతమ్మ అనంతరామయ్యగారి ధర్మపత్ని.

పదిహేనో ఏట పార్వతమ్మకి పెళ్లయింది. మూడు పదుల పైచిలుకు సుదీర్ఘకాలాన్ని ఆమె అనంతరామయ్యగారి సాహచర్యంలో ఎలా గడిపిందో లోకులకు అర్థంకాదు. ఆయన నవ్వడే! చనువివ్వడే! ఇంట్లోగూడా తను ఆఫీసరునన్న విషయం మరిచిపోడే! ఈ పరిస్థితుల్లో తారురోడ్డు పైన కొత్త కారులా ఆ సంసార శకటం అంత సాఫీగా సాగిపోవడం ఎంత విచిత్రం! అయ్యో! ఎంతటి విచిత్రమైనా అదలా జరగడానికి కొక కారణం ఉండక తప్పదు! ఏమిటది? బొగ్గులువేసి నిప్పు రగిలించి. బట్టల్ని తోమడానికి సిద్ధం చేసి పెట్టిన ఇస్త్రీ పెట్టెలాంటి వ్యక్తి అనంతరామయ్యగారు. ఎక్కడ తాకినా చుర్రుమంటుంది ఇస్త్రీపెట్టె. ఒక్క పిడి పట్టుకుంటే తప్ప! ఆ పిడి ఎలా పట్టుకోవాలో, ఆ పెట్టె ఎలా వాడుకోవాలో ఒక్క పార్వతమ్మకే తెలుసు!

అనంతరామయ్యగారు రిటయిరై ఇంటివగ్గరే నిలిచిపోయిన మొదటి

రోజు ఉదయం ఆయనకు ఉపాహారం అందిస్తూ ఇలా అంది పార్వతమ్మ: "నిండుగా ముప్ఫయి ఆరేళ్ళు చేశారు గదండి ఉద్యోగం! ఇంకా ఆ కొలువు పైన మమకారం దేనికి? మనం ఆ ఆఫీసుకు చేసింది చాలు, అందువల్ల మనకు దక్కింది చాలు. తలదాచుకోడానికి ఇల్లుంది. ప్రావిడెంటుఫండు ఏ బ్యాంకులో వేసి పెట్టినా, ఆ వడ్డీ డబ్బుతోనే బ్రతుకు సాగిపోతుంది. ప్రొద్దు పోవడానికి పిల్లలెవరైనా దగ్గరుంటే బాగుండేది. పోనివ్వండి. లేనిదానికేం చేద్దాం! ఎందర్ని కన్నా, ఎందర్ని పెంచినా చివరికి మీకు నేను నాకు మీరే తోడుగా మిగిలాం! పెద్దదాన్ని, చిన్నదాన్ని నేను చెబుతున్నానుగా, ఇక పైన మీరు ఏ ఆలోచనా పెట్టుకోకండి! ఉదయం ఆరు గంటలకు లేవండి! స్నానం చేయండి. టిఫిను తీసుకుని అలా వాలు కుర్చీలో కూచోండి. అక్కడ మీరు దినపత్రిక ఒకసారి ఆదినుంచి తుదిదాకా చూచి ముగించే సరికి, ఇక్కడ నా వంట పని పూర్తవుతుంది. భోజనం చేసి, ఎండలు చల్లబడేదాకా మంచంపైన కాస్త మేను వాల్చండి. సాయంత్రం వేళల్లో అలా రీడింగు రూముకో, దేవాలయానికో, బజారుకో వెళ్ళిరండి. ఏ ఏడుకో, ఎనిమిదికో భోజనం చేసి, రేడియో దగ్గర కూర్చున్నామంటే, అవతల రేడియో స్టేషన్లయినా కట్టేయాలి, ఇవతల మనకైనా నిద్ర పట్టాలి."

'ఏడ్చినట్టె ఉందిలె'మ్మనుకున్నారు అనంతరామయ్యగారు. నిజం చెప్పాలంటే ఆయనకు భార్యపట్ల లోలోపల పట్టరానంత కోపంగా ఉంది. ఔరా, ఎంత చోద్యం! ఇంతకాలానికీవిడ తనపట్ల సానుభూతి ప్రకటించే స్థితిలోకి రాగలిగిందన్నమాట! మరింత సూక్ష్మంగా ఆలోచిస్తే, ఈ మెగారి గృహసామ్రాజ్యంలో ఇకపైన తానొక ఖైదీమాత్రుడన్నమాట! ఈవిడ గారు నిద్ర లేవమంటారు. తాను లేవాలి. పడుకోమంటారు, పడుకోవాలి. బజారుదాకా వెళ్ళి రమ్మంటారు, అందాకా వెళ్ళి వెనుదిగిరి చక్కా ఇంటికే వచ్చేయాలి. అబ్బే ఈ వరస తనకేమీ రుచించలేదు!

కాని, అంతకు మించి తానింక చేయగలిగిందేమిటో అదీ స్ఫురించదు.

ఎందుకో తెలియదు, ఎవరిపైనో తెలియదు అనంతరామయ్యగారిలో ఆగ్రహం అలుముకుంటూంది.

ఇదివరకూ ఆయన ఆగ్రహం ఎప్పుడు తలచుకుంటే అప్పుడే బహిర్గతం కావడానికి వెయ్యి మార్గా లుండేవి. ఇప్పు డన్నిమార్గాలూ బంద్!

సరిగ్గా ఇట్టి ఘట్టంలోనే ఆ యాచక దౌర్భాగ్యుడు, కాదా దౌర్భాగ్య యాచకుడు అనంతరామయ్యగారికి ప్రత్యక్షమయ్యాడు!

"అమ్మా! పట్టెడన్నం పెట్టు, తల్లీ! నీ బిడ్డలు, పాపలు చల్లగుండా లమ్మా...."

"ఒరే రాస్కెల్! ఏమిట్రా నీ అరుపులు? కొంచెం మెల్లిగా అరిచి చావరాదూ? అవతలి వ్యక్తి ఒక ఫర్లాంగు దూరంలో ఉన్నట్టు అలా గొంతు చించుకుంటా వెందుకూ? అహఁ, అదికాదు. అంత ఆకలిగా ఉన్నవాడివి. నీ కింత బిగ్గరగా అరిచే బలం మాత్రం ఎక్కడినించి వచ్చిందీ అని!"

అనంతరామయ్యగారి మీమాంసకు అడ్డు తగులుతూ అంతలోనే పార్వతమ్మ అన్నపుగిన్నెతో వెలుపలికి వచ్చేసింది.

అది మొదటి రోజు.

లేదా, అనంతరామయ్యగారి యాచకవిదారణ ప్రహసనంలో మొదటి రంగం.

అయినవాడికీ, కానివాడికీ ఇల్లాలు ఇంటిని ఇలా దోచిపెడుతూంది కాబోలు ననుకున్నారు అనంతరామయ్యగారు.

కర్మ! ఈ ముసలా డెక్కడినించి దాపురించాడని గొణుక్కున్నాడు బిచ్చగాడు.

'ఈ బిచ్చగాడు రావడమూ మానెయ్యడు. వేస్తే వేసుకోనిమ్మని ఊరుకోడమూ, ఈయన చేతగాదు. ప్రతి రోజూ మధ్యాహ్నా మయ్యేసరికి ఇదొక గొడవగా యారౌతుందే మో!' అనుకుంది పార్వతమ్మ.

మరునాటి మధ్యాహ్నం 'అమ్మా! పట్టెడన్నం!' అన్నమాట వినిపించిందో లేదో క్రుద్ధభుజంగంలా బుస్సుమన్నారు అనంతరామయ్యగారు.

ఆ కాడికీ "వాడితో మీ కెందుకండీ! ఊరుకుందురూ!" అని భర్తను అనునయింప జూచింది పార్వతమ్మ.

"వాడితో నా కెందుకా! ఛీసి వెర్రిమొగమా! వాడంటే ఏమిటను కున్నావు నువ్వు! ఇలాంటివాళ్ళే పచ్చిదొంగలయ్యేదీ. ప్రాణాలుతీసేదీ! వాడి కేం కాళ్లులేవా. కళ్లులేవా! ఏ కారణాన్ని చూపించి వీడు బిచ్చమెత్తుకుంటున్నట్టు? లేదంటే కారణం ఒక్కటే! లోకంలో నీలాంటి తిక్కమనుషులు కొందరుంటారు. అడగని వాడిది పాపంగా ఇలా కొరగాని దానధర్మాలు చేస్తుంటారు. అబ్బే. నీకు తెలియదు. ఇలాంటివాళ్లను ఎంకరేజ్ చేయడమే పాపం! రేపటినించీ వీడి కిలా అన్నం పడవేయడానికి నే నొప్పుకోను."

ఈ మాటల్ని అనంతరామయ్యగారు భార్యను ఉద్దేశించే అన్నారు. కానీ తన ఇంగితాన్ని ఆ భిక్షుకుడు గూడా గ్రహింపగలడనే ఆశించాడు. కానీ ఆ ఇద్దరిలో ఏ ఒక్కరుగూడా తన హెచ్చరిక వినిపించుకోలేదన్న విషయం మరునాడు మధ్యాహ్నం ఋజువైంది.

తన మామూలు వినాదంతో ఆ యాచకుడు సూటిగా లోపలికి రానే వచ్చాడు. ఇటు తిరిగి చూచేసరికి ద్వారం దగ్గర అన్నపూర్ణలా పార్వతమ్మ ప్రత్యక్షమైంది. వాడు జోలె పట్టాడు. ఈమె వాడి భాగాన్ని వాడికి వడ్డించి తిన్నగా తన దారిని తాను లోపలికి వెళ్లిపోయింది. వెళుతూ వెళుతూ ఆ బిచ్చగాడు తనవైపు ఓరకంటితోనైనా చూచాడు కాదు.

అనంతరామయ్యగారు విభ్రాంతపోయారు. దిచ్చపాటులో రాతిబొమ్మలా బిగుసుకుపోయారు.

ఇటు పార్వతమ్మ, అటు బిచ్చగాడుకూడా అనంతరామయ్యగారి మూకీ భావానికి తమ తమ పద్ధతుల్లో భాష్యం చెప్పుకున్నారు.

ఈపాటి చిన్న విషయానికి రాద్ధాంతా లెందుకని ఈయన ఉపేక్ష వహించారేమోనన్న భావనలో పార్వతమ్మ కొకింత సంతృప్తి కలిగింది.

ఈయనగారి మాటకున్న చెల్లుబాటు ఇంతే కాబోలు ననుకున్నాడు బిచ్చగాడు।

అనంతరామయ్యగారీ దఫా దండతాడిత భుజంగమే అయిపోయారు।

విషం పాము కోరల్లోనే ఉందనుకుంటాం। అది పొరబాటు. దుర్గుణాలన్నింటిలోనూ అది ఎంతో కొంత మేరకు ఉన్నట్టే। అవి మొదట మనసును, దాని ద్వారా శరీరాన్ని కలుషితం చేస్తాయి. ఆ క్షణాన అనంతరామయ్యగారి అంతరంగంలో అంకురించింది కోపమే। అది తరవాత కసిగా మారింది. ఆ రోజు రాత్రి ఆయనకు వచ్చినవన్నీ బిచ్చగాళ్లను గురించిన కలలే। వాళ్లు తోడేళ్లుకాగా ఈయన వేటకుక్కగా మారి వాటిని చీల్చి చెండాడాడు. వాళ్లు ఎలుకలుకాగా తాను మార్జాలమై కసిదీరా వాటిని మెసవి పొట్ట నింపుకున్నాడు।

రాత్రి గడిచి తెల్లవారింది.

ఆ నాడే శనివారం.

విషం తెలకెక్కడంవల్ల ముఖం క్రమక్రమంగా వికృతంగా మారిపోయింది. ఆనాటి ఉదయంనించీ అనంతరామయ్యగారి ముఖభంగిమ అదో రకంగా ఉంది. నెల రోజులకు మునుపు అలాంటి ముఖకవళికల్లో గనుక అనంతరామయ్యగారు కనిపించి ఉంటే, ఆయన క్రింది గుమాస్తాలు ఆ రోజు ఎక్స్ప్లనేషన్లు అడగడం, ఇంక్రిమెంట్లు కట్ కావడం, సస్పెన్షను, ఊస్టింగులు విరుచుకుపడడం లాంటి అవాంతరాలు తప్పవని భావించి ఉండేవారు.

గంట పన్నెండు కావడాని కింక అయిదు నిమిషాలే వ్యవధి।

ఏదైనా అదృశ్య శక్తి ప్రభావంవల్ల ఆ బిచ్చగాడు తన బారినించీ తప్పించుకుంటాడేమోనన్న అనుమానం అనంతరామయ్యగారికి కలగక పోలేదు. కానీ కొద్ది క్షణాల్లో ఆ అనుమానాన్ని పటాపంచలు చేస్తూ అరుపు వినిపించింది.

''అమ్మా! పట్టెడన్నం, తల్లీ!'' అదమరిచిన వాడిలా భిక్షుకుడు గేటు దాటుకుని లోపలికి వచ్చేశాడు.

"పట్టేడన్నమా! ఎక్కడుందిరా అడ్డగాడిదా! ఇక్కడెవరో నీకు బాకీ పడ్డట్టుగా అడుగుతావేం రాస్కెల్? చూడు, నీ పని చెబుతాను! కుక్కను కొట్టినట్టుగా కొట్టాలిరా నిన్ను!" చేతికర్రతో సిమెంటుమెట్లను తాటించు కుంటూ కిందికి దిగి, నేరుగా భిక్షుకుడివైపు దూసుకవెళ్లారు అనంతరామయ్య గారు.

హఠాత్తుగా ఒక క్రూరజంతువు కనిపించేసరికి తటాలున పైకెగిరి చెట్టుకొమ్మను పట్టుకున్నట్టుగా, భిక్షుకుడు నాలుగడుగులు వెనక్కివేసి గేటు కావలకు వెళ్ళి నిల్చున్నాడు. సురక్షిత ప్రదేశంలోకి చేరుకున్న తరవాత కాస్త నిర్భయంగా జంతువు చేష్టలను పరికిస్తున్నట్టుగా కొద్దిక్షణాలపాటు అనంత రామయ్యగారి వైపు కన్నార్పకుండా చూచాడు. అంతటి పెద్దమనిషికే లేక పోయిన సంయమనం తన కెందు కనుకున్నాడేమో, వాడు కూడా నోరు తెరిచేశాడు

"గొప్ప దరమప్రెబువ్విలే బాబూ! ఎలాగైతేనేం, బిచ్చగాణ్ణి కొట్ట డానికి పిట్టపిడుగల్లే లేచొచ్చేశావు! నీలాంటి దొడ్డదొరలే వీధికి వలుగురుంటే ఈ మాత్రం వానలైనా కురవ్వు!...."

"ఏదీ, ఏమన్నావురా కుంకా!" పామును కొట్టడానికి పైకెత్తినట్టుగా కర్రను పైకెత్తి పట్టుకుని అనంతరామయ్యగారు ఒక్క ఉదుటున ముందరికి దూకారు. చెడిందిరా పని అనుకున్నాడేమో, బిచ్చగాడు రోడ్డుపైకి దౌడు తీశాడు. అలోగా అనంతరామయ్యగారి చేతిలో కర్ర రోడ్డువైపు వరతెంచింది. ఒక కాలు ముందుకువేసి, ఇంకొక కాలు పైకెత్తుతున్న క్షణంలో కర్ర కాళ్ళకు బంధంలా అడ్డుతగలడంతో భిక్షుకుడు తుమ్మమొక్కలా దభేలున రోడ్డుపైన కూలిపోయాడు.

వాడు మళ్లీ పైకి లేవడానికి ఒకటి రెండు నిమిషాలే పట్టింది. లేచి నిల్చోగలిగిన తరువాత అతడు తనపైపు తానొకసారి పరకాయించి చూచు కున్నాడు. శరీర యంత్రానికి భాకీ ప్రమాదాలేవీ వాటిల్లినట్టులేదు. లేదంటే ముక్కుదూలం అదిరిపోయింది. రెండు పండ్లు పుటుక్కున రాలిపోయాయి. ఏ రాయికి మోదుకున్నదోగాని, నుదుట చిన్న కన్నం పడి నెత్తురు జొటజొట

కారుతూంది. బైర్లు కమ్ముకుపోయిన కళ్ళకు వాడి చుట్టూరా ఉన్న మండు టెండల ప్రపంచం మంటకీ మింటికీ అలముకున్న ఒకటే మంటలా కనిపిస్తూంది.

ఇప్పుడీ యంత్రానికి రిపేరీల మాట దేవుడెరుగు; కాస్తా విశ్రాంతి మాత్రం అత్యవసరం. రోడ్డుదాపునే పిట్టగోడ పక్కన వాడికో కానుగచెట్టు కనిపించింది.

ఆ చెట్టుకింద తా నెంతసేపు పడివుండిపోయాడో వాడికి తెలియదు. కళ్లు తెరిచి చూచేసరికి ఎండలు కాస్తా చల్లబడ్డాయి. దగ్గర్లో ఎవరో తనను పిలుస్తున్నట్టుగా తోచడంతో, ఆ కంకాళం లేచి కూర్చోడానికి ప్రయత్నించింది.

"ఒరే, అబ్బీ, విన్నే! ఇలా చూడు."

పిట్టగోడ కవతల కనిపించిన వ్యక్తి పార్వతమ్మ.

"సద్దు చేయకుండా ఆ సందుదారి వెంట పెరటివైపుకు వచ్చేసెయ్! దొడ్డిగుమ్మం తెరిచే ఉంది."

ఆ ఇంటి ముంగిట రోజూ వాడికి పట్టెడన్నం మాత్రం లభిస్తుండేది. ఆ రోజు సాయంకాలం ఆ ఇంటి పెరటిలో వాడికి ఆకువిందుకూ అన్నం కనిపించింది. ఆవురావురంటూ అన్నంపైన కలియబడేసరికి విస్తరి ఖాళీ అయిపోసాగింది.

పార్వతమ్మ లోపలికి వెళ్ళి ఓ పాతచొక్కా తీసుకువచ్చింది.

"ఒరే, అబ్బీ! ఆ నెత్తురుమరకల చొక్కాతీసి ఏ సైడు కాలవలోకైనా గిరవాటు పెట్టు. ఈ చొక్కా వేసుకో. ఇకమీద ఎప్పుడూ ఈ వీధివైపు తొంగిచూడద్దు. నుదుట గాయమెందుకు తగిలిందని ఎవరైనా అడిగితే ఇక్కడిలా జరిగిందని ఎవరితోనూ చెప్పవద్దు! ఇదిగో, ఇంకొకమాట! ఈ

చొక్కా జేబులో ఓ అయిదు రూపాయలు వేసి పెడుతున్నాను. భద్రంగా దాచుకుంటావు గదూ! దేనికైనా పనికొస్తుంది.''

ఆ క్షణాన బిచ్చగాడి కళ్ళల్లో నిలిచిన నీరే ఆనందాశ్రువులు.

వా డిప్పుడు ముకుళితహస్తుడు.

వాడు చెప్పదలచుకుని కూడా చెప్పలేకపోయిన మాట—'తల్లీ! నీలాంటివాళ్ళు వీధికొక్కరైనా ఉంటే నెలకు మూడు వానలు కురుస్తాయి!'

*  *  *  *

పై సంఘటన జరిగి ఆరుమాసాలు గడిచిన తరవాత పార్వతమ్మ, అనంతరామయ్య దంపతులు దక్షిణాది పుణ్యక్షేత్రాలను దర్శించి తీర్థయాత్ర నించి తిరిగి వస్తున్నారు. గమ్యస్థానాని కింకా యాభై మైళ్ళ దూర ముందనగా రైలొక అడివి స్టేషనులో ఆగింది. మధ్యాహ్నం మూడుగంటలవేళ. పిడచ గట్టుకపోయిన నాలుకలకు ఆ స్టేషనులో దాహోపశాంతి కలిగే వెరవు కనిపించడంలేదు. సమయాని కొక జామపళ్ల బుట్టమాత్రం కనిపించింది. ''ఒరే, అబ్బీ! ఉన్నవాటిలో మంచిదిగా చూచి ఓ జామపండు ఇలా పడేయ్'' అన్నారు అనంతరామయ్యగారు.

జామపళ్లమ్ముకుంటున్న వ్యక్తి కిటికీకి చేరువగా వచ్చి ఓ పండు అనంతరామయ్యగారి చేతిలో పెట్టాడు. పెడుతూ ఆయనవైపు పరిశీలనగా చూచాడు. మరుక్షణంలో అతడి చూపులు అనంతరామయ్యగారి పక్కనే కూచున్న పార్వతమ్మ పైకివెళ్ళి నిలిచాయి. అతడి ముఖంలో ఆనందం పొరాడింది. కళ్లల్లో కృతజ్ఞత మిలమిలలాడింది. పెదవులు గూడా కదిలాయి. కానీ అంతలోనే రైలు కదిలింది.

'ఇది మరీ బాగుంది! డబ్బు ఇవ్వడానికి కూడా వ్యవధి లేకపోతే ఏం చేయడం!' అనుకుంటూ అనంతరామయ్యగారు తాళపుగుత్తిలోని చాకుతో

పండుముక్కలుగా కోశారు. ఓ ముక్క పార్వతమ్మకిచ్చి, తానొక ముక్క నోటిలో వేసుకున్నారు.

నిమిషంలో సగం పేపు గడిచింది.

"అబ్బే, ఏం పండిది! చపీ, సారం లేదే! ఛా ఛా, చిరుచేదుగా కూడా ఉన్నట్టుందే!" అన్నారు అనంతరామయ్యగారు.

'నోటిలో వేసుకోగానే పంచదారలా కరిగిపోతున్న జామపండు చేదుగా ఉండడమేమిటి?' విస్తుపోయింది పార్వతమ్మ.

